AMMA NUDI
Telugu Monthly
Vol. 1
Issue 8
Rs. 20
October 2015
Tenali, AP

తెలుగుజాతి పత్రిక

1993-2013 నడుస్తున్న చరిత్ర

# అమ్మనుడి

అక్టోబరు, 2015

## భాషాహక్కులకై చెన్నయ్ ప్రకటన

భారతదేశంలోని అన్ని భాషలు సమానం. ప్రతి ఒక్క భాషా సమాజం తమ భాషను కాపాడుకొని, అభివృద్ధి పరిచి, సాధికారికం చేసుకొనే హక్కును కలిగి ఉండాలి. ప్రతి భారతీయ పౌరుడికి ప్రభుత్వ పరిపాలన, న్యాయవ్యవస్థ, శాసనవ్యవస్థలతో జరిపే అన్ని ఉత్తర ప్రత్యుత్తరాలు ఒక మౌలిక హక్కుగా నిరాటంకంగా మాతృభాషలోనే జరిపే వెసులుబాటు ఉండాలి. ప్రభుత్వం కూడా తన అన్ని ఉత్తర ప్రత్యుత్తరాలను ఆ ప్రాంతపు భాషలోనే జరిగేలా చూడాలి. ప్రతి ఒక్క పౌరుడికి తన మాతృభాషలోనే సమాచారం అందేలా చెయ్యాలి. ప్రతి ఒక్క పౌరుడికి మౌలిక హక్కులలో ఒకటైన విద్య మాతృభాషలోనే అందాలి. ప్రతి ఒక్క భారతదేశ పౌరుడికి వ్యాపార, సార్వజనిక సేవలు మాతృభాషలోనే అందాలి.

భారత రాజ్యాంగంలోని 17వ భాగాన్ని పరిశీలించి తగు మార్పులు చేయడానికి, సరికొత్త భాషా విధానాన్ని ప్రకటిస్తూ అందులో భారతదేశంలోని అన్ని భాషా సమాజాల సిఫారసులను, అభ్యర్థనలను ఆధారం చేసుకొని మరికొన్ని శాసనాలను చేర్చాలని మేము పిలుపునిస్తున్నాము.

మేము భారత ప్రభుత్వాన్ని ఈ కింది విషయాలపై తక్షణ చర్య తీసుకోమని అభ్యర్థిస్తున్నాము :

భారత రాజ్యాంగంలోని షెడ్యూల్ 8లో సూచించబడిన అన్ని భాషలను భారతదేశపు అధికారభాషలుగా ప్రకటించాలి.

చాలా ఏళ్ళుగా మూలనపడేసిన షెడ్యూల్ 8లో తమ భాషలను చేర్చాలన్న భాషాసమాజాల అభ్యర్థనలను గౌరవించి వెంటనే ఆ దిశగా చట్టాన్ని రూపొందించాలి.

తక్కువ జనాభా కలిగి, కనుమరుగు అయిపోబోతున్న చిన్న చిన్న భాషా సమాజాల్ని గుర్తించి వాటిని కాపాడేందుకు ప్రత్యేక ప్రభుత్వ ఏజెన్సీని రూపొందించాలి.

మాతృభాషలోనే విద్య అన్న ప్రాథమిక హక్కును అన్ని ప్రభుత్వాలు అమలు పరచాలని మేము డిమాండ్ చేస్తున్నాము.

భాషకు సంబంధించిన చట్టాలను, విధానాలను అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు అమలు పరచాలని, అలాంటి విధానాలు లేని పక్షంలో కొత్తగా భాషా విధానాలను ప్రకటించాలని మేము డిమాండ్ చేస్తున్నాము.

పై డిమాండ్లను ప్రకటిస్తూ, అన్ని రాజకీయ పార్టీల, సంస్థల మానవహక్కులపై పనిచేస్తున్న వివిధ స్వచ్ఛంద సంస్థల, విద్యా సాంస్కృతిక సంస్థల, మీడియా సహకారాన్ని కోరుతున్నాము. భాషా సమానత్వ హక్కుల బిల్లును వెంటనే ప్రవేశపెట్టాలని, అది చట్టం అయ్యేలా అందరూ సహకరించాలని కోరుతున్నాము. అలానే రాష్ట్ర ప్రభుత్వాలు మాతృభాష అమలుపై భాషా హక్కులకు, విధానాలకు, ప్రణాళికలకు సంబంధించిన విషయాల పరిష్కారంకోసం కొత్తగా ఒక భాషా కమీషన్‌ను ఏర్పరుచుకోవాలని పైన చెప్పిన మూడు అంశాలు అమలు చేసేలా చూడాలని, అందుకై న్యాయసమ్మతమయ్యే బలమైన తీర్మానాలు చెయ్యాలని కోరుతున్నాము.


- అక్కరలేని విద్యా చర్చలు
- మీడియా - విస్మృత వర్గాలు
- తమిళనాడులో తెలుగుకు ముప్పు
- క్రీ.శ. 1523 నాటి శ్రీశైలం శాసనాలు

విశాఖపట్నంలో సెప్టెంబరు 19న జరిగిన తాపీ ధర్మారావు జయంతి - తెలుగు జనమాధ్యమాల దినోత్సవం

## తాపీ ధర్మారావు పురస్కారసభ దృశ్యాలు




శ్రీ అప్పరసు కృష్ణారావుకు తాపీ ధర్మారావు పురస్కారం, సత్కారం


శ్రీ కె.ఎస్. చలం


శ్రీ చందు సుబ్బారావు


శ్రీ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్


శ్రీ ఎన్. వేణుగోపాల్


శ్రీమతి తాపీ సుజాతా షా


శ్రీ సామల రమేష్‌బాబు


శ్రీ ఎం.ఆర్.ఎన్.వర్మ


శ్రీ నాగేశ్వరరావు




సభికులు

వార్త, స్మారకోపన్యాస వివరాలు : పుటలు 34 - 39

మాతృ భాషలన్నిటినీ జాతీయ భాషలుగా గుర్తించాలని, భాషాసాధికారిత కావాలని, విద్యాహక్కుతోపాటు మాతృభాషలో ఎదిగేహక్కు ఉండాలని – 'చెన్నై డిక్లరేషన్' డిమాండ్ చేస్తున్నది. సెప్టెంబరు 20న చెన్నైలో జరిగిన ఒక కీలక సమావేశంలో వివిధ భారతీయభాషల తరపున ప్రతినిధులు పాల్గొన్న సమావేశంలో ఈ చెన్నై ప్రకటన వెలువడింది.




పుటలు....6,7,8

## లోపలి పుటలలో....


| | |
|---|---|
| **పిలుపు** : భాషా హక్కులకై చెన్నయ్ ప్రకటన .................................... | 6 |
| **సంపాదక హృదయం:** చెన్నయ్ ప్రకటనను బలపర్చండి ...................... | 7 |
| **పిట్టచూపు** : ప్రాంతీయ పార్టీలు తెలుగువారి .................. **చలసాని నరేంద్ర** | 9 |
| **మనసులో మాట:** అక్కరలేని విద్యాచర్చలు ....... **వావిలాల సుబ్బారావు** | 11 |
| **వారసత్వ సంపద:** సరిహద్దుల వివాదాల్లో ..............**ఎస్. నాగేంద్రశర్మ** | 13 |
| **తెనుగులెంక సూక్తులు-3** : .... .................**నాగభైరవ ఆదినారాయణ** | 16 |
| **తమిళనాడు వార్తలు** : తమిళనాట తెలుగుకు ..**సామల రమేష్‌బాబు** | 17 |
| **భాషావిధానం** : తెలుగు రాష్ట్రాలలో భాషా విధానం **జి.ఉమామహేశ్వరరావు, ఎ. శ్రీనివాస్**... | 19 |
| **ఇవీ ముచ్చట్లు** : మాతృభాషపై మంత్రిగారి ............... **బి.వి. అప్పారావు** | 23 |
| **జనవాణి** : ...................................................... | 24 |
| **స్పందన** : ధర్మం-మతం-రెలిజియన్.. ............... ఎం. రాజగోపాలరావు | 30 |
| **మరచిపోతున్నాం-5** : క్రీ.శ. 1523నాటి శ్రీశైలం ........... **ఈమని, మొవ్వా** | 28 |
| **తెలుగుల చరిత్ర** : తొలినాళ్లలో నౌకా వాణిజ్యం ....... **డి.పి. అనూరాధ** | 31 |
| **తాపీ స్మారకోపన్యాసం** : మీడియా-విస్మృత వర్గాలు...... ఎ. కృష్ణారావు | 35 |
| **సంస్మరణ** : పుల్లెల శ్రీరామచంద్రుడు .................. కుర్రా జితేంద్రబాబు | 40 |
| **తెలుగమ్మ ఒడిలో బౌద్ధం-8** : విద్యావిజ్ఞాన వికాసాలకి .. బొర్రా గోవర్ధన్ | 41 |
| **సంస్మరణ** : జ్యోతిబాపూలే ................................**ఉప్పల నరసింహం** | 44 |
| **చదువవలసిన పుస్తకం** : అసలు మహాత్ముడు ............................ | 45 |
| **పుస్తక సమీక్షలు** : .... ................................................ | 46 |
| **శంకరభాష్యం** : కవిత్వ ప్రేమికుడు పూజారి .......... **రాణీ శివశంకర శర్మ** | 47 |
| **వార్తలు** : విద్యావికాస వేదిక పిలుపు............................................. | 49 |
| **ఇందూరు కత** కొలువుశాల ..................................**పూదోట శౌరీలు** | 26 |

**కవితలు**

| | |
|---|---|
| మధుర స్వప్నం : | **డి. నటరాజ్ (12)** |
| ఆ తల్లి అరచి అరచి కన్నుమూసింది: | **కత్తి పద్మారావు (15)** |
| విశ్వరూపం: | **పి. లక్ష్మణరావు (16)** |
| నాడు-నేడు: | **జంజనం ఈశ్వరబాబు (24)** |
| సాగర దర్శనం: | **కృపాకర్ మాదిక (39)** |


కైసేత: **అ. రాజ్యలక్ష్మి, పార్థివ శంకర్,** రేఖాచిత్రాలు: **బాలి**
పకపకలు: **సరసి,** ఫోటోలు: **రాజేంద్రప్రసాద్**
ముఖచిత్రం: **కలిమిశ్రీ**

## రచయితలకు సూచనలు

1. విభిన్న అంశాలపై వ్యాసాలను పంపవచ్చు. ముద్రణలో 1 నుండి 3 పుటలకు మించకుండా ఉండాలి. అన్నిరంగాలలో తెలుగువారి శ్రేయస్సుకు సంబంధించిన రచనలను పంపండి. విమర్శలు విషయం పైనే ఉండాలి గాని వ్యక్తులపై గురిపెట్టి చేయరాదు. అప్రజాస్వామిక రచనలను తీసుకోలేము. సరళమైన తెలుగులో వ్రాయాలి. 2. రచనలను యూనికోడ్‌లో గాని, అను ఫాంట్స్ లో గాని టైప్ చేసి లేదా ఎ4 సైజు కాగితంపై వ్రాసి, స్కాన్ చేసి ammanudi@gmail.com కు పంపాలి. లేదా కొరియర్ / రిజిష్టర్డ్ / సాధారణ పోస్టులో పంపవచ్చు. 3. రచనతోపాటు రచన స్వంతమేనని, ఇతర పత్రికలకు గాని, ఇంటర్నెట్ పత్రికలకు గాని పంపలేదని, పరిశీలనలో లేదని, ఇంతవరకు ఎక్కడా ప్రచురణ కాలేదని హామీపత్రం విధిగా, స్పష్టంగా వ్రాసి పంపాలి. పోస్టల్ చిరునామా, ఫోన్ నెం., ఇ-మెయిల్ కూడా ఇవ్వాలి. ఈ వివరాలు లేని రచనల్ని తీసుకోలేము. 4. మాకు పంపే రచన నకలును మీ వద్ద ఉంచుకోండి. ప్రచురణకు ఎంపిక చేయని రచనలను తిప్పి పంపడం వీలుకాదు.

## కథారచయితలకు, కవులకు విన్నపం

1. మాట్లాడుకొనే తెలుగులో వ్రాసిన కథల్ని **'నడుస్తున్న చరిత్ర'** ప్రచురించిన సంగతి చదువరులకు, రచయితలకు తెలిసిందే. ఈ సంప్రదాయాన్ని **'అమ్మనుడి'** పత్రిక కొనసాగిస్తుంది. పాత్రల సంభాషణలు తప్పనిసరిగా మీ ప్రాంతంలో మాట్లాడుకొనే తెలుగు తీరులో ఉండాలి. కథాచిత్రణ కూడా మీ తెలుగు తీరులోనే ఉంటే మంచిది. కఠినమైన సమాసాలను ఉపయోగించవద్దు. తేలికైన తెలుగు మాటలు కుదరకపోతే జనం వాడుకలోని ఇతర ప్రాంతాల తెలుగు మాటల్ని వ్రాయవచ్చు. తప్పనిసరి అయితే తప్ప ఏ ఇతర భాషల మాటలను ఉపయోగించవద్దు. ఈ సూచనలే కవితలకూ వర్తిస్తాయి.

2. **'అమ్మనుడి'**లో ప్రచురణకు తీసుకొనే కథలు, కవితలు తెలుగువారి సామాజిక, భాషాసంస్కృతుల వికాసానికి తోడ్పడేవిగా ఉండాలి.

3. ప్రతినెలా ఒకటి లేక రెండు కథలను మాత్రమే ప్రచురించగలం. ముద్రణలో 2 లేక 3 పుటలకు మించకుండా ఉండేవాటినే తొలి ఎంపికకు తీసుకుంటాము. కవితలు 20 నుంచి 30 వరుస (లైన్ల)లకు మించకూడదు. ప్రతినెలా 4 లేక 5 కవితలకు మించి పత్రికలో చోటుండదు.



**రచనలు, ఉత్తరప్రత్యుత్తరాలకు : డాక్టర్ సామల రమేష్‌బాబు,** సంపాదకుడు, **అమ్మనుడి,**
జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-520004. e-mail : ammanudi@gmail.com
దూరవాణి: కార్యాలయం : *0866-2439466* సంపాదకుడు : *9848016136*

తెలుగుజాతి పత్రిక
**అమ్మనుడి**
మాసపత్రిక
• నుడి • నాడు • నెనరు

సంపాదకుడు **డా॥ సామల రమేష్‌బాబు**

శాలివాహన శకం 1937 : మన్మథ నామ సంవత్సర భాద్రపద మాసము *(ముంగానాపి) బహుళ చవితి గురువారము నుండి ఆశ్వీయుజ *(కుందాపి) బహుళ పంచమి బుధవారము వరకు
* ముంగానాపి *కుందాపి = తెలుగు నెలలు

## చందా వివరాలు

| | | వ్యక్తులకు | సంస్థలకు | విదేశీయులకు |
|---|---|---|---|---|
| శాశ్వత చందా | : | రూ.5000 | రూ.7500 | -- |
| 6 సం॥ | : | రూ.1000 | రూ.1500 | 150 డాలర్లు |
| 3 సం॥ | : | రూ. 600 | రూ.1000 | 75 డాలర్లు |
| 1 సం॥ | : | రూ. 240 | రూ. 400 | 25 డాలర్లు |

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు డి.డి.ని **'అమ్మనుడి'** పేర పంపాలి. చెక్కు పంపేట్లయితే దయచేసి అదనంగా రు.30 లు చేర్చి పంపండి.

ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు నేరుగా బ్యాంకులో డబ్బును జమచేయరాదు. NEFT / RTGS దరఖాస్తు ద్వారా మాత్రమే **'అమ్మనుడి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.
**AMMA NUDI - AXIS BANK, TENALI**
అక్కౌంట్ నెం. **915020010550189**
**IFSC Code : UTIB0000556**
ఆన్‌లైన్‌లో చందాను పంపినవారు, ఆవెంటనే దయతో - చిరునామా, ఫోన్ నెం. తదితర వివరాలను, జాబుద్వారాగాని, ఫోన్ మెసేజి ద్వారాగాని తెలుపగలరు.

చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలకు చిరునామా

**డా॥ సామల లక్ష్మణబాబు,** ప్రచురణకర్త, 'అమ్మనుడి'
8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు, **తెనాలి**
గుంటూరు జిల్లా - 522 211. ఫోన్ : 9440448244
ఇ-మెయిల్ : ammanudi@gmail.com

**చందాదారులు కోరినట్లయితే ఆన్‌లైన్‌లో కూడా పత్రికను పంపగలము. ఇందుకోసం మీ ఇ-మెయిల్ ఐడిని తప్పక తెలుపగలరు.**

### చందాదారులకు తప్పనిసరి సూచనలు

1. చందా కాలం ముగింపు తేదీ - పత్రిక కవరుమీద మీ చిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
2. మీ చందా పూర్తయ్యేందుకు ఒక నెల ముందే దయచేసి మీ చందాను పంపించండి.
3. మీ ఇంటి నెంబరు, పోస్టాఫీసు పిన్‌కోడ్ నెంబరు తదితర పూర్తివివరాలు మీ చిరునామాలో తెలియపరచాలి. మీ ఫోన్ నెంబరును, వుంటే మీ మెయిల్ ఐడి ని తెలపాలి. మీ చిరునామా మారినట్లయితే వెంటనే తెలియజేయండి.

# 'నడుస్తున్నచరిత్ర' చందా ఉన్నవారికి సూచన

**'అమ్మనుడి'** పత్రిక ఇంతకు ముందున్న నడుస్తున్నచరిత్ర ఆశయాదర్శాలతో వస్తున్నదే. కానీ పత్రికను **'తెలుగుజాతి'** ట్రస్టు ప్రచురిస్తున్నది. అయినా, కొందరి విజ్ఞప్తి మేరకు నడుస్తున్నచరిత్రకు చందాలు మిగిలివున్న వారికి కూడా వారి చందా సొమ్ముకు సరిపడా **'అమ్మనుడి'** పత్రికను పంపించాలని తెలుగుజాతి ట్రస్టు నిర్ణయించింది. కనుక ప్రతివారికి వారి చందా సొమ్ము ఇప్పుడు **'అమ్మనుడి'** చందా వివరాల ప్రకారం ఎప్పటివరకూ సరిపోతుందో - పత్రికను పెట్టి పంపే కవరుపై చిరునామా పైన ముద్రించి వుంటుంది. దానిని చూచుకొని, దయచేసి సకాలంలో **'అమ్మనుడి'** చందాను పంపించి పత్రికకు మీ మద్దతును కొనసాగించ గోరుతున్నాము.

### వెంటనే చందాలు పంపండి

అమ్మనుడి తొలి నాలుగు సంచికలను (మార్చి, ఏప్రిల్, మే, జూన్) నడుస్తున్న చరిత్ర చందా మిగిలి ఉన్నవారికి, అయిపోయిన వారికీ కూడా పంపించాము. ఇకపై చందా మిగిలిఉన్నవారికి, కొత్త చందాదారులకు మాత్రమే పంపగలము. పైన ఇచ్చిన సూచనను కొందరు గమనించి ఉండకపోవచ్చు. చూసినప్పటికీ పనుల వత్తిడిలో చందాసొమ్మును పంపించకపోయి ఉండవచ్చు. అటువంటివారు దయచేసి వెంటనే పత్రిక చందా పంపమని మనవి.

### శాశ్వత చందాదారులకు మనవి

'నడుస్తున్నచరిత్ర'కు రు. 1000 లు చెల్లించి, శాశ్వత చందాదారులుగా చేరినవారు 'అమ్మనుడి' పత్రికకు శాశ్వతచందా రు.5000 లకు గాను రు.4000 లు మాత్రం పంపి కొత్తగా రశీదు పొంద ప్రార్థన. అలా చేయలేనివారికి ఏడాదిపాటు **'అమ్మనుడి'** పత్రికను పంపించగలం. అప్పటికీ చందాను కొనసాగించలేని వారికి పత్రికను పంపజాలమని మనవి చేస్తున్నాము. దయచేసి సహకరించగోరుతున్నాము.

### విన్నపం

'నడుస్తున్నచరిత్ర' పత్రికను అనేకమందికి ఉచితంగా పంపిస్తుండేవారము. ఇకపై ఉచితప్రతులు పంపడం వీలుపడదు. పత్రిక కావలెనని కోరుకొనే వారందరూ చందాదారులుగా చేరవలసిందిగా కోరుతున్నాము. మీ మిత్రులను కూడా ప్రోత్సహించి, చందాదారులుగా చేర్చి పత్రికను శక్తివంతం చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాము. ఇంతవరకు పత్రిక పరిచయం లేనివారు మాదిరిప్రతి (శాంపుల్‌కాపి) ని కోరినచో వారికి ఉచితంగా పంపగలము.

**- ప్రచురణకర్త**

# తెలుగుజాతి (ట్రస్టు)

## విన్నపం

**ట్రస్టుకు ఈ క్రింది విధంగా విరాళాలనిచ్చి తోడ్పడ గోరుతున్నాము.**

| | | | |
|---|---|---|---|
| ప్రోత్సాహకులు | రు. 10,000/-లు | పోషకులు | రు. 25,000/-లు |
| విశిష్ట పోషకులు | రు. 50,000/-లు | రాజ పోషకులు | రు. 1,00,000/-లు |

వీరి ఫొటోతో క్లుప్తంగా పరిచయాన్ని **'అమ్మనుడి'** పత్రికలో ప్రచురిస్తాము.
వీరికి పత్రికను, ట్రస్టు ప్రచురించే పుస్తకాలను ఉచితంగా పంపిస్తాము.

సొమ్మును చెక్ / డ్రాఫ్టుగా / ఆన్‌లైన్‌లో 'TELUGUJAATHI' పేర పంపాలి.
యాక్సిస్ బ్యాంక్, సికిందరాబాదు.
అక్కౌంట్ నెం. 914020020387880 I.F.C.Code : UTIB0000068

**డా॥ సామల రమేష్‌బాబు,** మేనేజింగ్ ట్రస్టీ, 9848016136

**పారుపల్లి కోదండరామయ్య** ట్రస్టీ, 9505298565
**డా॥వెన్నిసెట్టి సింగారావు** ట్రస్టీ, 9393015584
**స.వెం.రమేశ్** ట్రస్టీ, 8500548142
**సామల లక్ష్మణబాబు** ట్రస్టీ, 9440448244

'నడుస్తున్న చరిత్ర' ప్రోత్సాహంతో ఆంధ్రప్రదేశ్‌లోనే కాక, పొరుగు రాష్ట్రాల్లోనూ నివసిస్తున్న తెలుగువారి శ్రేయస్సుకు, తెలుగు భాషోద్యమ నిర్మాణానికి కృషి జరుగుతున్నది. దానినే ఇప్పుడు **అమ్మనుడి** కొనసాగిస్తున్నది. దక్షిణ భారతదేశమంతటా చిక్కగా అల్లుకొని, మొత్తం దేశంలోనేకాక, అనేక ఇతర దేశాల్లో కూడా భాషా సాంస్కృతిక మూలాలను విస్తరించుకొనివున్న తెలుగుజాతిలో చైతన్యాన్ని పెంపొందించి, వారిలో సంఘీభావాన్ని, భావసమైక్యతను బలవరచవలసిన అక్కరను గుర్తించిన కొందరు కార్యకర్తలు అందుకోసం పనిచేస్తున్నారు. ఇందుకు తగ్గవిధంగా ఇంకా సమగ్రంగా, బలంగా ఒక పత్రికను, దానితోపాటు కొన్ని పుస్తకాలను ప్రచురించవలసిన అవసరం ఏర్పడింది. కొన్ని కార్యక్రమాల్ని కూడా చేపట్టవలసివుంది. ఇందుకోసం ఇప్పుడు 'తెలుగుజాతి' పేరిట ఒక ట్రస్టును రిజిస్ట్రేషన్ చేయించాము. (92/ 2014).

తెలుగువారు అన్ని రంగాల్లో ముందడుగు వేసేందుకు తోడ్పడటమే ఈ ట్రస్టు లక్ష్యం. తెలుగు 'అమ్మనుడి''గా కలిగినవారు ఎక్కడ నివసిస్తున్నా, వారి శ్రేయస్సు కోసం ఈ సంస్థ పనిచేస్తుంది. ఆంధ్రప్రదేశ్, తెలంగాణాలలోనే కాక ఇతర రాష్ట్రాల్లోనూ, ఇతర దేశాల్లోనూ వున్న తెలుగు ప్రజలకోసం ట్రస్టు పనిచేస్తుంది.

**'నడుస్తున్న చరిత్ర'** 2013 అక్టోబర్‌తో నిలిచింది. దాని కొనసాగింపుగా మరింత సమగ్రంగా **'అమ్మనుడి'**ని **2015** మార్చి నుండి పత్రికను ప్రచురిస్తున్నాము. పుస్తకాల ప్రచురణ కార్యక్రమంలో తొలుతగా స.వెం.రమేశ్ వ్యాసాల సంకలనం **'ఎల్లలు లేని తెలుగు'**ను విడుదల చేశాము. తక్కిన కార్యక్రమాలను కూడా చేపడతాము. ఈ ట్రస్టును బలమైన పునాదులపై, తగినన్ని వనరులతో ఏర్పరచటానికి మీ అందరి చేయూత కావాలి. ట్రస్టు నిర్మాణంలో తోడ్పడాలని విన్నవిస్తున్నాము.

### తెలుగుజాతి ట్రస్టు 'ప్రోత్సాహకులు'గా చేరిన వీరికి మా మప్పిదాలు.

**శ్రీ కె.ఎస్.బి.వి.కె. శివరావు**
**హైదరాబాదు,** సెల్: 9395582300

తెలుగు యంత్రలిపి రూపొందించి తెలుగు టైపు యంత్రాలకు తొలినాళ్ళలో నడకలు నేర్పిన నిర్దేశకుడు. జూన్ 10, 1938న జన్మించారు. 1957లోహైదరాబాద్ ప్రభుత్వ ముద్రణాలయానికి బదిలీ అయ్యాక అక్షర రూపకల్పనపైన దృష్టి కేంద్రీకరించారు. చేతికూర్పు, లైనో, మోనోటైపు యంత్రాలపై అక్షరకూర్పుపై డిజైన్లు రూపొందించారు. యు.కె. వెళ్ళి లైనోటైపు కంపెనీలో తెలుగు అచ్చులకు అనుగుణంగా యంత్ర భాగాలను డిజైన్ చేశారు. తెలుగు భాషోద్యమసమాఖ్య ఉపాధ్యక్షులు. 'ఆవలితీరం' పత్రికకు సహ సంపాదకులు.

**శ్రీ చందు సుబ్బారావు**
**తెనాలి,** సెల్: 9849381808

శ్రీ చందు సుబ్బారావు ఆర్మీ కమ్యూనికేషన్ వ్యవస్థలో 'నాయక్'గా పనిచేసి 31-1-1997న ఉద్యోగ విరమణ చేశారు.

ప్రస్తుతం తెనాలిలో రియల్ ఎస్టేట్ వ్యాపారం చేస్తున్నారు. వీరి భార్య శ్రీమతి రత్నకుమారి. కుమార్తె భవ్యశ్రీ, అల్లుడు ధనుంజయ్. వీరు టి.సి.ఎస్.లో ఉద్యోగం చేస్తున్నారు. కుమారుడు తేజస్వీ బి.ఎఫ్.ఎ.చేసి, ఫొటోగ్రఫీలో స్థిరపడ్డారు. తీరిక సమయాల్లో సమాజసేవ కార్యక్రమాల్లో పాల్గొనడం వీరికిష్టం

# మాతృభాష సాధికారితకై 'చెన్నయ్ ప్రకటన'

## పూర్వరంగం

**హిందీ** అమానుష రుద్దుడుని అరికట్టాలనే ఉద్దేశ్యంతో ప్రమోట్ లాంగ్వేజ్ ఈక్వాలిటీ అని ఒక ఉద్యమం 2009 లో ఫేస్‌బుక్, ట్విటర్ వేదికగా మొదలైంది.

ఉద్యోగ రీత్యా బెంగుళూరు నగరానికి వలస వచ్చి, అక్కడి భాష నేర్చుకోకుండా ప్రాంతీయులని తమ భాషలో కించపరిచే విధంగా మాట్లాడుతూ హిందీ గొప్పది, అది నేర్చుకోకపోతే మహాపాపం అన్నట్టు కొందరు ప్రవర్తించటంతో ఈ ఉద్యమం మొదలు అయింది. ఏటా హిందీ దివస్ పేరిట కేంద్ర ప్రభుత్వం వృథాగా డబ్బు ఖర్చు పెడుతూ ప్రాంతీయ భాషని గౌరవించకుండా హిందీని గౌరవించడంతో ఈ ఉద్యమం మరింత ఉధృతమయింది. హిందీ జాతీయభాష అని వాదిస్తున్న వాస్తవాలు తెలీని వ్యక్తులకు నిజం చెప్పడంతో ఈ ఉద్యమం తొలి అడుగులు వేసింది. హిందీ జాతీయ భాష కాదని, రాజ్యాంగం ప్రకారం అధికార భాష మాత్రమే అని. హిందీతో సమానంగా మరో 21 భాషలకు ఈ స్థాయి ఉందని చెప్పడం ఈ ఉద్యమ విశేషం.

ఫేస్‌బుక్ వేదికగానే చాలా సందర్భాలలో సంవత్సరంలో ఒక నెల పాటు ఇలా ప్రచారం చేయటం లాంటివి జరిగాయి.

ప్రస్తుత కేంద్ర ప్రభుత్వం చేస్తున్న ప్రకటనలవల్ల ప్రాంతీయ భాషల మనుగడ కష్టతరమయ్యే పరిస్థితి ఎదురు అవటంతో ఆగస్టు 15న "హిందీ బలవంతపు రుద్దుడును ఆపండి" (Stop Hindi Imposition) అన్న హ్యాష్ టాగ్ వాడి హిందీ ప్రచారం పేరుతో కేంద్ర ప్రభుత్వం, పలు సంస్థలు తెలీకుండానే ప్రాంతీయ భాషలకు చేస్తున్న చేటును అందరి దృష్టికి తీసుకువెళ్ళే ప్రయత్నం జరిగింది (ఉదాహరణకు : జాతీయ బ్యాంకుల ఫారాలు ఇంతకు ముందు వరకు మూడు భాషలలో ఉండేవి, ఇప్పుడు కేవలం ఇంగ్లీష్, హిందీలకు పరిమితమయ్యాయి, బెంగుళూరు-చెన్నై, బెంగుళూరు - హైదరాబాద్ మధ్య నడిచే రైళ్ళలో రిజర్వేషన్ చార్టులు హిందీలో మాత్రమే ముద్రించారు హిందీ దివస్ సాకుతో- ఇలాంటి ఉదాహరణలు అనేకం).

ఆ ప్రయత్నం కొన్ని చోట్ల మిశ్రమ ఫలితాలను, కొన్ని చోట్ల విజయాలను ఇచ్చింది.

అమెజాన్ లాంటి ప్రయివేట్ సంస్థ తన వాణిజ్య ప్రకటనలను కర్నాటకలో కన్నడంలో ఇచ్చే ప్రయత్నం చేసింది.

అయితే సమిష్టి కృషి, కలిసికట్టుగా లేనిదే ఫలితాలు ఆశించలేమని, ఫేస్‌బుక్ ట్విటర్ లాంటి సామాజిక వాహికల్లో ఉన్న ఎందరో భాషాభిమానులు చెన్నైలో ఒక భాషా సదస్సును సెప్టెంబర్ 19-20 తేదీలలో నిర్వహించారు.

అక్కడ భాషల మనుగడకు జరుగుతున్న చేటు, అందుకు ప్రజలు- ప్రభుత్వం-ప్రైవేటు సంస్థలు చేస్తున్న పనులపై చర్చలు జరిగాయి. వాదోపవాదాలు జరిగాయి. సభ ఆఖరున ఒక ప్రకటన చేశారు.

\- - -

సెప్టెంబర్ 20 న చెన్నైలో జరిగిన భాషా హక్కుల సదస్సులో వివిధ సంస్థలు, వ్యక్తుల ద్వారా ప్రతిపాదించి, 'భాషా హక్కుల చెన్నై ప్రకటన (డిక్లరేషన్) పేరిట విడుదలైన ప్రకటన పూర్తిపాఠం ఇది.

**9** జూన్ 1996న బార్సిలోనా, స్పెయిన్ లో ప్రకటించిన విశ్వ భాషా హక్కుల (1948 విశ్వ మానవ హక్కుల ప్రకటన, 1966 అంతర్జాతీయ పౌర మరియు రాజకీయ హక్కుల ఒడంబడిక, 1992 నాటి జనరల్ అసెంబ్లీ ఐక్యరాజ్యసమితి వారి తీర్మానం 47/135, 1989 కన్వెన్షన్ ఆఫ్ ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజెషన్స్ ఇంకా మరెన్నో అంతర్జాతీయ, జాతీయ, ప్రాంతీయ ప్రకటనల, చట్టాల, ఒడంబడికల, తీర్మానాలని అనుసరిస్తూ) ప్రకటనకి అనుగుణంగా -

**ఒక** భాష యొక్క బలవంతపు రుద్దుడుని పాక్షికంగా లేక పూర్తిగా తొలగించాలని, ఆ ప్రదేశానికి చెందని ఎంపిక చేసిన భాషలకు ప్రాంతీయ భాషను మించి ప్రాధాన్యతనివ్వడాన్ని నిరసిస్తూ, భాషా హక్కుల కోసం భారత గణరాజ్యంలోని వివిధ భాషా సమాజాలు వెలిబుచ్చిన వివిధ ప్రకటనలు, ప్రతిపాదనలను పరిగణనలోకి తీసుకుంటూ-

**భారత** కేంద్ర ప్రభుత్వం ద్వారా అమలు చేయబడుతున్న భాషా విధానాలు దేశంలోని వివిధ సముదాయాల వారు మాట్లాడే భాషల అభివృద్ధి, కొన్ని సందర్భాలలో అస్తిత్వాన్నే ప్రశ్నిస్తున్నాయన్న వాస్తవికతను గమనిస్తూ-

ప్రస్తుతం భారత రాజ్యాంగంలో ఉన్న భారతీయ భాషలకు సంబంధించిన నిబంధనలు, ఈ నిబంధనల చుట్టూ ఉన్న అన్ని శాసనాలు, నియమాలు, మార్గదర్శక సూత్రాలు భాషా సమానత్వ హక్కులను గానీ, వివిధ భాషా సముదాయాల ఆకాంక్షలను గానీ గౌరవించట్లేదన్న విషయాన్ని పరిగణనలోకి తీసుకుంటూ-

**హిందీ** భాష బలవంతపు ప్రచారాన్ని, ప్రసారాన్ని, వాడుకని, సమర్థిస్తూ ధన, అధికార రూపేణా ప్రోత్సహిస్తున్న భారత ప్రభుత్వం, పలు జాతీయ పార్టీలు, జాతీయ సంస్థలు, అధికార కేంద్ర బిందువులు, మీడియా, రాష్ట్ర ప్రభుత్వాలు, ఇటువంటి దుశ్చర్యలను అనాదిగా నిరసిస్తూ వస్తున్న చరిత్రలో నిలిచిపోయిన ఎన్నో ప్రజా ఉద్యమాలను గమనింపులో ఉంచుకుంటూ-

**అభివృద్ధి** పేరిట ఇంటా బయటా ఆంగ్ల భాష ఉపయోగాన్ని సమర్థిస్తూ ఎక్కడా లేని స్థాయిని ఆంగ్లానికి ఆపాదిస్తూ, మాతృభాషను ప్రభుత్వ ప్రైవేట్ రంగాల్లో ఆంగ్లంతో రూపుమాపుతూ, మన భాష, సాంస్కృతిక, ఆర్థిక ఎంపికలను కొద్దిమంది చేతులలోకి తోసేసిన భారత ప్రభుత్వ విధానాలను గమనిస్తూ-

షెడ్యూల్ 8లో ఉన్న భాషలను మాట్లాడేవారు వారి భాషలను భారత దేశపు అధికార భాషలుగా గుర్తించాలని, ఇతర ఎన్నో భారతీయ భాషలను మాతృభాషగా కలిగిన వారు, వారి భాషలను పై షెడ్యూల్ లో చేర్చాలని, వందల వేల చిన్న చిన్న భాషాసమాజాలు వారి భాషలను కాపాడుకోవటానికి అభివృద్ధి పరచటానికి చేస్తున్న ప్రయత్నాలను, పరిగణనలోకి తీసుకుంటూ-

**భారత** దేశపు వివిధ ప్రాంతాల అస్తిత్వమే భాషలు అనీ, ఈ భాషల వివిధతలోనే భారతీయత ఉందనీ, ప్రతిఒక్క భాషా సముదాయం యొక్క చారిత్రక, సామాజిక, సాంస్కృతిక, ప్రాంతీయతలను నిర్దేశించి కాపాడేది భాష మనుగడేనన్న విషయాన్ని నమ్ముతూ-

**తమ** తమ భౌగోళిక ప్రాంతాలలో ప్రత్యేక పరిస్థితులలో శతాబ్దాలుగా వికసించిన ప్రాంతీయ భాషలు భారతదేశ సాంప్రదాయ విజ్ఞానానికి నిధులని, ఆ భాషలను కోల్పోవడం మన అస్తిత్వాన్ని, సాంప్రదాయాన్ని, వారసత్వాన్ని, విజ్ఞానాన్ని కోల్పోవడమే అని నమ్ముతూ - చేస్తున్న ప్రకటన ఇది. ఆ ప్రకటనను ఈ సంచిక ముఖచిత్రంపై చూడండి.

***(ఆనంద్ జి, మరియు ఇతరులు, తెలుగు అనువాదం : రహ్మానుద్దీన్ )***

సంపుటి : 1 సంచిక : 8
అమ్మనుడి
అక్టోబర్ 2015

సంపాదకీయం

# "చెన్నయ్ ప్రకటన"ను బలపరచండి

సుమారు ఏభై ఏళ్ల క్రితం ఒక పత్రికలో ఓ కార్టూన్ వచ్చింది. 'నీ మనుమడు నీతో మాట్లాడుతాడట, ఇదిగో ఫోన్...' అంటూ ఒక తండ్రి తన తల్లికి ఫోను ఇవ్వబోగా, ఆ ముసలమ్మ – నాయనా నాకు ఇంగిలీషు తెలియదు కదరా? అంటుంది. అంతకంటే మూడు నాలుగు పదుల ఏళ్ళ క్రిందట 'కన్యాశుల్కం'లో గిరీశం ఇంగ్లీషు పాఠాల తమాషా గురించి గురజాడ వ్రాసింది మనకు తెలుసు. ఇంగ్లీషు నేర్చుకొంటేనే ఆధునికతవైపు అడుగులు వేసినట్లు అనే ఒక వరవడి క్రమంగా ఏర్పడుతూ వచ్చింది. సుమారు పాతికేళ్లుగా కంప్యూటర్ల యుగంలోకి అడుగుపెట్టినప్పటినుండీ – ఇంగ్లీషుతోనే భవిష్యత్తు అనే ప్రచారం ఊపు అందుకొంటూ వుంది. ఇంగ్లీషు భాష వస్తేనే కంప్యూటర్‌జ్ఞానం అనే అవగాహననుంచి బయటపడి – భాష ఏదైనా కంప్యూటర్‌కు మక్కువేనని, అది ఏ భాషతో ఎలా వాడుకొంటే అలా పనికొచ్చే సాంకేతిక సాధనమేనని క్రమంగా బోధపడింది. ఈ కీలక అంశాన్ని ఆధారం చేసుకొని 'సోషల్ మీడియా'గా పిలువబడుతున్న ఫేస్‌బుక్, ట్విట్టర్, వాట్స్‌అప్ వంటి సాంకేతిక సాధనాల ద్వారా మన యువత దూసుకుపోతున్నది. ఇంటర్‌నెట్, వికీపీడియాలలో భారతీయ భాషల్లో బోలెడంత సమాచారం రోజు రోజుకూ చేరిపోతున్నది. ఈ దారిలో వున్న యువతలో ఆత్మాభిమానం కలిగిన తెలుగువారు తగిన సంఖ్యలోనే ఉన్నారు. వాళ్లలోంచి ఆలోచనాపరులు ముందుకు వస్తున్నారు.

మాతృభాషల రక్షణ విషయంలో ఇటీవలి పరిణామాల్ని గమనిస్తున్న 'అమ్మనుడి' చదువరులకు ఆసక్తిని కలిగించే సమావేశం ఒకటి సెప్టెంబరు 20న చెన్నైలో జరిగింది. హిందీ భాషను అందరినెత్తినా రుద్దుతున్న కేంద్ర ప్రభుత్వ విధానాలను ప్రశ్నిస్తూనే, అసలు మాతృభాషల సమస్యల లోతులకు వెళ్లి చర్చించి, ఆ సమావేశం కొన్ని మౌలికమైన, కీలకమైన తీర్మానాలు చేసింది. 'చెన్నై డిక్లరేషన్' పేరుతో కొన్ని డిమాండ్లతో ఒక ప్రకటనను విడుదల చేసింది. ఆ ప్రకటనను ఈ సంచిక ముఖపత్రంపై చూడండి. దానికి సంబంధించిన వివరాలతో కూడిన సమాచారాన్ని ఈ పక్క పుటలో చదవండి.

తమ మాతృభాషలపై ఇతర భాషల ఆధిపత్యాన్ని ప్రశ్నిస్తూనే – వారు ఆలోచించిన తీరు, చేసిన ప్రకటనలు శాస్త్రీయంగా ఉన్న సంగతిని చెన్నై డిక్లరేషన్‌లో మనం గమనించవచ్చు. దేశంలోని ఇతర మాతృభాషలపై హిందీ పెత్తనాన్ని వేలెత్తి చూపి ప్రశ్నిస్తూనే, వారు దాన్నికూడా ఒకతోటి భారతీయభాషగా మాత్రమే గుర్తించిన సంగతిని గమనించాలి. అవసరమైన రాజ్యాంగ సవరణలు తెచ్చి మాతృభాషల అస్తిత్వాన్ని, సాధికారితను ఒప్పుకొని తీరాలనే డిమాండును మనం 'చెన్నై ప్రకటన'లో చూస్తాం. రాజ్యాంగంలో గుర్తించిన అన్ని భాషలనూ సమానంగా పరిగణించి తీరాల్సిందేనంటూ ఆధిపత్య ధోరణులను 'చెన్నై ప్రకటన' నిలదీస్తున్నది. రాగల అడ్డంకులను ఎదుర్కొనేందుకు విధివిధానాలను 'చెన్నై ప్రకటన' సూచిస్తున్నది.

రాజకీయాలలోనే కాదు, భాషలమీద కూడా ఆధిపత్యాన్ని రుద్దే పోకడలు జాతీయంగా హిందీకేకాదు, దక్షిణభారతంలో తమిళానికి కూడా ఆ స్వభావం ఉన్నదన్న సంగతిని మనం చూస్తున్నాం. అందుకు బలమైన రాజకీయ కారణాలున్నాయి. చిన్న భాషాజాతిగా వుండీ, భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు వల్ల తమ రాష్ట్రంలోని ఇతర భాషలపై ఆధిపత్యం వహించగల అవకాశం తమిళానికి వచ్చింది. చారిత్రక, సామాజిక, రాజకీయ పరిస్థితులు, ఉద్యమాలు దానికి ఆ అవకాశాన్నిచ్చాయి. అయితే, ఇప్పుడు ఈ చెన్నై ప్రకటనలో కూడా వారి గొంతే పెద్దది. వారి చొరవ వెనుక రాజకీయావసరాలకు పెద్దవాటా ఉంది. తోటి భాషలవారితో (తమిళం, కన్నడం) పోలిస్తే ఈ ముందడుగులోనూ మనది వెనుకడుగే. అయినా మనం ఈ అవకాశాన్ని అందిపుచ్చుకొని ముందడుగు వెయ్యడానికి సమర్థమైన మన యువత పట్టుదలతో ఉంది.

'చెన్నై డిక్లరేషన్'లో ముందుకొచ్చిన డిమాండ్లు అన్నీ తెలుగు భాషోద్యమకారులు ఒక పుష్కర కాలంగా

సంపాదకీయం

చెప్తున్నవే. అయితే వాటికి ఒక సరియైన రూపం 'చెన్నై డిక్లరేషన్'లో ఉంది.

అంతర్జాతీయంగా, జాతీయంగా అన్ని జనభాషలకూ ముంచుకొస్తున్న ముప్పును పసిగట్టి ఎదుర్కోవడానికి మన యువత సిద్ధంగా వున్నప్పటికీ – తెలుగుజాతికి సంబంధించిన సమస్యలు మరోవిధంగా ఉన్నాయి. తెలుగు రాష్ట్రాల పాలక వర్గాలకు తెలుగు గురించి పట్టదు. తమ రాజకీయ స్వార్థం కోసం జాతిహితాన్ని త్రోసిపుచ్చగల ప్రజ్ఞావంతులు వారు. నేతి బీరకాయల్లో నేయిలాగా తెలుగు గురించిన వారి మాటలు, చేతలూ ఉంటాయి. అందువల్ల తెలుగు భాషకు, ప్రజాహితానికి వారే శత్రువులయ్యారు. పైగా – ప్రజలకు తెలుగంటే ప్రేమలేదని అంటూ, వారు జాతిని ఆత్మన్యూనతవైపు నెడుతున్నారు. ప్రజల్లో ఆంగ్లంపట్ల వున్న మోజుకు కారణాలను నివారించి, తెలుగు నేర్వడం వల్లనే సరియైన ప్రగతి ఉంటుందని వారు హామీ ఇవ్వలేకపోతున్నారు. వారిపై వారికే అపనమ్మకం. శాస్త్రీయ ఆలోచనలకు స్వస్తిచెప్పి, మూఢనమ్మకాలపైనా, మత విశ్వాసాలపైనా మక్కువ పెంచుకొంటున్నప్పుడు వారికి సవాళ్లనెదుర్కొనే శక్తి ఎక్కడనుంచి వస్తుంది?

తెలిసిన 'అమ్మనుడి' – మాతృభాష – ద్వారానే తెలియని సమస్త జ్ఞానాన్నీ తెలుసుకోవాలన్న ప్రాథమిక సూత్రాన్ని పట్టించుకోకుండా జాతివ్యతిరేకంగా ప్రభుత్వ ఆలోచనలున్నాయి. ఇటువంటి పరిస్థితుల్లో వచ్చిన 'చెన్నైడిక్లరేషన్'ను తెలుగు ఉద్యమకారులు, రచయితలు, మేధావులూ శ్రద్ధతో గమనించాలి. మనసుపెట్టి ముందుకు రావాలి. ఉద్యమాలు నడపాలి. ఖచ్చితంగా ఈ విషయంలో యువతే ముందుంటుంది. మన నేతలు వారికి అడ్డుతగలకుండా, చేతనైన సహకారాన్నందించగలిగితే చాలు.

ఆంగ్లాన్ని నేర్చుకోవడానికి ఎవరికీ ఎటువంటి అభ్యంతరమూ లేదు. నిజానికి దాన్నొక భాషగా పటిష్టంగా నేర్పాల్సిందే. ఇంగ్లీష్‌లో మాట్లాడే నేర్పునుకూడా వారికి అందించాల్సిందే. ఇదంతా 'అమ్మనుడి' ప్రాతిపదికనే జరగాలి. అప్పుడే జ్ఞానవంతులూ, శక్తిమంతులూ అయిన తెలుగు యువతను మనం తయారుచేసుకోగలం. ఇంకా ప్రభుత్వం ఒక పద్ధతీ, ఆలోచనాలేని అస్తవ్యస్త ఆత్మవినాశక విధానాలను కొనసాగిస్తే అది జాతిని నిర్వీర్యపరుస్తుంది. దీనివల్ల మన యువత – క్రింది, మధ్య తరగతి స్థాయిల్లో కొనసాగేందుకే తప్ప, ఉన్నతస్థాయికి చేరుకోలేదు. కార్పోరేట్ పెత్తందార్లు, వారి భక్తులు భాగస్వామ్యం వహిస్తున్న మన ప్రభుత్వాలకు కళ్లు తెరచి చూడగల, సవాళ్లనెదుర్కోగల ధైర్యం లేదు.

ఈ పరిస్థితుల్లో దేశంలో మాతృభాషల రక్షణకు కేంద్ర ప్రభుత్వం ముందుకు రావలసిన అగత్యం ఉంది. 350 వ అధికరణంలో వున్నవల్లా అమలు జరగని సంగతులే. దానికి తగ్గట్లు కఠినమైన చట్టాల్ని తెచ్చి దేశమంతటా ఏభాషవారు ఏ రాష్ట్రంలో ఉన్నా–కనీసం ప్రాథమిక విద్యను వారి మాతృభాషలోనే నేర్చుకోవడానికి అన్ని వసతులను కల్పించాలి. మాతృభాషను ఒక రాజ్యాంగహక్కుగా గుర్తించాలి. దేశమంతా ప్రాథమిక విద్యను మాతృభాషా మాధ్యమాలలో తప్పనిసరి చేస్తూ రాజ్యాంగ సవరణ తెచ్చినపుడే ఇది అమలవుతుంది.

ఇపుడు తగిన సాంకేతిక ప్రగతి అందుబాటులో ఉన్నందున చెన్నై డిక్లరేషన్‌లో పేర్కొన్నట్లు పాలన, న్యాయ, శాసన నిర్మాణ రంగాలలో రాజ్యాంగంలోని 8వ షెడ్యూలులో వున్న భాషలన్నింటికి సమాన వినియోగ అవకాశాలు వుండాలి. కేంద్రస్థాయిలోకూడా చట్టసభల్లో భాషా ఆధిపత్య ధోరణులను రూపుమాపాలి. చట్టసభల్లో తన భాషలో తాను మాట్లాడలేనప్పుడు, జాతీయంగా ప్రాంతీయంగా తన అవసరాలను తన భాషలో తీర్చుకొనే వీలు లేనప్పుడు – అతడికి ఈ రాజ్యం పట్ల, రాజ్యాంగం పట్ల, ప్రభుత్వాల పట్ల నమ్మకం ఎలా ఉంటుంది? ప్రజాస్వామ్యం పేర తాను దోచుకోబడుతున్నాననే భావనను ఎలా పోగొట్టుకోగలడు?

పరిపాలన, చదువు అంతా స్వంత భాషలో సాగినపుడే సామాన్యుడికి గుర్తింపు, గౌరవం లభించినట్లవుతుంది. ఈ దిశగా చెన్నై డిక్లరేషన్ దారి చూపుతోంది. దానినే అందరూ బలపరచాలి. కలసికట్టుగా ఉద్యమించాలి.

భవిష్యత్తులో దేశంలో వివిధ ప్రాంతీయుల మధ్య నీటితగాదాలు పెరిగిపోతాయని కొందరు పెద్దలు అంటున్నారు. భాషలమధ్య తగాదాలు కూడా పెరిగిపోతాయేమోనని అనుమానించవలసి వస్తున్నది. సమాజంలో అట్టడుగు వర్గాలకు కీడు కలిగించే, ప్రాంతీయ పక్షపాతాలకు దారితీసే భాషావిధానాలను రూపుమాపి శాస్త్రీయమైన భాషా విధానాన్ని కేంద్రమూ – రాష్ట్రాలూ ప్రకటించి, పాటించాల్సిన సమయం వచ్చేసింది.

**29-9-2015**

సామల రమేష్ బాబు

# ప్రాంతీయ పార్టీలు తెలుగువారి భవిష్యత్తుకు హామీ ఇవ్వగలవా?

- చలసాని నరేంద్ర

**నేడు** తెలుగు వారు రెండు రాష్ట్రాలుగా విడి పోయారు. రెండు రాష్ట్రాల్లో రెండు ప్రాంతీయ పార్టీలు అధికారంలో ఉన్నాయి. రెండు పార్టీలు కూడా మరో పార్టీ తమ రాష్ట్రంలో తలెత్తుకోలేకుండా తామే, మరోవిధంగా చెప్పాలంటే తమ కుటుంబమే సుదీర్ఘ కాలం తమ రాష్ట్రంలో అధికారంలో ఉండాలనే ప్రయత్నాలు చేస్తున్నాయి. ఆంధ్ర ప్రదేశ్‌లో అయితే ప్రధాన ప్రతిపక్షం కూడా ప్రాంతీయ పార్టీయే కావడం గమనార్హం.

రాష్ట్ర విభజన ఎందుకు జరిగింది? ఎవరో అన్యాయం చేయడంతో జరుపవలసి వచ్చినదని ఇప్పుడు పంచాయతి పెట్టుకోవడం వలన ప్రయోజనం ఉండదు. తిరిగి రెండు రాష్ట్రాలను కలిపి ఒకే రాష్ట్రంగా చేద్దామని ఎవ్వరైనా అనుకొంటే పిచ్చివానిగా చూడవలసి వస్తుంది. తెలుగు ప్రజల రాజకీయ, సామాజిక, సాంస్కృతిక, ఆర్ధిక అభివృద్ధికి ఈ ప్రాంతీయ పార్టీలు ఏమాత్రం తోడ్పడగలవన్నది నేడు మనముందున్న ప్రధాన ప్రశ్న కాగలదు.

ఎందుకంటే విభజనకు ముందు పదేళ్ళపాటు ఉమ్మడి రాష్ట్రాన్ని పాలించిన కాంగ్రెస్ పార్టీ నేడు ఉనికిని కోల్పోయే స్థితిలో ఉన్నది. మరే జాతీయ పార్టీకి కూడా ఈ రెండు రాష్ట్రాల్లో నేడు చెప్పుకోదగిన బలం లేదు. వారెవ్వరూ ప్రజల ముందు ప్రత్యామ్నాయంగా నిలబడే పరిస్థితులు ఇప్పట్లో కనబడటం లేదు. దానితో తెలుగు వారి భవిష్యత్తు ప్రాంతీయ పార్టీల చేతుల్లో ఉన్నదని భావించవలసి వస్తున్నది.

నేడు ఎంత బలమైన నాయకులు అనుకున్నా, తమకు ప్రతిపక్షమే లేదని అనుకున్నా ప్రజాస్వామ్యంలో వారి మనుగడ ప్రజానిర్ణయం పైననే ఆధారపడి ఉంటుంది. రాజకీయంగా రెండు రాష్ట్రాలుగా విడిపోయినా రెండు రాష్ట్రాల మధ్య ఘర్షణలు, ఉద్రిక్త పరిస్థితులు నెలకొనడం ద్వారా, ప్రజల మధ్య విద్వేషాలను రగల్చడం ద్వారా తమ రాజకీయపబ్బం గడుపు కోవాలని ప్రాంతీయపార్టీల నాయకులు ప్రయత్నం చేస్తూ ఉండడం దురదృష్టం. రాజకీయ నాయకులు ప్రజలను భావాత్మకంగా, సామాజికంగా సుదీర్ఘ కాలం వేరు చేద్దాం అనుకొంటే నేటి సమాచార యుగంలో అది సాధ్యం కాదు.

ఉద్యోగం, ఉపాధి, వ్యాపారాల కోసం సుదూర ప్రాంతాలకు కుటుంబాలు తరలి వెళ్ళుతున్న నేటి తరుణంలో ఏ కుటుంబం ఒకే ప్రాంతానికి పరిమితం అయి ఉండలేదు. అందుచేత ప్రజలు ప్రాంతాలవారీగా విద్వేషాలు పెంచుకోనేటట్లు చేయడం ఇప్పుడు సాధ్యంకాదు. అయితే ఆ విధమైన ప్రయత్నాలు చేయడం వలన తెలుగు వారి భవిష్యత్తు అగమ్యగోచరం అవుతుందని మాత్రం మరచిపోరాదు.

తెలుగు వారి భవిష్యత్తు ఈ రెండు తెలుగు రాష్ట్రాల భౌగోళిక పరిమితులకు లోబడి ఉంటుందని అనుకోవడం ప్రమాదకరం

**అటువంటి దూరదృష్టి, నాయకత్వ చొరవ తెలుగు నాయకులలో నేడు కనిపించడం లేదు. ఎంతసేపూ తమ కుటుంబ సభ్యులకు తమ వారసత్వాన్ని భద్రపరచే ధ్యాసే గాని, తెలుగు వారి విశాల ప్రయోజనాలు, వారి భవిష్యత్తు ప్రణాళికల గురించిన దృష్టి లేకపోవడం విచారకరం. దాని వలన తెలుగు ప్రజలకు, తెలుగు రాష్ట్రాలకు మాత్రమే కాకుండా మొత్తం దేశ ప్రయోజనాలకు భంగం కలుగుతుంది. ఎందుకంటే జనాభారీత్యా గణనీయ సంఖ్యలో ఉన్న ప్రజలు జాతీయ వ్యవహారాలలో చురుకైన పాత్ర తీసుకోవడం మొత్తం దేశ ప్రయోజనాల దృష్ట్యా కూడా అత్యవసరం.**

అవుతుంది. చరిత్రలో తెలుగు వారు స్థాపించిన సామ్రాజ్యాలు సువిశాల భూభాగంలో వ్యాపించి, దేశంలో పలు ప్రాంతాలల్లో తమ ప్రభావం చూపాయని మరువలేము. జాతీయ స్థాయిలో సైతం తెలుగు వారు కీలక భూమిక వహించారు.

మహాత్మా గాంధీ కన్నా అత్యంత ప్రభావమైన సత్యాగ్రహ ఉద్యమాలు పెదనందిపాడు, బాపట్ల-చీరాల లో జరిగాయి. సాయుధంగా బ్రిటిష్ వారిని ఎదిరించిన అల్లూరి సీతారామరాజును మించిన వారు దేశంలో లేరు. శాతవాహన, విజయనగరం, కాకతీయ తదితర సామ్రాజ్యాలు తెలుగు వారి కీర్తి, ప్రతిభ, శౌర్య, పరాక్రమాలను నలుదిశలా వ్యాపింప చేసాయి.

స్వతంత్ర భారతదేశంలో సైతం రాజకీయ, సాంస్కృతిక, కళా, శాస్త్రీయ రంగాల్లో తెలుగు వారు కీలక భూమిక వహిస్తూనే ఉన్నారు. జనసంఖ్య రీత్యా హిందీ తరువాత దేశంలో తెలుగుభాష మాట్లాడేవారు ఎక్కువగా ఉన్నారు. ప్రజాస్వామ్యంలో జనసంఖ్య కీలకం కావడంతో తగు నాయకత్వం ఉంటే జాతీయ రాజకీయరంగంలో సైతం తెలుగు వారు నిర్ణయాత్మక భూమిక వహించగలరు.

**తెలుగువారు అంటే ఈ రెండు తెలుగురాష్ట్రాల్లో ఉన్నవారు మాత్రమే అనుకోరాదు. రెండురాష్ట్రాల్లో ఎంతమంది ఉన్నారో, దేశంలో ఇతర రాష్ట్రాల్లో దాదాపుగా అంతమంది ఉన్నారు. తమిళనాడు, కర్ణాటక తదితర రాష్ట్రాల్లో గణనీయ సంఖ్యలో ఉన్నారు. వీరందరినీ సమీకరించుకొని జాతీయ స్థాయిలో నిర్ణయాత్మకమైన శక్తిగా తెలుగు వారు ఎదిగే విధంగా నాయకత్వం అందించ వలసిన బాధ్యత ఈ రెండు రాష్ట్రాలలో ఉన్న ప్రభుత్వాలదే.**

**అయితే ఈ రెండు ప్రభుత్వాలు కేవలం తమ ప్రాంతీయ రాజకీయ ప్రయోజనాల కోసం ఎత్తుగడలు వేస్తూ కాలం గడుపుతున్నాయి. తెలుగు**

**భాష, సాహిత్యం, సంస్కృతి వికాసం కోసం సమిష్టిగా సమాలోచనలు కూడా జరిపే పరిస్థితులు నెలకొనకపోవడం విచారకరం. తమిళనాడు ప్రభుత్వం తెలుగు మీడియం పాఠశాలలను మూసివేయాలని నిర్ణయిస్తే ఇక్కడున్న ప్రాంతీయ పార్టీలు నోరు మెదపకపోవడం దురదృష్టకరం.**

రెండు రాష్ట్రాల్లో అధికారంలో ఉన్న రెండు ప్రాంతీయ పార్టీలు పరస్పరం విమర్శలకు దిగుతూ, రాజకీయంగా యుద్ధ మేఘాలను సృష్టిస్తున్నా కేవలం తమ రాజకీయ మనుగడ కోసమే చేస్తున్నాయని భావించాలి. ఈ రెండు రాష్ట్రాలలో జాతీయ పార్టీలు ఎదగకుండా చేయడం కూడా వీరి అజెండాగా కనిపిస్తున్నది. వీరి సంకుచిత రాజకీయాల కారణంగా రాబోవు తరాలు సంకుచిత ధోరణులతో ఎదిగితే ప్రమాదకర పరిణామాలు ఏర్పడే అవకాశం ఉన్నది.

తమ ప్రాంతాలకు చెందిన ప్రయోజనాలను కాపాడుకోవలసిందే. అయితే అందుకోసం రెండు రాష్ట్రాలు సమిష్టిగా ప్రయత్నం చేస్తే ఎక్కువ ఫలితం ఇస్తుందని, ఎక్కువ ప్రయోజనం ఉంటుందని గమనించాలి. పరస్పరం ఘర్షణ వైఖరి అవలంభిస్తే ఇద్దరూ నష్టపోతారని అర్థం చేసుకోవాలి. రెండు రాష్ట్రాలలో అపారంగా వనరులు ఉన్నాయి. అయితే పలు వనరులను సమిష్టిగా వినియోగించుకోవలసిన అవసరం ఉంది. వాటి కోసం కూడా ఘర్షణలకు దిగడం ద్వారా తమ వైఫల్యాల నుండి ప్రజల దృష్టిని మళ్ళించే ప్రయత్నాలు సంకుచిత రాజకీయ ఎత్తుగడలు మాత్రమే.

రెండు రాష్ట్రాలలలో ప్రాంతీయ పార్టీలు సుదీర్ఘ కాలం అధికారంలో ఉంటే దేశ ప్రయోజనాలకే కాకుండా, ఈ రెండు రాష్ట్రాలలోని తెలుగు వారి ప్రయోజనాలకు సైతం విఘాతం కలిగిస్తుందని  గుర్తించాలి. దేశం ఎదుర్కొంటున్న సరిహద్దులలోని ఉద్రిక్త పరిస్థితులు, ఈశాన్య ప్రాంతంలోని ఉగ్రవాద ప్రమాదాలు, విదేశాలతో సంబంధాలు వంటి అంశాలపై ప్రాంతీయ పార్టీలు ఎప్పుడైనా మాట్లాడినట్లు, కనీసం తమ సమావేశాల్లో చర్చలు జరిపిన్నట్లు చూసామా ? దేశానికి సంబంధించిన కీలక అంశాలపై కనీస అవగాహన లేకుండా రెండు, మూడు దశాబ్దాల పాటు ఇక్కడి పాలకులు వ్యవహరిస్తే ఏమవుతుంది ?

కాంగ్రెస్‌లో పట్టాభి సీతారామయ్య, సంజీవరెడ్డి, బ్రహ్మానందరెడ్డి, దామోదరం సంజీవయ్య, పి.వి. నరసింహారావు వంటివారు జాతీయ స్థాయిలో కీలక పాత్రలు వహించారు. జాతీయ వ్యవహారాలలో తమదైన ముద్ర వేశారు. వామపక్షాలలో సైతం చంద్ర రాజేశ్వరరావు, పుచ్చలపల్లి సుందరయ్య, మాకినేని బసవపున్నయ్య వంటి వారు జాతీయ స్థాయిలో నిర్ణయాత్మకపాత్ర వహించారు. జనసంఘ్‌లో జూపూడి యజ్ఞనారాయణ, తరువాత బిజెపిలో బంగారు లక్ష్మణ్, యం. వెంకయ్య నాయుడు జాతీయ స్థాయిలో కీలకపాత్ర వహించారు.

తెలుగు దేశంలో సైతం యన్ టి రామారావు, యన్ చంద్రబాబు నాయుడు గతంలో కాంగ్రెస్ వ్యతిరేక కూటముల ఏర్పాటులో కీలక పాత్ర వహించినా, ప్రస్తుతం రెండు రాష్ట్రాలలోని ప్రాంతీయ పార్టీల నేతలు తమ రాష్ట్రాలకే పరిమితం అవుతున్నారు. తమ మనుగడ కోసం జాతీయ స్థాయిలో రాజీ ధోరణులను అవలంబిస్తున్నట్లు ఆరోపణలు ఎదుర్కొంటున్నారు. తమ బలహీనతలను కప్పిపుచ్చుకోవడంకోసం, తమ వ్యక్తిగత ప్రయోజనాల కోసం లొంగిపోతూ ఉండడంతో కేంద్రంలో వీరి వాదానికి బలం ఉండడం లేదు.

ఇటువంటి పరిస్థితులు తెలుగువారి భవిష్యత్తుకే కాకుండా దేశ భవిష్యత్తుకు కూడా నష్టకరం కాగలవు. హిందీ మాట్లాడేవారు పలు రాష్ట్రాలలో ఉన్నా, ప్రముఖ నాయకులు ఒకొక్క రాష్ట్రానికే పరిమితం అవుతున్నా వారి వ్యవహారం మాత్రం జాతీయ స్థాయిలో ప్రాధాన్యతను సంతరింప చేసుకొంటుంది. ఉదాహరణకు రాష్ట్రీయ జనతాదళ్ ఒక రాష్ట్రానికి చెందిన ప్రాంతీయ పార్టీ. అయినా 'రాష్ట్రీయ' అని పేరు పెట్టుకోవడం ద్వారా తమ దృష్టి అంతా జాతీయ స్థాయిలో అనే సంకేతం ఇస్తున్నారు. శరద్ పవార్ ఒక రాష్ట్రానికి చెందిన నాయకుడు మాత్రమే. అయితే ఆయన పార్టీ పేరు 'జాతీయ' అంటూ ప్రారంభం అవుతుంది.

అటువంటి దూరదృష్టి, నాయకత్వ చొరవ తెలుగు నాయకులలో నేడు కనిపించడం లేదు. ఎంతసేపూ తమ కుటుంబ సభ్యులకు తమ వారసత్వాన్ని భద్రపరచే ధ్యాసే గాని, తెలుగు వారి విశాల ప్రయోజనాలు, వారి భవిష్యత్తు ప్రణాళికల గురించిన దృష్టి లేకపోవడం విచారకరం. దాని వలన తెలుగు ప్రజలకు, తెలుగు రాష్ట్రాలకు మాత్రమే కాకుండా మొత్తం దేశ ప్రయోజనాలకు భంగం కలుగుతుంది. ఎందుకంటే జనాభారీత్యా గణనీయ సంఖ్యలో ఉన్న ప్రజలు జాతీయ వ్యవహారాలలో చురుకైన పాత్ర తీసుకోవడం మొత్తం దేశ ప్రయోజనాల దృష్ట్యా కూడా అత్యవసరం.

అన్ని పంటల్లో పొగాకు పంట లాభదాయకం. పొగాకు రైతులు అంటే సంపన్నులు అనే అభిప్రాయం సాధారణంగా ఉంటుంది. అటువంటి పొగాకు రైతులు ముగ్గురు ఆత్మహత్యలు చేసుకోవలసి వస్తే, పరిస్థితులు అంత దారుణంగా మారేవరకు వాస్తవాలు తమకు తెలియవని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రజలముందు అమాయకంగా నటించడం విస్మయం కలిగిస్తుంది. అందుకు పొగాకు బోర్డు చైర్మన్‌ను బాధ్యులనుచేసి బదిలీ చేసారు.

అయితే ఇక్కడున్న రాజకీయ పార్టీలలో పొగాకు వ్యాపారులు కీలక పాత్ర వహిస్తున్నారు. వారికి అన్ని రాజకీయ పార్టీలలో బలమైన అండ ఉన్నది. వారే రైతుల దుస్థితికి కారకులు అవుతున్నారు. అటువంటి నాయకుల ప్రాబల్యం గల ప్రభుత్వాలు పొగాకు రైతుల సమస్యలు పట్టించుకొంటాయని అనుకోవడం భ్రమ మాత్రమే కాగలదు.

మరో వంక తెలంగాణలో ప్రతి రోజు రైతుల ఆత్మహత్యలు, కల్తీ కల్లు మరణాలు చూస్తున్నాము. ఈ ప్రభుత్వం, పాలకులు, నాయకులు, వ్యవస్థ తమను ఆదుకొంటుంది అనే భరోసా ఇవ్వలేక పోవడం వల్లనే రైతులు ఆత్మహత్యలకు దిగుతున్నారని గమనించాలి. ఈ ఆత్మహత్యలు నేటి రాజకీయ వ్యవస్థ మీద రైతులు ప్రకటిస్తున్న అవిశ్వాసంగా అర్థం చేసుకోవాలి. దారుణంగా సామాజిక పరిస్థితులు మారుతుంటే అధికారంలో ఉన్నవారు ప్రేక్షక పాత్ర వహిస్తూ ఉండడం బాధాకరమైన విషయం. ఇటువంటి పరిస్థితులలో తెలుగు వారి భవిష్యత్తు భద్రంగా ఉంటుందని భావించలేము.

**రచయిత  శ్రీ చలసాని నరేంద్ర పాత్రికేయుడు,**
**హైదరాబాదు. ఫోను: 9849569050**

- డా॥ వావిలాల సుబ్బారావు

# అక్కరలేని విద్యాచర్చలు మళ్లీ మొదలు

పాఠశాల విద్యారంగంలో మళ్లీ చర్చలు లేవదీశారు. ప్రతిమండలంలో ఉపాధ్యాయులు - విద్యానక్తులు - కలిసి చర్చించాలన్నారు. 1వ తరగతి నుండి ఇంగ్లీషు మాధ్యమాన్ని ప్రభుత్వ రంగ పాఠశాలల్లోగూడ ప్రవేశపెట్టటం ఒక చర్చ. అంటే ఆ ఆలు మానేసి ABCD లు నేర్చుకోవటమా! లేక 56+26 అక్షరాలు 82 అక్షరాలు నేర్పటమా అన్న సమస్య. రెండవది డిటెన్షన్లు పెట్టాలా వద్దా! - ఇప్పుడు 1వ తరగతిలో చేరితే 10వ తరగతి వరకు సరాసరి వెళ్లిపోవటమే... అంటే 1వ తరగతిలో చేరి 10వ తరగతిలో పరీక్ష వ్రాయటం అన్నమాట.




ఎందుకొచ్చిన వృధా చర్చలు ఇవి? తెరచాటున నిర్ణయాలు జరిగిపోయే ఉంటాయి. ఆ తర్వాత చర్చల తోలుబొమ్మలాట మొదలవుతుంది. బొమ్మలు ఆడి ఆడి అలసిపోయి కావిడిపెట్టెలో పడిపోతాయి. ఆడించినవాడు మర్నాడు కార్పోరేటు గడపల దగ్గర చందాలు తెచ్చుకుంటాడు. మనం బట్టలకంటిన దుమ్ముదులుపుకొని యింటికెళ్లి పడుకుంటాం. 'ఇంతేరా జీవితం– తిరిగే రంగులరాట్నము...'

అన్ని విషయాల్నీ ప్రభుత్వం వేసిన అనేక విద్యా కమిషన్లు స్పష్టం చేసే ఉన్నాయి. దాదాపు 15 సంవత్సరాలుగా భాషోద్యమకారులు ప్రజలతో ప్రభుత్వంతో చర్చిస్తూనే ఉన్నారు. అయినా ఇంకా తేలలేదట! ఇవన్నీ చాలక ప్రభుత్వ సంచీలో అధికారభాషా కమీషన్ ఉంది. భాషా సాంస్కృతిక మంత్రిత్వశాఖ గూడ క్రొత్తగా వచ్చింది. భాషోద్యమంవారి ముసాయిదానే స్వీకరించి బహిరంగ చర్చలు చేయవచ్చుగదా! చేయరు. అంటే వీరికి వేరే ఎజెండా ఉన్నదన్నమాట – అదే బయటపెట్టవచ్చుగదా!

విద్యాబోధన విషయంలో విధాన నిర్ణయాలు వీధిమెజారిటీలో తేలవు. నిపుణుల చర్చల సారాంశాన్ని పాటించాలి. మోజులవెంట పోయే సాధారణ ప్రజలకు లోతుపాతులు తెలియవు. విద్యానిపుణుల అభిప్రాయాలను ప్రజలచేత ఆమోదింపజేయాలి.

రేపటి సమాజం పాఠశాలల్లోనే తయారవుతుంది. కనుక అర్థవంతమయిన చర్చలు తప్పక జరగవలసిందే. రేపటి సమాజం ఎట్లా ఉండాలి అన్నది ఎవరు భావించగలరు? ఒక వంద సంవత్సరాలు ముందుకు చూడగలవారు, ఆరోగ్యవంతమయిన సమాజాన్ని పరస్పర ప్రేమానురాగాలు గల సమాజాన్ని ఊహించగలవారు – అందుకు బాటలు వేయగలవారు – ఆ లక్ష్యానికి విద్యా ప్రణాళికలు వేయగలవారు చెప్పాలి. సంపద పెంచటం ఒక్కటే అన్నింటికి పరిష్కారం అనుకున్న వారి మాటలు సంపదవరకే పనికి వస్తాయి. విలువలు వారి ఎజెండాకాదు. అప్పుడు తయారయ్యే భవిష్యత్తరం సంపదలో ఓలలాడే క్రూరమైన సమాజం పుట్టుకు వస్తుందేమోనని పునస్సమీక్షించుకోవాలిగదా?

విద్యావ్యవస్థలో ఉపాధ్యాయుణ్ణి సిలబస్ బట్వాడా చేసే యంత్రంగా మార్చివేసారు. అతని పాత్రను నిర్వీర్యం చేశారు. ఒకవైపు గిరిజన పాఠశాలల్లో గూడ ఇంగ్లీషు మీడియం అంటారు. మరొకవైపు వారి ఆదివాసీ భాషల్లో వాచకాలు వ్రాసి వారి స్వంతభాషకు దూరం కాకుండా చూడాలంటారు. సెక్యులరిజం అంటారు. మత విద్యాసంస్థలకు అనుమతిస్తారు. సమసమాజం అంటారు. ఉన్నవారి విద్యవేరు – లేనివారి విద్యవేరు వారి సౌకర్యాలు వేరు – వీరి సౌకర్యాలు వేరు. వీరి మీడియం వేరు – వారి మీడియం వేరు.

ఇవన్నీ ఒక ఎత్తు. పట్టించుకోని మరి ఒక అంశం ఉంది. చదువు అంటే సమాచారం సరఫరా చేయటం తప్ప నేర్పవలసిన అంశాలు మరేమీలేనట్లు విద్యాప్రణాళికలు కనిపిస్తాయి.

విద్య నేర్పటానికి నేర్చుకోవటానికి ఆర్థికమే ఆధారం అయినపుడు గమ్యంగూడ ఆర్థికమే అయినపుడు – లాభార్జనే ఫలితం అవుతుంది. ఎవరూ చెప్పకుండానే అది వ్యాపారం అవుతుంది. ఉద్యమపోరుడు – పరస్పర గౌరవం – సమానత్వం – మొదలయిన మాటలకు అర్థమే ఉండదు. ఇది డబ్బును నిందించటం కాదు. దాని అవసరం తెలియని సర్వసంగ పరిత్యాగి మాటలు కావు. ప్రాధాన్యతల గురించే ఆలోచన.

పరస్పర ప్రేమ – కరుణ – ఎదుటివారి విజయాలపట్ల గూడ సంతోషం – కృతజ్ఞత – పదిమంది శ్రేయోకాంక్ష – మొదలైన మాటలనుండి చాలా దూరం జరిగిపోయాము. కనీసం సినిమాల్లోనయినా కనిపించటం లేదు. పై మాటలకు అర్థాలు తెలియక అంతర్జాలంలో గూగుల్‌లో వెతకవలసిన తరం వస్తుంది. తల్లిదండ్రులు ఎ.టి.ఎం.లు మాత్రమే అయ్యే రోజులు వస్తున్న జాడలు కనిపిస్తున్నాయి.

ఇదంతా 'సినికల్' ప్రేలావన కాదు. ఇట్లా ఎందుకు జరుగుతున్నదని ప్రశ్నించుకుంటే – అనగా అనగా ఒకరాజు, ఏడుగురు కొడుకులు – ఎండవేసిన ఏడు చేపలలో – ఎండని చేపను ప్రశ్నించుకుంటూ పోతే నా బంగారు పుట్టలో వేలుపెడితే కుట్టనా అన్నది చీమ. అక్కడే మన సమాధానం గూడ దొరుకుతుంది. 'నా బంగారు బడిని నాశనం చేస్తే మీరు మాత్రం నాశనం కారా' అంటుంది విద్య. చీమ కన్నంలాగ బడిగూడ చిన్నదిగానే కనిపించవచ్చు. రేపటి సమాజానికి బలమయిన వ్రేళ్లు అక్కడే ఉన్నాయి. సమాజానికి పోషకాలు

అక్కడనుండే అందుతాయి. ఆ మొక్కకు రూపాయలలో ఇంగ్లీషునీళ్లు పోస్తే ఆ చెట్టుకొమ్మలు పరదేశంలో డాలర్లు కాస్తాయేమోగానీ నీరు పోసినవారికి నీడ కూడా దొరకదు.

ఈ విద్యలో పెరిగిన శాస్త్రవేత్తలు యుద్ధనైపుణ్యాలకు పరిశోధనలు చేస్తారు. గుండెలు మారుస్తారు. ఇపుడు తలలు గూడా మారుస్తామంటున్నారు. అన్ని అవయవాలకు స్పేరుపార్టులు దొరికే దుకాణాలు రాబోతున్నాయి. సంపర్కం లేకుండా క్లోనింగు సృష్టి జరుగుతున్నది. అద్దె గర్భాలు ఇచ్చట దొరకును. తల్లిపాల పేకెట్లు దొరకును. దైవకణం కోసం (ఇది దేవుడు కాదు సుమా!) లక్షలకోట్లు వెచ్చించగలం కాని–

రక్తంలో ప్రేమకణాలను – కారుణ్య ద్రవాన్ని పెంచటం ఎట్లా? రక్తంలోనుండి నేరస్వభావాన్ని తోడివేసి క్రూరత్వాన్ని ఎండించి జాలిద్రవాన్ని నింపటం ఎట్లా? దయాస్వభావాన్ని క్లోనింగు చేయటం ఎట్లా? ఆత్మహత్యలకు జీన్సు కారణమట– ఆ జీన్సును తొలగించి ఆత్మవిశ్వాసపు జెనిటిక్సు శాస్త్రాభివృద్ధి చేయటం ఎట్లా! ఈ పరిశోధనలకు ఏ ప్రభుత్వము నిధులు కేటాయించదు. ఇవి సఫలమయితే రక్షణ బడ్జెట్ ఎత్తివేయవచ్చుగదా? – ఒకవేళ ఎవరయినా పరిశోధించి కనిపెట్టినా ఎవరూ కాపీరైటు ఇవ్వరు – కనుక్కొన్నా రాయల్టీలు ఇవ్వరు. ఎందుకంటే "ద్వేషం యిచ్చే పర్సంటేజి ప్రేమ ఎలా ఇవ్వగలదు".

సమాచార సరఫరా కేంద్రాలుగా మాత్రమే ఉన్న పాఠశాలల్లో వ్యక్తిత్వ శిక్షణకు మార్గాలు లేవా? అటెండెన్సు వేసే సమయంలోనే విద్యార్థికి శ్వాస గమనింపులో శ్రద్ధను నేర్పవచ్చు. పాఠం అయిపోయిన వెంటనే అందులో నేర్పిన విషయం సమాజానికి ఎట్లా ఉపయోగపడుతుందో, ఎట్లా దుర్వినియోగం కాగూడదో చెప్పవచ్చు.

సాహిత్యం అంటే సమాసాలు, సంధులు, వర్ణనలు కావు. విలువలను అనువర్తింపచేయటం – ప్రయోజనాతీతమయిన జీవితసారాన్ని వివరించటం – క్రీడలలో సంతోషం కోసం – ఉల్లాసం కోసం ఆడుకోవటం ఏనాడో పోయింది. ఆటలన్నీ జయేచ్ఛ (హతం చేయటం – Killer Instinct) తో స్పర్ధలతో నిండిఉన్నాయి. దీనితో బెట్టింగులు– స్టెరాయిడ్ మందులు వాడటం వంటి నీచమార్గాలు పట్టింది – క్రీడాసక్తి పోయింది. సాటివాడి నైపుణ్యాన్ని మెచ్చుకొనే ఉదారతలేదు.

మిత్రుల సుగుణాలు చెప్పించే అలవాటు చేయాలి. ఎదుటివారి విజయాలను అభినందించటం నేర్పాలి. ఇవన్నీ పాఠ్య ప్రణాళికల్లో ఉండవు. మార్కులు, అవార్డులు అక్కరలేదు. అయినా నేర్పాలి. పిల్లవాడి చదువుకోసం ఎందరు శ్రమిస్తున్నారో అర్థం చేయించి, కృతజ్ఞత నేర్పాలి. ఇదొక డ్రిల్లుక్లాసులాగా కాదు.

ఈ లక్ష్యాలపై ఎక్కడా చర్చలు జరగవు. ఈ అభ్యాసాలు 7వ తరగతి లోపలే జరగాలి. ఆ తర్వాత ఆ స్వభావం బలపడుతుంది. ప్రేమ సహకారాలలో ఒకటిగా ఉండే సమాజం కావాలా! జయేచ్ఛ, ఆధిపత్య గర్వాలతో నిండిన – వర్గాలు వర్గాలుగా చీలిన సమాజం కావాలా నిర్ణయించుకోవాలి. మీడియం – డిటెన్షన్లకన్నా ఇవి ముఖ్యం. కాదా!


**రచయిత డా॥ వావిలాల సుబ్బారావు**
**విశ్రాంత అధ్యాపకులు, రచయిత, విమర్శకులు**
**ఫోన్. 9866402973**


**కవిత**

# మధురస్వప్నం

**సా**లెగూట్లో చిక్కుకున్న చీమని
గబగబా వెళ్ళి చిక్కుతీసి రక్షించాను
చీమ చాలా సంతోషపడింది
కష్టపడి జీవించు, జీవితం ధన్యం అవుతుందని
చెప్పింది

**క**రిచే కుక్కనుండి ఒక బాబుని తప్పించాను
వాడు నాకు భలే మంచి నేస్తం అయ్యాడు
ఆపదలో ఆదుకున్నవాడే నిజమైన నేస్తం అని తెలుసుకున్నాను

**పి**చ్చుక తినకుండా ఒక సీతాకోకచిలుకని రక్షించాను
ఆ సీతాకోకచిలుక నాకు పూలతోటలన్నీ చూపించింది
ప్రేమ అనే గుణం మనలో వుంటే ప్రపంచం
ఎంత అందమైనదో తెలుస్తుందని చెప్పింది

**ఒ**క కప్పుని నీటిలోకి జారవిడిచాను
అది ఎంతో ఆనందపడింది
బిడ్డను తల్లి దగ్గరకు చేర్చినప్పుడు అది
ఎంత ఆనందపడుతుందో తెలిసింది.

**మా** ఇల్లు నాకిప్పుడు ఎంతో బావుంది
ఇంట్లో వున్న ప్రతీ నిమిషం నాకొక
తీయ్యని స్వప్నంలా వుంటోంది.


**– డి. నటరాజ్**
ఫోన్: 9440428597


## రచయితలకు, కవులకు 'ఉపాధ్యాయ' ఆహ్వానం

గత 67 సం॥లుగా వెలువడుతున్న ఏ.పి.టి.ఎఫ్. అధికార మాసపత్రిక 'ఉపాధ్యాయ' గత 6 సం॥లనుండి కథలు, కవితల పోటీలు నిర్వహిస్తున్నది.

| | 1వ బహుమతి | 2వ బహుమతి | 3వ బహుమతి |
|---|---|---|---|
| కథలకు: | రు. 5,000/- | రు. 4,000/- | రు. 3,000/- |
| కవితలకు: | రు. 2,000/- | రు. 1,500/- | రు. 1,000/- |

రచయితలు, కవులు తమ రచనలను 31-10-2015లోగా సంపాదకులు, **ఉపాధ్యాయ,** సింగరాజు భవన్, 29-7-22, విష్ణువర్ధనరావువీధి, సూర్యారావుపేట, విజయవాడ-2. ఫోను: 0866-2433505 చిరునామాకు పంపవలసిందిగా కోరుతున్నాం.

- సంకేపల్లి నాగేంద్రశర్మ

# సరిహద్దుల వివాదాల్లో శాతవాహనుల కాలంనాటి ధూళికట్ట బౌద్ధస్థూపం




ధూళికట్ట బౌద్ధ స్థూపాల వద్ద వ్యాసకర్త శర్మ

**క**రీంనగర్ జిల్లాలోని శాతవాహన రాజులకాలంనాటి ప్రాచీన ధూళికట్ట బౌద్ధస్తూపానికి మంచిరోజులు వచ్చే అవకాశాలున్నా, రెండు గ్రామాల మధ్య సరిహద్దు వివాదాలు రావడంతో ఈ అపూర్వ స్థూపం అభివృద్ధి ఆఖరు క్షణంలో ఆగిపోయినట్లయింది. ధూళికట్ట, వడుకాపూర్ గ్రామాల మధ్య ఈ స్థూపం సరిహద్దు వివాదంలో ఇరుక్కుపోవడంతో ఈస్థూపం అభివృద్ధి ఎవ్వరు చేయాలన్న విషయం ప్రశ్నార్థకమైపోయింది. ముఖ్యమంత్రిగా ఉన్న ఎన్‌టిఆర్ హయంలో జిల్లాలో 56 మండలాలు ఏర్పడగా, 2002లో ఎలిగేడు మండలం ఏర్పాటైంది. ఈ జిల్లాలో బౌద్ధం తొలినాళ్లలోనే పరిఢవిల్లిందని, భావరి అనే సాదువు బుద్ధుని వద్దకు తమ శిష్యులను పంపి, బౌద్ధాన్ని స్వీకరించి, బౌద్ధమత వ్యాప్తి చేసినట్లు బౌద్ధసుత్తని పిటకాలు చెబుతున్నాయని, చరిత్రకారులు నిర్ధారించారు. అమరావతి, ఫణిగిరి, నేలకొండపల్లి, నాగార్జునకొండ, కేసనపల్లి, చందవరంలాగా ఈ దూళికట్ట బౌద్ధస్థూపం తెలంగాణారాష్ట్రంలోనే పురాతనమైనది, ప్రశస్తమైనది. ఈ స్థూపం వద్దకు చేరుకోవడానికి జూలపల్లి మండలంలోని వడుకాపూర్‌నుండి రెండున్నర కిలోమీటర్ల తోవను వేయడానికి గ్రామసర్పంచ్, ఎంపిటిసిలు ముందుకు వచ్చి, ఆఖరు క్షణంలో ఆగిపోయినట్లు తెలిసింది. కొత్తగా ఏర్పాటైన ఎలిగే మండలం ధూళికట్ల బౌద్ధ స్థూపం తమ పరిధిలో వుందని, కాదు తమ పరిధిలోకి వస్తుందని వడుకాపురం గ్రామస్తులు వాదిస్తుండటంతో ఈవివాదం సరిహద్దు దేశాల సమస్యగా మారిపోయింది. ధూళికట్ట గ్రామం ఎలిగేడు మండలం పరిధిలో వుండగా, స్థూపం వున్న వడుకాపురం మాత్రం జూలపల్లి మండలంలో వుంది. ఈస్థూపం అభివృద్ధికై రాష్ట్రపురావస్తుశాఖ నుండి 18 లక్షల రూపాయలు మంజూరీకాగా, స్థూపం వున్న వడుకాపురం మాత్రం జూలపల్లి మండలంలో వుంది. ఈ స్థూపం అభివృద్ధికై రాష్ట్ర పురావస్తుశాఖ నుండి 18 లక్షల రూపాయలు మంజూరికాగా, స్థూపం వద్దకు చేరుకోవడానికి సరైన రోడ్డు సౌకర్యం లేకపోవడం వల్ల, ఈ నిధులు మురిగిపోయే అవకాశం ఏర్పడింది. గుంటూరు జిల్లా అమరావతికి సమాంతరమైన ఈ ధూళికట్ట బౌద్ధ స్థూపాన్ని పర్యాటక కేంద్రంగా తీర్చిదిద్దుతామని కరీంనగర్ పురావస్తు సహాయ సంచాలకులు ఆర్. మల్లిఖార్జునరావు, జిల్లా టూరిజం అధికారి ఆర్. వేంకటేశ్వరరావులు గత రెండు మూడు నెలల కిందట హామీ ఇచ్చారు. పురావస్తు అధికారి మాత్రం ప్రస్తుతం ఇటీవల ఆంధ్ర ప్రాంతానికి బదిలీ అయ్యారు. ఈ స్థూపం మరమ్మత్తులకు 20 లక్షలు, చుట్టు కంచె వేయడానికి 16 లక్షల రూపాయలు మంజూరు అయ్యాయని వీరు చెప్పారు. 1978–79లో వెలుగులోకి వచ్చిన ఈ బౌద్ధస్థూపం ప్రత్యేక ప్రాధాన్యత సంతరించుకుంది. అప్పటి పురావస్తుశాఖాధికారి డా.. వి.వి. కృష్ణశాస్త్రి, జిల్లా పురావస్తు పరిశోధకులైన స్వర్గీయ ఠాకూర్ రాజారాంసింగ్‌లు సంయుక్తంగా తవ్వకాలు జరిపి, పొలాలలో వున్న ఈ ధూళికట్ట స్థూపాన్ని వెలుగులోకి తెచ్చారు. 19 గుంటల స్థలంలో ఈ చారిత్రిక స్థూపం వర్తులాకారంలో విస్తరించి వుంది. ఈ బౌద్ధక్షేత్రాన్ని అభివృద్ధి చేయడానికై సుమారు 12 లక్షల రూపాయలు వెచ్చించి, 9 ఎకరాల స్థలం సేకరించినట్లు, ఇందులో 9 లక్షల చెల్లింపులు భూయజమానులకు జరిగాయని, మిగతా 3 లక్షల బకాయి సొమ్ము చెల్లించాల్సి వుందని జిల్లా పురావస్తుశాఖ అధికారులు చెప్పారు. 2003లో ఈ స్థూపం చుట్టు ఇటుక కట్టడాలకు 36 లక్షల

రూపాయలు మంజూరీకాగా, కేవలం 15 లక్షల రూపాయలు ఖర్చుచేసి అర్థాంతరంగా మరమ్మత్తులను ఆపివేసి, నిర్లక్ష్యం చేశారని వడుకాపూర్ గ్రామస్తులు చెప్పారు. వడుకాపూర్ పంచాయతీ సరిహద్దులో ఈ స్థూపం వుంది. ఈ స్థూపం పేరు మాత్రం ధూళికట్ట బౌద్ధస్థూపమని రెవెన్యూ, పురావస్తు రికార్డులలో రాయబడి వుందని పురావస్తు శాఖ అధికారులు అంటున్నారు. ఈ స్థూపం వెలుగులోనికి వచ్చి గత నాలుగు దశాబ్దాలైనా ఈ స్థూపం చేరడానికి సరైన రోడ్డు సౌకర్యం లేకపోవడం చరిత్రాభిమానులకు, బౌద్ధాభిమానులకు ఆందోళన గురిచేస్తోంది. గత ఉమ్మడి ప్రభుత్వాల నిర్లక్ష్యం వల్ల ఈ స్థూపం అభివృద్ధి నామమాత్రమై పోయింది. ఈ ఏడాది మే 10వ తేదీ, వైశాఖ 2559వ బౌద్ధపూర్ణిమను పురస్కరించుకుని, ధూళికట్ట వద్ద నిర్వహించిన ఉత్సవంలో గ్రామస్థులతోపాటు, సుమారు రెండువందలకు పైగా దళిత నాయకులు, బౌద్ధ భిక్షువులు పాల్గొని, ప్రత్యేక ప్రార్ధనలు చేశారు. ఈ స్థూపం అభివృద్ధికి అన్ని రకాల ప్రయత్నాలు చేస్తామని వీరు శపథం చేశారు. సుమారు రెండువేల సంవత్సరాలనాటి ఈ ప్రాచీన బౌద్ధస్థూపాన్ని ఇక నిర్లక్ష్యంచేసే ప్రసక్తే లేదని జూలపల్లి మండలం వడుకాపూర్ గ్రామ సర్పంచ్ కనకట్ల కళావతి, గ్రామ ఎంపిటిసి కొట్టె రాజయ్యలు చెప్పారు. తమ గ్రామంలో ప్రాచీన బౌద్ధస్థూపం వుండటం తమ గ్రామచరిత్రకే గర్వకారణమని వీరన్నారు. ఈ స్థూపం వరకు నాలుగు బిట్లతో రోడ్లను వేయడానికి 12 లక్షల పదివేల రూపాయలు మండలపరిషత్ నిధులు మంజూరీకి ప్రతిపాదనలు వెళ్ళాయని వీరు అన్నారు. జూలపల్లి జడ్పిటిసి రఘువీర్‌సింగ్ మాట్లాడుతూ, ఈ స్థూపం అభివృద్ధికి తమ సహాయ సహకారాలు అందజేస్తామని హామీ ఇచ్చారు. ఎలిగేడు మండల ప్రతినిధులు, ధూళికట్ట గ్రామ ప్రతినిధులు మాత్రం ధూళికట్ట ఎలిగేడు మండలంలో వున్నందున ఈ స్థూపం అభివృద్ధిలో తామే పాలు పంచుకుంటామని గట్టిగా వాదిస్తున్నట్లు తెలిసింది.

**ధూళికట్ట స్థూపం ప్రత్యేకత:** ఈ ధూళికట్ట బౌద్ధస్థూపం హీనయానానికి చెందింది. విగ్రహారాధన ఇక్కడ వుండదు. ఇది ఆరు మీటర్ల ఎత్తున వుంది. చుట్టు 3 నుండి 5 మీటర్ల ఎత్తుగల మట్టి ప్రాకారం వుంది. అమరావతి ధాన్యకటకం లాగా దీన్ని ధూళికట్టకము (మట్టిస్తూపం) అయి, కాలక్రమేణా ధూళికట్టగా మారే అవకాశం రావచ్చునని జిల్లా చరిత్రకారుడు డా॥ జైశెట్టి రమణయ్య తాను రాసిన పుస్తకంలో అభిప్రాయపడ్డారు. క్రీ.పూ.3వ శతాబ్దిలో మెగస్తనీస్ పేర్కొన్న 30 బలిష్టమైన ఆంధ్రదుర్గాలలో ఇది ఒకటిగా వుండవచ్చునని చరిత్రకారులు భావిస్తున్నారు. జిల్లాలోని కోటిలింగాల, ధూళికట్ట కోటలు ఈ జాబితాలోకి రావచ్చునని భావిస్తున్నారు. ధూళికట్ట సమీపంలోనే పెద్దబొంకూర్ అనెడి శాతవాహనుల కాలంనాటి పురావస్తుస్థలం వుంది. ధూళికట్టను పట్టణ దుర్గంకాగా, పెద్దబొంకూర్ గ్రామీణ సంస్కృతికి అద్దం పడుతుందని చరిత్రకారులు విశ్లేషిస్తున్నారు. ధూళికట్ట వడుకాపూర్‌లు కలిసి వుండడంతో శాతవాహనుల కాలంనాటి రాజభవనాల అవశేషాలు వడుకాపూర్ పొలాలలో కనబడుతున్నాయి. పెద్దబొంకూర్ చారిత్రక ప్రదేశం యాభై ఎకరాలలో విస్తరించి వుంది. ఈ స్థలం పురావస్తుశాఖ వారి ఆధీనంలో వుంది. ఇక్కడ 1978లో తవ్వకాలు జరుగగా, శాతవాహనుల కాలంనాటి గ్రామీణ నాగరికత, ఇండ్లు, బావులు, తొట్లు వంటి ఇటుక కట్టడాలు బయటపడ్డాయి. పాశిగాం, కోటిలింగాల, మీర్జంపేట, ధూళికట్ట, పెద్దబొంకూర్‌లు శాతవాహనుల కాలపునాటి కోటలుగా గుర్తించారు. ఈ స్థావరాలలో పురావస్తుశాఖ వారి తవ్వకాలు జరిగి, ఎన్నెనో విషయాలు బయటకు వచ్చాయి. ధూళికట్ట, వడుకాపూర్ గ్రామాల్లో శాతవాహనుల రాజులనాటి మట్టికోటలు నేటికినీ దర్శనమిస్తున్నాయి. ఈ స్థూపం చేరడానికి ఎలిగేడు మండల కేంద్రం నుండి కల్లుమందువ వుండే తాళ్ళవరకు రావాలి. అక్కడినుండి రెండు కిలోమీటర్ల దూరం కాలినడకన వరిపొలాల వొడ్లపై నడుచుకుంటూ వెళ్ళాలి. తదుపరి పారుతున్న హుస్సేన్‌మియా వాగుదాటి ఈ స్థూపానికి చేరుకోవాల్సి వుంటుంది. లేకుంటే జూలపల్లి వండల కేంద్రంనుండి నడుచుకొంటూ రావాల్సి వుంటుంది. ఈ స్థూపం పక్కనే బౌద్ధభిక్షువులు వుండటానికై రెండు చైత్య గృహాలు కూడా బయటపడ్డాయి. ఇవి ప్రస్తుతం భూమిలో కూరుకుని పోయాయి. వీటిని పురావస్తు తవ్వకాల ద్వారా వెలికి తీయాల్సి వుంటుంది. స్థూపం స్థలదాత శ్రీరంగారావు స్థూపమున్న 19 గుంటల భూమిని జిల్లా పురావస్తుశాఖకు అప్పగించడంతో, ఆయన కుమారుడు నరేందర్‌రావుకు ఇదేశాఖలో చౌకీదార్‌గా ఉపాధి కల్పించారు. కరీంనగర్ జిల్లాలో కరీంనగర్-రాయపట్నం రోడ్డులో పాశాయిగాంవద్ద



ధూళి కట్ట వద్ద నాగముచిలిందా రాతి కట్టడం



2011 త్రవ్వకాల్లో బయల్పడిన - విరిగిన కోటిలింగ స్థూపం

ప్రాచీన బౌద్ధస్థూపం వుంది. ఈ స్థూపం 15 ఏళ్లక్రితం రోడ్డు వెడల్పులో ఇర్‌కాన్ సంస్థవారు కూల్చివేయగా, సుమారు నాలుగు లక్షల వ్యయంతో తిరిగి మరమ్మత్తులు చేసి, కరీంనగర్ ప్రభుత్వ మ్యూజియం ఆవరణలోకి చేర్చారు. పెద్దపల్లి మండలంలోని మీర్జంపేటలో మరో బౌద్ధస్థూపం బయటపడింది. కోటిలింగాలలో 2011లో జరిగిన తవ్వకాలప్పుడు ప్రాచీన బౌద్ధస్థూపం ఒకటి భిన్నమైనది బయటపడింది కాని, త్రిరత్నాలతో కూడిన ఫలకాలు మాత్రం లభ్యమయ్యాయి. ఆ ఫలకాలను ప్రస్తుతం కరీంనగర్ మ్యూజియానికి చేర్చారు. ధూళికట్ట బౌద్ధస్థూపం చుట్టు 42 ఆయక ఫలకాలున్నాయి, శిల్పరమణీయతతో చెక్కిన నాగముచిలింద ఫలకాలు ఇక్కడ లభించడంతో వాటిని కరీంనగర్ మ్యూజియానికి చేర్చారు. ఇందులో నాలుగు ఫలకాలను 2006లో అమరావతిలో జరిగిన కాలచక్ర ఉత్సవాల సమయంలో ప్రారంభించిన బౌద్ధమ్యూజియానికి తరలించారు. ప్రస్తుతం పురావస్తుశాఖ ఆధ్వర్యంలో వున్న ఈ ధూళికట్ట వద్దకు చేరుకోవడానికి దారి ఏర్పడితే, ఈ స్థూపం అభివృద్ధికి నిధులు కేటాయించడానికి జిల్లా యంత్రాంగం సిద్ధంగా వుందని జిల్లా టూరిజం అధికారి ఆర్. వెంకటేశ్వరరావు తెలిపారు. ఈధూళికట్ట స్థూపం వద్ద ఫుల్‌టైం వాచ్‌మెన్‌ను నియమించాలని, 2008లో గుప్తనిధుల కోసం ఈ స్థూపం వెనకాల దుండగులు పెద్ద గోయి తవ్వి స్థూపానికి మచ్చ తెచ్చారు. అంతేకాక బుద్ధపేటిక, ఇతర వస్తువులు ఇక్కడ లభ్యంకాగా, వాటిని కరీంనగర్ మ్యూజియానికి తరలించారు. ఎట్టకేలకు తిరిగి పురావస్తుశాఖవారు ఈ గోతిని పూడ్చారు. 2007లో ఈ స్థూపంవద్ద జరిగిన బుద్ధపూర్ణిమ ఉత్సవాలకు గద్దర్ హాజరయ్యారు. స్థూపాన్ని అభివృద్ధి పరచాలని అప్పటి సీమాంధ్ర ప్రభుత్వాన్ని కోరారు. పెద్దబొంకూర్ పురావస్తుస్థలం, వడుకాపూర్ మట్టి రాజభవనాలవద్ద పురావస్తు తవ్వకాలుచేబట్టాలని, భూగర్భనగర శాతవాహన చారిత్రక వైభవాన్ని వెలికితీయాలని చరిత్రకారులు కోరుతున్నారు. నూతనంగా వచ్చిన తెలంగాణా రాష్ట్ర ప్రభుత్వం ధూళికట్ట స్థూపానికి అమరావతి స్థూపవైభవంలాగా అభివృద్ధి పరచి, ఇక్కడ దొరికిన ఫలకాలు, నాగముచిలింద శిల్పాలలో ఈ స్థూపం వున్న ప్రాంతంలోనే సైట్ మ్యూజియం ఏర్పాటు చేయాలని, సౌండ్ అండ్ లైటింగ్, మౌలిక వసతులతోపాటు, పర్యాటక వసతి గదుల నిర్మాణం చేబట్టాలని మే 10న జరిగిన గురుపూర్ణిమ ఉత్సవాలకు హాజరైన దళిత, బౌద్ధసంఘాల నాయకులు కోరారు. గత రెండు నెలల కిందట అంటే జూన్ 30న మాదిగ దండోరా వ్యవస్థాపక అధ్యక్షులు మందకృష్ణ మాదిగ ఈ స్థూపం వద్ద ఒక్కరోజు నిరసనదీక్ష చేసి, ఈ స్థూపం అభివృద్ధికి 50 కోట్లు కేటాయించాలని డిమాండ్ చేశారు. ఇటీవలే తెలంగాణా ప్రజాఫ్రంట్ నేత స్వర్గీయ ఆకుల భూమయ్య, మార్క్సిస్టు నేత వడుకాపూర్ చంద్రమౌళిల జన్మస్థలియైన ధూళికట్ట బౌద్ధస్థూపం వాదవివాదాలకు కేంద్రబిందువై జిల్లా చరిత్రాభిమానులను కలవరపరుస్తోంది. ఈ వివాదాన్ని జిల్లా ప్రజాప్రతినిధులు పరిష్కరించి, అభివృద్ధి దిశలో పోటీపడేలా వారిని ప్రోత్సహించాలని చరిత్రాభిమానులు కోరుతున్నారు. ప్రస్తుతం యుద్ధప్రాతిపదికన ఈ స్థూపం వరకు రోడ్డు సౌకర్యం కల్పించాలని, తదుపరి పురావస్తు, టూరిజం నిధులు వాడుకోవాలని చరిత్రాభిమానులు సూచిస్తున్నారు.

**రచయిత శ్రీ సంకేపల్లి నాగేంద్రశర్మ వృత్తిరీత్యా ఉపాధ్యాయుడు, కరీంనగర్, ఫోను: 9441797650**

**కవిత**

# ఆ తల్లి అరచి అరచి కన్నుమూసింది'

**ఆ**మూల చివర ఆ కుక్క సన్నంగా మూలుగుతోంది...
ఆవూరి చివరలో ముసురులో మూలుగుతున్న అవ్వ...
ఆ ఆసుపత్రిలో పిల్లల పక్కలపైకి దూకుతున్న బలిసిన ఎలుకపిల్ల
అవును! అడవిమధ్యలో ఆ గూడెం
మూసిన కన్ను తెరవని జీవులు...
మంచానికి కట్టుకొని మనుష్యులను
ఇంకా మోసుకెళుతున్న దృశ్యం
రెస్టారెంటుల్లో గెస్టు హౌసుల్లో రాజావారి రాణివాసం
చలికి, ఎండకు తేడా తెలియని సంతానాలు...
వర్షమైనా, ఎండైనా, చలైనా
ట్విట్టర్లకేముంది? ఫేస్‌బుక్కులకేముంది?
సుందర దృశ్యాలు నిరంతర సంభాషణలు
ఇంద్రలోకాల కల్పనలు... అంతా మాయాజాలం...
ఆ ప్రభుత్వ ఆసుపత్రిలో కరెంటుపోయింది
ఆ చీకట్లో కేకలు పెడుతోంది ఆ తల్లి
ఆ పక్కనే చనిపోయిన శవం
ఆ తల్లికి తల్లి డాక్టర్ల కోసం మొత్తుకుంటోంది
'సర్కారు దవాఖానా అంటే ఇంతేనండి'
అని వాచ్‌మన్ పెదవి విరిచాడు
ఆ తల్లి అరచి అరచి కన్నుమూసింది.
'ట్రాన్స్‌ఫారమ్ ఫెయిలయ్యింద'ని ఎవరో పెద్దగా అరిచారు.
మబ్బులు కమ్మినపుడంతా పుట్టెడు దుఃఖాన్ని మోసుకొస్తున్నాయి.
ఆసరాలేని జీవుల గుండెసొద చీకటిలో ఒక వ్యధలగాథ.
నీటి వరద కంటే కన్నీటి వరదే పెద్దది
జీవితం అల్లకల్లోలం... జీవన తరంగాల్లో నెత్తుటి చారలు
అవును! విగతులు విహ్వాలుల గుండెసొదలు
అగ్గిసెగలు అయ్యేరోజు వుంది
కొడుకును కాటేసిన సీసాపెంకు రాజ్యాంకంటిలో నలుసు
వ్యధలు ముసురు ముసుగులో రగులుతూనే వున్నాయి
తడిసిన తాటి బొత్తకూడా మండే రోజుంది
పిడుగులు పడేది కూలీలమీదే!
కూలీలే పిడుగులైతే కూలేది రాజ్యమే.

**డా॥ కత్తి పద్మారావు,** పొన్నూరు, 9849741695

(విజయవాడ ప్రభుత్వ ఆసుపత్రిలో
మరణించిన బాలింతరాలి కోసం)

# తెనుగు లెంక సూక్తులు-3



**'తెనుగు లెంక' 'అభినవ తిక్కన' తుమ్మల సీతారామమూర్తి.**

**తెలుగుదనమ్ము పైకొనిన**
**తీరులు కన్పడు వ్రాయసమ్ము లే**
**తల - వల - నాటినుండి బుడు**
**తల్ చదువందగునిందు; నిట్టి వా**
**కలిమికి నేలనేలు నధి**
**కారులు పూనవలెన్ ప్రభుత్వ మీ**
**మెలకువ నుందున ట్లను ని**
**మేషము దేశము చూచుకోవలెన్**

**ప్రతి** జాతికి కొన్ని ప్రత్యేకతలుంటాయి. ఆ ప్రత్యేకతలు మాటతీరులో, ఆలోచనా విధానంలో, జీవనగమనంలో, సంస్కృతీ సంప్రదాయాల్లో కనిపిస్తూ ఉంటుంది. ఆ ప్రత్యేకత ఆ జాతికే సొంతం. అలాంటి తెలుగు వారి ప్రత్యేకతనే తెలుగుదనం అంటారు. ఈ తెలుగుదనం తిక్కన భారతాన్ని చదివితే ఎంత తెలుస్తుందో, ఆధునికత వాసనలేని పల్లెపట్టులకు వెళితే అంతకంటే ఎక్కువగా తెలుస్తుంది.

తెలుగుదనం ఎలా ఉంటుంది? దాని 'రుచి' ఏమిటి? ఈ విషయాలు తెలుసుకోడానికి తెలుగుభాషను నేర్చుకోవాలి. తెలుగు వ్యక్తుల్ని పరిశీలించాలి. తెలుగు సమాజాన్ని పరికించాలి. తెలుగు లోగిళ్ళలోకి తొంగి చూడాలి. తెలుగుదనం గుబాళించే సాహిత్యాన్ని చదవాలి. విద్యాభ్యాసం తెలుగులో ప్రారంభిస్తే తెలుగుపట్ల మక్కువ పెరుగుతుంది. తెలుగుదనం అంటే ఎలా ఉంటుందో గ్రహించే వీలుంటుంది.

కానీ దురదృష్టవశాత్తు గ్రామాల్లో ఉండే తెలుగు బడులను మూసివేయాలని అధికారులు భావించడం, ఆంగ్లమాధ్యమ పాఠశాలలకు పట్టాభిషేకం చేయడం వంటి పనులవల్ల తరువాతి తరాలకు తెలుగుదనం ఎలా ఉంటుందో తెలుసుకొనే అవకాశం లేకుండా పోతుంది. ఆ మాధుర్యాన్ని ఆస్వాదించే అదృష్టం లేకుండా పోతుంది. తెలుగుతో విద్యను ప్రారంభించి ఒక వయస్సు వచ్చిన తరువాత మంచి, చెడూ జ్ఞానం తెలిసిన తరువాత, ఏది ఎంతవరకు అవసరమో నిర్ణయించుకొనే బుద్ధి వచ్చిన తరువాత ఇతర భాషలు నేర్చుకోవచ్చు. తద్వారా భాషా విషయకంగానే గాక, అన్ని రంగాల్లో అభివృద్ధిని సాధించవచ్చు.

మన రాష్ట్రంలో తెలుగుకు ఆదరణ లేకుండా పోయింది. అధికారులకు తెలుగంటే అలుసు. నాయకులకు తెలుగంటే చులకనభావం. తెలుగు మాధ్యమ పాఠశాలలను మూసివేయాలని అధికారులు చెప్పిందే తడవుగా తలలూపడం తప్ప, మాతృభాషకు, తెలుగుదనానికి నష్టంకలుగుతుందనే ఇంగిత జ్ఞానం నాయకులకు లోపించింది.

ప్రక్క రాష్ట్రాల్లో తెలుగు బడులను మూసేస్తున్నారంటే, ఏవో ప్రకటనలు చేయడం తప్ప, ఆరాష్ట్రనాయకులతో చేయడం తప్ప, ఆ రాష్ట్ర నాయకులతో మాట్లాడి, ఆ రాష్ట్రంలో తెలుగును బ్రతికించుకుందామనే తపన నాయకుల్లో కనిపించడంలేదు.

అందుకే తెనుగులెంక తుమ్మల 'తెలుగుదనం కనిపించే తీరు పిల్లలకు తల, వల నేర్చుకునే-అంటే ప్రాథమిక విద్యాస్థాయిలోనే నేర్పించాలి. ఆ వాక్సంపదను పిల్లలకు అందించడానికి రాష్ట్రాన్ని పాలించే అధికారులు పూనుకోవాలి. ప్రభుత్వంలోని నాయకులు తెలుగు భాషా ఉన్నతికి నిరంతరం కృషి చేసేటట్లు దేశప్రజలు చూచుకోవాలి' అన్నారు.

– **డాక్టర్ నాగభైరవ ఆదినారాయణ** విశ్రాంత అధ్యాపకులు, ఫోన్ : 9849799711

**కవిత**

## విశ్వరూపం

**అ**చ్చులతో అల్లికలు నేర్చి
హల్లులతో మాలికలు కూర్చింది
గుణింతాలతో సుగుణాలు చెక్కి
ద్విత్వాలతో శిల్పాలు మలిచింది
సంధులతో సంబంధాలు పేర్చి
సమాసాలతో విశేషాలు చెప్పింది
సంయుక్తాక్షరాలతో యుక్తులు పన్ని
అలంకారాలతో అందలమెక్కింది
విభక్తులతో ఆకర్షణ చేసి
ప్రత్యయాలతో ప్రతిమను చేసింది
యతులతో గతులు మార్చి
ప్రాసలతో ప్రతిభ చూపింది
ఛందస్సులతో ఉషస్సు నింపి
పద్యాలతో కదంతొక్కింది
అవధానాలతో వేదికలెక్కి
ఆశువుగా ధారణ చేసింది
నుడికారాలతో నుదుట బొట్టై
తలకట్టులతో అందాలు చిందింది
సామెతలతో వాసికెక్కి
జాతీయాలతో రాశిని పెంచింది
ఏమని వర్ణింతును
నా తెలుగు భాష ప్రతిభాపాటవం
సుమధుర సుందర అక్షర విశ్వరూపం

**– పి. లక్ష్మణరావ్, విజయనగరం**
ఫోన్: 9441215989

జనవాణి

గిడుగు, తాపీ గార్లను జ్ఞాపకం చేసుకోవడం, జయంతులు చేయడం మంచిదే, అవసరం కూడా అయితే దానిని అంతటితో ముగించకుండా వారి ఆశయాల సాధనకు ఏదైనా కార్యక్రమం చేయడం మంచిది. తెలుగు వాచకాలలోని భాషను గిడుగు- తాపీ ప్రమాణాలతో మూల్యాకనం చేసుకోవాల్సి అవసరం వున్నది. ఇందుకోసం ఒక కార్యశాల (Workshop) ను ఒకటిరెండు రోజులపాటు నిర్వహించి నిష్ణాతులను చేయట గిడుగు-తాపీల ప్రమాణాలతో తెలువు వాచకంల మూల్యాంకనాన్ని చేపట్టగలిగితే బావుంటుంది. ఆలోచించండి.

**కమ్మరాజు పూర్ణచంద్రరావు , హైదరాబాదు**

- డా॥ సామల రమేష్‌బాబు

## తమిళనాట తెలుగుకు ముప్పు

# మాతృభాషలో విద్యను రాజ్యాంగ హక్కుగా గుర్తించి అమలు చేయడమే పరిష్కారం

తమిళనాడులో తెలుగు బోధన ఈ ఏడాదినుంచి రద్దు అయిపోయిందని ఇప్పుడు ఆందోళన మొదలైంది. తమిళనాడు అసెంబ్లీలో శాసనసభ్యుడు గోపీనాథ్ ముఖ్యమంత్రి జయలలితకు తెలుగును కాపాడాలని విన్నవించడం, మీకేం కావాలో చెప్పండని ఆమె అచ్చమైన తెలుగులో అడగడం... ఈ దృశ్యం ఇప్పుడు సోషల్ మీడియాలో కలకలం రేపుతోంది. తమిళనాడు నుంచి వచ్చిన కొందరు తెలుగువారు హైదరాబాదులో ప్రదర్శన చేయడం, తెలుగు టీవీ ఛానెళ్లలో ప్రత్యేక కార్యక్రమాలు, తెలుగు దినపత్రికల్లో ప్రముఖంగా వార్తలు రావడంతో ఇది బాగా చర్చనీయాంశం అయింది.

ఇప్పుడు ఆందోళనకారులు కోరుతున్నదల్లా అల్పసంఖ్యాక భాషగా తెలుగును నేర్చుకోవడానికి తమకు ఉన్న కొద్దిపాటి అవకాశాన్ని తీసివెయ్యవద్దు అనే. ఇంకా బాగా చెప్పాలంటే కృష్ణగిరి జిల్లాలో, చెన్నైలో, ఇంకా అక్కడక్కడా మిగిలివున్న తెలుగు మీడియం స్కూళ్ళను మూసివెయ్యవద్దని వాళ్లు కోరుతున్నారు. అయితే, ఇందుకు తమిళనాడు ప్రభుత్వం ఏమాత్రం సిద్ధంగా లేదు. తమిళనాడులో అమలులో ఉంది ద్విభాషా సూత్రమేగానీ, తక్కిన భారతదేశమంతటా ఉన్నట్లు త్రిభాషా సూత్రం కాదు. తమిళనాట తమిళభాషను తప్పనిసరి చెయ్యాలన్న ప్రభుత్వ నిర్ణయం వల్ల, దానితోపాటు ఇంగ్లీష్ కూడా తప్పనిసరై కూర్చొంది. కనుక ఇక మూడవ భాషకు అవకాశం లేదు. ఉంటే గింటే ఒక ఐచ్ఛిక భాషగా మాత్రమే అవకాశం ఉంటుంది. ఐచ్ఛికంగా నేర్చుకొనే భాషకు ప్రభుత్వ గుర్తింపే లేనప్పుడు, ఇక దానికి పరీక్ష పెట్టవలసిన అవసరం ప్రభుత్వానికేం ఉంది? కావాల్సిన పాఠ్య పుస్తకా లిస్తామని చెప్పినా, ఉపాధ్యాయులనిస్తామని చెప్పినా అదంతా ఉత్తుత్తి వ్యవహారమేనని తేలింది. చెప్పింది చెయ్యకపోతే ఎవరేం చెయ్యగలరు గనుక?

నేటి ఈ దుర్భర పరిస్థితికి కారణమైన ప్రభుత్వ ఉత్తర్వు ఎప్పటిది? అది ఏమని చెప్తోంది? ఇది తెలిస్తే తప్ప అసలు సంగతి సరిగ్గా తెలుసుకోలేం.

2006 జూన్ 17న 18640/ఎఫ్/06 అంకె గల ఉత్తర్వును తమిళనాడు ప్రభుత్వం ఇచ్చింది. (నడుస్తున్న చరిత్ర జూలై 2006 సంచికలో ఉత్తర్వు పూర్తి పాఠాన్ని చూడవచ్చు. ఆ ఉత్తర్వు రెండో పేరాలో ప్రభుత్వం ఎందుకు ఆ ఉత్తర్వును ఇస్తున్నదో స్పష్టంగా చెప్పారు. 'ప్రపంచంలో తొలి ప్రాచీన భాష తమిళం' అని అందులో వ్రాశారు. అటువంటి తమిళం తమిళనాడు అధికార భాష అనీ, దాన్ని తమిళనాడులోని అన్ని పాఠశాలల్లో తప్పనిసరి చెయ్యడం తమ విధ్యుక్తధర్మం అనీ ఆ ఉత్తర్వులో నిర్మొహమాటంగా తెలిపారు. ఈ లక్ష్యసాధన కోసం ఏం చెయ్యాలో అదే చేశారు. విద్యాబోధనలో తొలిభాగంగా తమిళాన్నీ, రెండవభాగంగా ఆంగ్లాన్నీ నిర్బంధం చేశారు. మూడవ భాగంలో గణితం, శాస్త్రవిజ్ఞానం, సాంఘికవిజ్ఞానం మొదలైన ఇతర పాఠ్యాంశాలను చేర్చారు. నాలుగవ భాగమంటూ ఒకటి పెట్టి, తమిళంగానీ, ఆంగ్లంగానీ మాతృభాష కానీ విద్యార్థులకోసం వారి మాతృభాషను ఐచ్ఛిక పాఠ్యాంశం చేశారు. దానికి పరీక్షలు ఉండవు.

ఈ ఉత్తర్వును 1 నుంచి 10వ తరగతి వరకూ క్రమక్రమంగా అమలుపర్చాలి. గనుక, 2006లో 1వ తరగతిలో ఉండే విద్యార్థి 2015నాటికి 10వ తరగతిలోకి వచ్చేశాడు. ఈ పదేళ్లలో తెలుగు పాఠశాలల్లో తమిళాన్ని ప్రవేశపెట్టినా, దాన్ని సరిగా అమలుచెయ్యక, ఉపాధ్యాయ నియామకాలు చెయ్యక అలక్ష్యం

చేశారు. తెలుగు సమాజం నుంచి వస్తున్న వ్యతిరేకతతో ప్రభుత్వం ఈ ధోరణిని అవలంబించడంతో చివరికి 10వ తరగతి పరీక్షల్లో తమిళంలో తెలుగు విద్యార్థులు ఉత్తీర్ణులు కాలేకపోతారు. ఇదీ సంగతి!

ప్రభుత్వం తన నిర్ణయాలను ఏమాత్రం వెనుకకు తీసుకోలేదు. తమిళనాడును ఏలుతున్న డిఎంకె గానీ, ఎడిఎంకె గానీ ముందునుండీ అవలంబిస్తున్న భాషావిధానం తమిళ జాతీయత అనే లక్ష్యంతో ముడిబడింది. భాషతోనే జాతి గుర్తింపబడుతుందనీ, భాషనశిస్తే జాతి నశిస్తుందనీ అందరూ చెప్తూనే ఉంటారు. కాని, భారతదేశంలోని సంక్లిష్ట సాంఘిక, రాజకీయ పరిస్థితుల్లో భాషా జాతీయతను రాజకీయ లక్ష్యం చేసుకొని, దానికి ఇతర భాషలపట్లద్వేషాన్ని జతచేసి ఒక స్పష్టమైన సిద్ధాంతంపైన ఆధారపడి అధికారంలోకి వచ్చిన డిఎంకె, అప్పటిదాకా మద్రాసు రాష్ట్రంగానే ఉన్న దాని పేరున్ను తమిళనాడుగా మార్చడంలోనే ఒక లక్ష్యం పెట్టుకొంది. ఆ పార్టీ రెండుగా చీలిపోయిన తర్వాత రెండు పార్టీలూ ఆ భాషా తీవ్రవాదమనే పులిపై స్వారీ చేయడంలో పోటీపడుతూ వచ్చాయి. క్రమంగా తమిళభాష ప్రాచీనత అంశాన్ని ముందుకు తెచ్చి దాన్నొక ఎన్నికల అంశాన్ని చేసి కేంద్రంలో సంకీర్ణ ప్రభుత్వం మెడలు వంచి 2004లో ఆ హోదాను సంపాదించడం ఆ పార్టీల దీర్ఘకాల రాజకీయ లక్ష్యసాధనలో భాగం మాత్రమే! ఇక ఆ తర్వాత వేటు రాష్ట్రంలోని భాషాల్ప సంఖ్యాకుల మీద వేశారు. (నిజానికి తమిళనాడులో తెలుగువారే అధిక సంఖ్యాకులు. అయినా వాళ్ళిప్పుడు ప్రభుత్వ లెక్కల ప్రకారం అల్ప సంఖ్యాకులై (40శాతం, 5శాతం) పోయారు. ఆసక్తిగలవారు తెలుగుజాతి ట్రస్టు ప్రచురించిన స.వెం. రమేశ్ రచన 'ఎల్లలు లేని తెలుగు' చదవండి. తెలుగు రాష్ట్రాల బయట వున్న తొమ్మిది కోట్ల మంది తెలుగువారి సంగతులు తెలుస్తాయి). ఆ వేటుకు ప్రత్యక్ష రూపమే నేటి తమిళ నిర్బంధ ఉత్తర్వు.

ఇప్పుడు ఆందోళనకారులు స్పష్టంగా కోరుతున్నదేమిటి? తెలుగు పాఠశాలల్లో తెలుగును ఎలా కాపాడాలని కోరుతున్నారు? దానికున్న ఏకైకమార్గం తమిళేతర భాషలవారికి 'మూడు భాషల సూత్రాన్ని' వర్తింపచేస్తేనే పరిష్కారం కుదురుతుంది. దాని కింద తమిళం, ఇంగ్లీషుతోపాటు మాతృభాష నేర్చుకోవడాన్ని తప్పనిసరి చెయ్యాలి. దీన్ని తమిళనాడు ప్రభుత్వం చెయ్యదుగాక చెయ్యదు. కేంద్ర ప్రభుత్వమే కదలి వచ్చి దేశం మొత్తంలో మాతృభాషల రక్షణకు, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే – ప్రాథమిక విద్యను మాతృభాషామాధ్యమంలో నేర్చుకోవడానికున్న 350ఎ ని నిర్బంధంగా అమలు చేసేటట్లు రాష్ట్ర ప్రభుత్వాలపై ఒత్తిడి తేవాలి. అవసరమైతే ఇందుకోసం రాజ్యాంగ సవరణ చెయ్యాలి. అప్పుడుగానీ భాషాప్రయుక్త రాష్ట్రాల్లో భాషాల్ప సంఖ్యాకులకు 350ఎ అమలుకు రాదు. రాలేదు.

ఇంతకూ రాజ్యాంగంలోని 350ఎ ఏం చెబుతోంది? భాషాపరమైన అల్పసంఖ్యాక వర్గాలవారికి ప్రాథమికస్థాయి విద్యాబోధన వారి మాతృభాషలోనే జరిగేందుకు అవసరమైన సదుపాయాలను, అవకాశాలను కల్పించడం స్థానిక రాష్ట్ర ప్రభుత్వాల, స్థానిక పాలనా సంస్థల బాధ్యత. ఇందుకు సంబంధించి రాష్ట్రాలకు రాష్ట్రపతి తగు ఆదేశాలు జారీ చేయవచ్చు. ఈ నిబంధన ద్వారా రాష్ట్రాల్లోని భాషాపరమైన అల్ప సంఖ్యాకుల పిల్లలకు వారి తల్లి భాషలోనే ప్రాథమిక విద్యాస్థాయిలో విద్యాబోధన చెయ్యాలన్న హామీని రాజ్యాంగం కల్పిస్తోంది.

మాతృభాషలోనే ప్రాథమిక విద్యను బిడ్డలకు నేర్పాలనేది ప్రపంచవ్యాప్తంగా విద్యారంగ నిపుణులు, శిశు మనోశాస్త్ర నిపుణులూ సమ్మతించిన విషయం. మన రాజ్యాంగంలో 350ఎ ప్రకారం దీన్ని రాజ్యాంగ హక్కుగా కూడా మనం ఆమోదించాం. 'యునెస్కో' వారి అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవ ప్రకటన లక్ష్యం కూడా ఇదే. మరి ఈ సూత్రం భారతదేశంలో భాషా ప్రాతిపదికన ఏర్పడిన రాష్ట్రాల్లోని భాషాల్ప సంఖ్యాకులకు వర్తించదా? ఇది వారి సహజమైన హక్కు కాదా? దీన్ని తమిళనాడు ప్రభుత్వం స్వేచ్ఛగా ఉల్లంఘిస్తూ వుంటే కేంద్రప్రభుత్వంగానీ, ఇతర రాజకీయపార్టీలుగానీ ఎందుకు నోరు మెదపడంలేదు? ఇప్పుడున్న రెండు తెలుగు రాష్ట్రాలకూ ఇతర రాష్ట్రాల్లోని తెలుగువారి పట్ల బాధ్యత ఏమీలేదా? ఇవన్నీ అసలు ప్రశ్నలు. పరిష్కారం ప్రజాస్వామ్య పరిధిలో ఉండాలంటే తమిళనాడులో ఇప్పుడేర్పడిన భాషా సంక్షోభాన్ని పరిష్కరించాలి. లేదంటే తమిళనాట 'తెలుగు ఉగ్రవాదం' ప్రారంభమై, విస్తరించదన్న గ్యారంటీ ఏమన్నా ఉందా? విజ్ఞులు ఆలోచించాలి.

**రచయిత – డా॥ సామల రమేష్‌బాబు**
**తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షుడు**
**ఫోను: 9848016136**

*(ప్రజాశక్తి దినపత్రిక సౌజన్యంతో)*

# ఆం.ప్ర. ప్రభుత్వానికి తమిళనాడులోని తెలుగు ప్రజల గోడు...

**త**మిళనాడులో తెలుగుస్కూళ్ళను మూసివసి ఆ స్థానంలో తమిళాన్ని బలవంతంగా రుద్దుతున్నారు. 2006 సం॥లో అప్పటి ముఖ్యమంత్రి కరుణానిధి తమిళ భాషేతరులపై ఉక్కుపాదాన్ని మోపినారు. 2006 సం॥నుండి ఒకటవ తరగతిలో తెలుగు స్థానంలో తమిళాన్ని ప్రవేశపెట్టినారు. అలా ప్రతి సంవత్సరం ఒక్కో క్లాసులోను, తరగతుల లోను, తమిళాన్నే నిర్బంధంగా నేర్పించాలని ఉత్తర్వులు 18640/2006, ప్రాథమిక విద్యాశాఖ ద్వారా జారీచేసి అమలుపరచాలని ఉత్తర్వులు జారిచేశారు. కానీ ఆ ఉత్తర్వులు అమలుకాలేదు. అంటే 2006 సం॥ నుండి 2015 సం॥ వరకు 1 వ తరగతినుండి 9వ తరగతి వరకు తెలుగులోనే చదువుకొన్న విద్యార్థులను 2016 సం॥ రాబోయే 10వ తరగతిలో తమిళంలో వ్రాయమంటే ఇది సాధ్యం అయ్యే పనికాదు. ఈ సందర్భంగా తమిళనాడులో ఉన్న అనేక తెలుగుసంఘాలవారం ప్రభుత్వం వారికి ఎన్నో విన్నపాలు చేశాం. అయితే ప్రయోజనం శూన్యం. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు నేరుగా కలుగజేసుకొంటేనే సఫలీకృతులం కాగలం.

ఈ మధ్యనే ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడుగారు తెలుగు భాషాశాఖ మంత్రివర్యులు శ్రీ పల్లె రఘునాధరెడ్డ గారికి తమిళనాడు పంపి అక్కడి విద్యాశాఖా మంత్రి శ్రీ కె.సి. వీరమణి గారితో సమావేసం జరిపి తద్వారా ఈ నెల 30వ తేదీ ఇరు రాష్ట్రాల విద్యాశాఖ కార్యదర్శుల సమావేశం జరుపనున్నారు. మేము అంటే ద్రావిడ దేశం తరపున ఈ క్రింది కోర్కెలు విన్నవించు కొనుచున్నాము.

1) ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి తమిళనాడు ముఖ్యమంత్రి గారితో నేరుగా సమావేశం కావడం. 2) 2016వ సం॥లో తెలుగువారు తెలుగులోనే 10వ తరగతి నేరుగా సమాశం కాలడం. 3) స్కూళ్ళలోను, కాలేజీల్లోను, విశవిద్యాలయాల లోను ఖాళీగా ఉన్న తెలుగు టీచర్ల ఉద్యోగాలను భర్తీ చేయండి. 4) భారత ప్రభుత్వం యొక్క ఆదేశాలను యధాతథంగా అమలు పరచుట. 5) తెలుగు భాషను ఇతర రాష్ట్రాల్లో అమలుపరుచుటకు ఒక కార్యాచరణకమిటీని వేసి తగువిధంగా చర్యతీసుకోనుట దీనిలో తమిళనాడులోని ముఖ్య తెలుగు సంఘాల నాయకులను సభ్యులుగా తీసుకొనుట. 6) ఆంధ్రప్రదేశ్ కర్ణాటక, రాష్ట్రాల్లో అమల్లో ఉన్న విదంగా మెనారిటీ ప్రజలకు త్రిభాషా సూక్తాన్ని అమలుపర్చాలి. 7) గణాంకాల శాఖ వారు మరలా జనాభా లెక్కలు, భాషా ప్రాతిపదికన విడుదల చేయాలి.

**వి. కృష్ణారావు, అధ్యక్షుడు,**
**ద్రవిడ దేశం పార్టీ**

- గారపాటి ఉమామహేశ్వరరావు
- డా॥ అద్దంకి శ్రీనివాస్

# తెలుగు రాష్ట్రాలలో భాషావిధానం

(సెప్టెంబరు సంచిక తరువాయి)

**5.0 ఆచరణ**

భారతరాజ్యాంగం ఏర్పరచిన మార్గదర్శకాలనూ నియమ నిబంధనలనూ అనుసరిస్తూ ప్రభుత్వ, ప్రభుత్వేతర రంగాలలో ప్రాంతీయభాషలకు వ్యవహారగౌరవం, అవసరం కలిగేలా చేయటం, ప్రాయోజకత్వం కలిగించడం ప్రథమ కర్తవ్యం. దీని సాధనకు తగిన భాషావిధానాలను రూపొందించుకొని ప్రభుత్వమూ ప్రజలూ ప్రయివేటు సంస్థలూ స్వచ్ఛందంగా ఆచరించే భాషావిధానాన్ని శాస్త్రీయభూమికల ఆధారంగా నిర్మించడం అవసరం.

**5.1 భాషా విధానం : అమలుకావలసిన ప్రాథమిక రంగాలు**

భాషా చేతనత్వమూ (Language Vitality) భాషా ఆపన్నత (Language endangerment) అనే అంశాల ఆధారంగా భాషల మనుగడ గురించి 2000-2001, 2003, 2005 సంవత్సరాలలో సర్వేలను ఐరాస నిర్వహించింది. ఏదైనా ఒక భాష సజీవంగా ఉంటుందా, ఆపన్న భాష (endangered Language) కాబోతుందా అని తెలుసుకోవడానికి కొన్ని సూత్రీకరణలు చేసింది. వాటిని తెలుగు భాషకు వర్తింపజేస్తే ఫలితాలు ఎలా ఉంటాయో ఈ కింది పట్టిక ద్వారా చూడవచ్చు.

| క్రమ. సం. | సూత్రీకరణ | తెలుగుకు వర్తింపు |
|---|---|---|
| 1 | అనువంశిక భాషా ప్రసారం<br>10 20 30 40 50 60 70 80 90 100<br>(తల్లిదండ్రుల నుండి బిడ్డలకు) | పాక్షికం |
| 2 | భాషావ్యవహర్తల సంఖ్యా పరిపూర్ణత<br>10 20 30 40 50 60 70 80 90 100 | ఉంది |
| 3 | మొత్తం జనాభాలో ఆ భాషా వ్యవహర్తల సంఖ్య<br>10 20 30 40 50 60 70 80 90 100 | ఉం ది |
| 4 | భాషా వినియోగ రంగాలలోకి పరివర్తనం/విస్తరణ<br>10 20 30 40 50 60 70 80 90 100 | పాక్షికం |
| 5 | కొత్త రంగాల మాధ్యమాల విషయంలో స్పందించే లక్షణం<br>10 20 30 40 50 60 70 80 90 100 | ఉంది |
| 6 | భాషాభ్యసనం / అక్షరాస్యతల కోసం వనరుల లభ్యత<br>10 20 30 40 50 60 70 80 90 100 | పాక్షికం |
| 7 | హోదా/ వినిమయ సందర్భాలలో ప్రభుత్వ ఆధికారిక, సంస్థా పరమైన భాషా ప్రవృత్తులు / విధానాలు<br>10 20 30 40 50 60 70 80 90 100 | పాక్షికం (అన్నింటా తెలుగు వాడకంలేదు) |
| 8 | స్వీయ భాషా విషయంలో జాలి, కుల సంఘ సభ్యుల వైఖరులు<br>10 20 30 40 50 60 70 80 90 100 | పాక్షికం (అంతా ఒక్కతాటిపై లేదు) |
| 9 | పత్రికరణలో భాషను ఎంతగా వినియోగిస్తున్నారు, దాని నాణ్యత<br>10 20 30 40 50 60 70 80 90 100 | పాక్షికం |
| 10. | సాంస్కృతిక పరమైన అంశాల, సంప్రదాయాల, జాతి కులమత పరమైన కళల ఆలంబన<br>10 20 30 40 50 60 70 80 90 100 | పాక్షికం |

9 + 9 + 8 + 6 + 6 + 9 + 6 + 8 + 6 + 8 = 75.00%

**ఈ సూత్రీకరణలకు వివరణ :**

1. అనువంశిక భాషాప్రసారం అంటే పుట్టిన ప్రతిబిడ్డా తల్లిదండ్రుల నుండి తెలుగుభాష నేర్చుకొంటున్నాడా లేదా అన్నది.
2. తెలుగుభాషా వ్యవహర్తలు సంఖ్యాపరంగా ఒక బలీయమైన సమూహంగా ఉందా లేదా అన్నది.
3. ఆ భాషావ్యవహర్తలు ప్రాంతీయ జనాభాలో అధికసంఖ్యాకులుగా ఉన్నారా లేదా అన్నది.
4. భాషను వాడవలసిన చోట్ల తెలుగును వాడుతున్నారా లేదా అన్నది.
5. ఆధునికీకరణ, ప్రపంచీకరణల నేపథ్యంలో వస్తున్న కొత్తరంగాలలో తెలుగు వాడకం జరుగుతోందా లేదా అన్నది.
6. తెలుగు భాషను నేర్పేందుకూ నేర్చుకొనేందుకూ ఆధునిక వనరుల తయారీ ఎప్పటికప్పుడు అవసరాలకు తగినవిధంగా జరుగుతోందా లేదా అన్నది.
7. ప్రభుత్వపరమైన ఆధికారిక ఉత్తర ప్రత్యుత్తరాలలోతెలుగు వాడకం జరుగుతోందా లేదా అన్నది.
8. తెలుగుకు సంబంధించినంతవరకూ సమాజంలో వివిధవర్గాల స్పందన ఎలా ఉంది అన్నది.
9. ఆధునిక ప్రపంచంలో రాతకోతలకు వినియోగించే తెలుగు శాతం ఎంత అన్నది.
10. సాంస్కృతిక, సాంప్రదాయిక రచనల సమర్థన ఉందా లేదా అన్నది. (ఉదాహరణకు అరబిక్ భాషకు ఖురాన్, పంజాబీ భాషకు గురుగ్రంథ్ లాంటివి ఆలంబనగా నిలుస్తున్నాయి.

అలాగే తెలుగుభాషలో వేలకొలదిగా ఉన్న అన్నమయ్య, వేమన, వీరబ్రహ్మం, త్యాగయ్య, క్షేత్రయ్య, రామదాసుల రచనలు తెలుగువారి తరతరాల తాత్త్వికచింతనకు అద్దంపడతాయి).

ఈ పది సూత్రీకరణలను తెలుగు భాషకు అన్వయించుకొని చూస్తే ఆశాజనకంగానూ సంతృప్తికరంగా ఉండే సమాధానాలు రావడం లేదు. కాబట్టి తెలుగు భాష గురించి వ్యవస్థీకృతమైన నిర్ణయాలతో వివిధ (విద్య, పాలన, న్యాయవ్యవస్థ, సమాచార ప్రసార సాంకేతిక, వ్యావసాయిక, వృత్తి, వాణిజ్యాది) రంగాలలో భాషా విధానాన్ని అమలుచేయాలి.

**5.1.1 విద్యారంగంలో భాషా విధానం**

తెలియని విషయాన్ని తెలియజెప్పేదే విద్య. అది మాతృభాషలో ఉండటమే శాస్త్రీయం. కొన్నిసామాజిక కారణాలవల్ల అది పరభాషలో జరగడం తప్పనిసరి అయితే అది పెద్ద తప్పు. ఎందుకంటే, తెలియని దాన్ని తెలియని భాషలో నేర్చుకోవడం ఎంతో కష్టం. ఒక రకంగా చెప్పాలంటే అదే అవిద్య. సమాజంలోని ఎన్నో రుగ్మతలకు ఇదే కారణం. వినే వాడికి చెప్పే విషయం అర్థం కాదు. కొద్దోగొప్పో అర్థమైనా దాన్ని విస్తరించి ఆచరణలో పెట్టడం చేతకాదు. ఒకవేళ చేతనైనా దానిని ప్రభావవంతంగా ప్రపంచానికి తెలిసేటట్టు రాయడం చేతకాదు. ఇదంతా విద్యారంగంలో వెనుకబాటుతనానికి కారణం. ఇలాంటి ఆంగ్ల మాధ్యమం మనకు నూటికి తొంబైశాతం ఎందుకూ కొరగాని మాధ్యమం అయిపోయింది. అదే సమాజంలో ప్రజలను విభజిస్తోంది. ఇంటిభాష, బడిభాష వేరు కావడంతో భాష వల్లనే సమాజంలో అంతరాలు ఎర్పడుతున్నాయి. ప్రతివాడికీ బతికే హక్కూ, అమ్మభాషలోనే పనిచేసే హక్కూ పుట్టుకతో సిద్ధించేవే. అయితే అవి ఆంగ్లమాధ్యమం ద్వారా కాకూడదు. కొన్ని సామాజిక కారణాలవల్ల అలా కావడం దురదృష్టకరం. దానిని సరిదిద్దవలసిందే.

**నియమాలు:**

1. ఇంటర్మీడియట్ స్థాయి వరకు తెలుగు మాధ్యమం తప్పనిసరిగా ఉండాలి.
2. తెలుగు మాధ్యమం వీలు కాని చోట అన్ని స్థాయిలలో తెలుగును ఒక భాషగా బోధించడం తప్పనిసరిగా ఉండాలి.
3. తెలుగు ఒక భాషగా గానీ తెలుగుమాధ్యమంలో గానీ చదవనివారికి తెలుగు సామర్థ్యపరీక్ష తప్పనిసరి చేయాలి.

**ప్రాతిపదిక**

ప్రపంచీకరణ ప్రభావం వల్ల శీఘ్రగతిన విస్తరిస్తున్న ఆంగ్లభాష ఆధిపత్య పదఘట్టనల కింద దేశీయభాషలన్నీ నలిగిపోతున్నాయి. విద్యావిధానంలో మాతృభాషావ్యవహారానికి అవకాశం లేనప్పుడు భాష అంతరించి పోతుంది. దానితోపాటుగా జాతీ సంస్కృతీ అస్తిత్వాన్ని కోల్పోతాయి. తద్వారా భావి భారతం దేశీయభాషా సుజల జలాలు లేని ఎడారిగా మారిపోతుంది. దేశీయ భాషా వ్యవహార జాతులన్నీ త్వరితగతిన అంతరించిపోయే ప్రమాదం ఉంది. ఇది ముమ్మాటికీ జీవవిధ్వంసమే. అందుకే ఒక భాషావిధానం అవసరం.

**5.1.1.1 దేశంలో భాషావిధానం**

బహు భాషా వ్యవహర్తలు గల భారతదేశంలో 200 పైగా భాషలు ఉన్నాయి. ప్రతి రాష్ట్రంలోనూ ఎక్కువమంది ఏ భాష మాట్లాడితే ఆ భాష ప్రాంతీయ భాష. ఐతే దేశంలోని వివిధ ప్రాంతాల మధ్య అనుసంధాన భాషగా హిందీనీ, అంతర్జాతీయ కార్యకలాపాలకు ఆంగ్లాన్నీ వినియోగిస్తున్నారు. శాస్త్రసాంకేతిక వికాసంవల్ల అవసరాల నిమిత్తం ఒక ప్రాంతీయ భాషతోపాటు ఇతర భాషలూ నేర్చుకోవలసిన అవసరం ఏర్పడింది.

భారతదేశంలో కొన్ని రాష్ట్రాలలో ఒకటికంటే ఎక్కువ భాషలు మాట్లాడే సందర్భాలు ఉన్నాయి. స్వాతంత్ర్యానికి పూర్వం కూడా భాషా సమస్య ఉంది. బోధన మాధ్యమంగా ఆంగ్లం, సంస్కృతం, అరబిక్ లలో ఏది ఉండాలన్న దానిపై వివాదాలు తలెత్తాయి. చివరకు మెకాలే (1935) ప్రతిపాదనల ద్వారా ఆంగ్లం అధికార భాషగా బోధనా భాషగా స్థిరపడింది.

20 వ శతాబ్దిలో ద్విభాషా సూత్రం అమలులో ఉండేది. ఆంగ్లం ప్రథమ భాష. ప్రాంతీయభాష ద్వితీయభాష. కానీ ఆంగ్లానికే ప్రాధాన్యం ఉండేది. స్వాతంత్రోద్యమ కాలంలో ప్రజలకూ, నాయకులకూ, ప్రభుత్వానికీ ఆంగ్లం అనుసంధానంగా ఉన్నప్పటికీ ఆ భాష తెలిసినది కొద్దిమందికే. ఏదో ఒక దేశ భాష మాత్రమే అధికార భాషగా ఉండాలనే అభిప్రాయం బలపడింది. అధిక సంఖ్యాకుల మాతృభాష హిందీ కావడంతో హిందీ వెలుగులోనికి వచ్చింది. హిందీ ఒక భాష గాదు. అది కొన్ని భాషలసమూహానికి మారుపేరు. ఆ సమూహంలో ఖడీబోలీ, అవధీ, రాజస్థానీ, హర్యానవీ, మగక్, మైథిలీ, చత్తీస్ గఢ్, బుందేలీ, భోజపురీ, పహాడీ లాంటివి ఎన్నో ఉన్నాయి. వీటిని మాండలికాలు అనడం కన్నా భాషలు అనడం మేలు. కేంద్రసాహిత్య అకాడమీ కూడా వీటిని ప్రత్యేకభాషలుగా గుర్తించి సాహిత్యపురస్కారాలను అందిస్తోంది.

స్వాతంత్ర్యానంతరం హిందీ అధికార భాష అయ్యింది. దేశమంతటా హిందీభాషను అమలు చేయాలనీ, పాఠశాలలో తప్పనిసరి చేయాలనీ నిర్ణయించారు. హిందీయేతర ప్రాంతాలలో దీనికి తీవ్ర వ్యతిరేకత వచ్చింది. తమిళనాడులో ఏకంగా హిందీ వ్యతిరేక ఉద్యమాలు చెలరేగాయి. హిందీ భాషా వాదుల బలం ఎక్కువగా ఉన్నప్పటికీ హిందీని ఇతర భాషా రాష్ట్రాలపై రుద్దడానికి కేంద్రప్రభుత్వం ఒప్పుకోలేదు. ఈ పరిస్థితిని సమీక్షించడానికి కేంద్రప్రభుత్వం కొఠారి కమిషన్ ను వేసింది. వారి సిఫార్సుల మేరకు ఏర్పడినదే త్రిభాషా సూత్రం. దీని ప్రకారం:

**హిందీయేతర రాష్ట్రాలలో పిల్లలు నేర్చుకోవలసిన భాషలు:**

1. మాతృభాష లేదా ప్రాంతీయ భాష
2. జాతీయ అధికార భాష (Union Official Language) హిందీ
3. అంతర్జాతీయ భాష ఆంగ్లం

**హిందీ మాతృభాషగా గల రాష్ట్రాలలో నేర్చుకోవలసిన భాషలు**

1. మాతృభాష లేదా ప్రాంతీయభాష – హిందీ
2. అంతర్జాతీయ భాష–ఆంగ్లం
3. ఒక భారతీయ భాష (దక్షిణ భారత భాషకు ప్రాధాన్యం)

1964లో కొఠారి కమీషన్ ప్రతి విద్యార్థీ ప్రాంతీయ భాషతోపాటు విధిగా హిందీ, ఆంగ్ల భాషలను అభ్యసించాలని ప్రతిపాదించింది. 1978లో ఎన్సిఈఆర్టీ (NCERT) వారు రూపొందించిన 10+2+3 విద్యాప్రణాళికలో కూడా త్రిభాషా సూత్రాన్ని తప్పనిసరిగా అమలు చేయాలని నిర్ణయించారు. 1986 జాతీయ విద్యావిధానం (NPE 1986) కూడా త్రిభాషా సూత్రానికి ఆమోదం తెలిపింది.

**5.1.1.2 రాష్ట్రంలో భాషా విధానం**

స్వాతంత్ర్యం తర్వాత భాషా ప్రాతిపదికన పునర్వ్యవస్థీకరణ చెందిన రాష్ట్రం ఆంధ్రప్రదేశ్. అయితే ఆంధ్రప్రదేశ్ లో నైరుతి సరిహద్దులో కన్నడం – తెలుగు, దక్షిణ ప్రాంతంలో తమిళం – తెలుగు వాడకంలో ఉన్నాయి. తెలంగాణా ప్రాంతంలో తెలుగు, మరాఠీ, కన్నడ, ఉర్దూభాషలు వ్యవహారంలో ఉండేవి. పూర్వం నైజాం పాలనకాలంలో ఉర్దూ అధికార భాష. అందువల్ల పాలన, బోధనాది రంగాలలో తెలుగు వెనకబడింది.. ఆంగ్లేయుల పాలనలో ఆంగ్లం అధికార భాషగా బోధనభాషగా ఉండటంవల్ల దేశ భాషలకంటే అధికంగా అది ప్రాచుర్యం పొందింది. దేశ భాష అయిన తెలుగు వెనకబడింది. ఉపాధి సముపార్జన ఆంగ్ల మాధ్యమంలో చదివినవారికే పరిమితం. తెలుగు మాధ్యమంలో చదివిన వారికి ఉద్యోగ భద్రత లేదు. దీనివల్ల బోధనలోగానీ పాలనలోగానీ ఆశించినంతగా తెలుగు వ్యవహారంలో లేదు. దేశంలోని చాలా రాష్ట్రాలలో హిందీని తృతీయభాషగా ప్రవేశపెట్టారు. మన రాష్ట్రంలో వారానికి మూడు గంటలు హిందీకి కేటాయించారు. అంటే కొఠారి కమీషను సూచనల ప్రకారం హిందీయేతర రాష్ట్రాల విద్యా విధానం, భాషావిధానం, ఆచరణలలో భాగంగా త్రిభాషా సూత్రం జాతీయ స్ఫూర్తిని కలిగిస్తుంది. ఇతర ప్రాంతాలతో సంబంధ బాంధవ్యాలు కలిగేలా చేస్తుంది. అనువాదాలను, మాతృభాషా ప్రాధాన్యాన్నీ ప్రోత్సహిస్తుంది. తద్వారా అంతర్జాతీయ అవగాహన కలుగుతుంది.

దీనితోపాటు ఉన్నత విద్యాస్థాయిలో కూడా విద్యా బోధన ప్రాంతీయ భాషల్లోనే జరగాలని సిఫారసు చేసిన మొట్టమొదటి నిపుణుల కమిటీ డా. రాధాకృష్ణన్ కమిషన్ (క్రీ.శ.1948). దీనికి మద్దతుగా కాశ్మీర్, నాగాలాండ్ లలో ఆంగ్లభాషా మాధ్యమం విఫలమయ్యిందని విద్యావేత్త శ్రీ.ఎం.వి. రాజగోపాల్ గారు పేర్కొన్నారు. ఇవన్నీ మాతృభాషా మాధ్యమం లేకపోవడం వల్ల కలిగే అనర్థాలు.

మనోవైజ్ఞానికంగా చూస్తే –అజ్ఞాత విషయాన్ని అపరిచిత మాధ్యమం ద్వారా సాధించటం అవాంఛనీయం. అందుకే కొఠారి కమిషన్ కూడా మాతృభాషా ప్రాధాన్యాన్ని ఉద్ఘాటిస్తోంది.

**5.1.1.3 కొఠారీ కమిషను**

త్రిభాషా సూత్రం జాతీయ సమగ్రతనూ, సమైక్యతనూ ప్రోత్సహించ డానికి ఉద్దేశించినది. భారతీయ మాతృ భాషల అభ్యసనాన్ని ప్రోత్సహిస్తూ నూతన విద్యావిధానంలో భాగంగా భారతదేశ ప్రభుత్వం 1964లో జాతీయ విధానాన్ని అమలుచేయడానికి డా. కొఠారీ అధ్యక్షతన ఒక కమిటీని వేసింది.

హిందీ వ్యవహృత రాష్ట్రాలలోని పిల్లలు హిందీ, ఆంగ్లం, మరి ఏదైనా ఒక ప్రాంతీయ భాషను ఎంపిక చేసుకోవాలి. తక్కిన రాష్ట్రాల్లోని పిల్లలు తమ ప్రాంతీయభాషనూ, హిందీనీ, ఆంగ్ల భాషలను ఎంచుకోవాలి . అయితే ఈ విధానం ఆంధ్రప్రదేశ్ ఇంకా మరికొన్ని రాష్ట్రాలలో మాత్రమే అమలులో ఉంది. హిందీ వ్యవహృత రాష్ట్రాలలో ఈ విధానం నీరుగారిపోయింది. తమిళనాడులో కూడా దీనిపట్ల తీవ్ర వ్యతిరేకత ఏర్పడడంతో అక్కడా ద్విభాషా విధానాన్నే ఎంచుకోవలసి వచ్చింది. ఇలా రాష్ట్రాలలో త్రిభాషా సూత్రం అమలు చేయాలన్న కేంద్రప్రభుత్వ సంకల్పం చాలావరకూ నీరు గారిపోయిందనే చెప్పాలి.

**5.1.1.4. విద్యా పరిశోధన శిక్షణా మండలి (పాఠశాల విద్యా పాఠ్యాంశ కార్యాచరణ ప్రణాళిక):**

ఈ సంస్థ1999లో దేశవ్యాప్తంగా బహిరంగ చర్చ కోసం ఒక చర్చా నివేదిక విడుదల చేసింది. ఈ చర్చ ఎక్కువగా " ప్రచ్ఛన్న రాజకీయ నియమావళి " చుట్టూ ఉన్న భాషా బోధన సంబంధిత సమస్యలపై కేంద్రీకృతం కావడంవల్ల అంత పెద్దగా ఆకర్షించలేకపోయింది. విద్యా పరిశోధన శిక్షణా మండలి 1999 నివేదికను సరిదిద్ది డిసెంబర్ 2000 లో మరో నివేదికను విడుదల చేసింది. రాష్ట్ర ప్రభుత్వాలకు అలాగే కేంద్రపాలిత ప్రాంతాలకూ రాబోయే దశాబ్దంలో అనుసరించవలసిన పాఠశాల విద్యా పాఠ్యాంశ కార్యాచరణ ప్రణాళిక అది. ఈ నివేదికలో ఉన్న మార్గదర్శక సూత్రాలను కేంద్ర ప్రభుత్వ నియంత్రణలోని విద్యా సంస్థలు అనుసరిస్తాయి, ఇప్పటికే త్రిభాషా సూత్రం వర్తిస్తోంది కాబట్టి తగిన విధంగా దీన్ని అమలు చేసే ప్రయత్నాలు మరింత తీవ్రతరం చేయాలని ఈ నివేదిక సారాంశం.

**5.1.1.5. పాఠ్యాంశ ప్రణాళికలో భాషల వ్యాప్తి – వినియోగం**

పాఠశాల పాఠ్య ప్రణాళికలో ప్రతిపాదించిన భాషాసమితులు – వినియోగం

**ప్రాథమిక విద్య - I - V తరగతులు :**

I - II ఒక భాష : మాతృభాష / ప్రాంతీయ భాష

III - V మాతృభాష / ప్రాంతీయ భాష

**ప్రాథమికోన్నత విద్య- VI -VIII తరగతులు :**

VI -VIII మూడు భాషలు :

1. మాతృభాష / ప్రాంతీయ భాష (లేక హిందీ ప్రాంతాలలో హిందీ)
2. ఆధునిక భారతీయ భాష ( హిందీయేతర ప్రాంతాలలో హిందీ) .
3. అంతర్జాతీయభాష (ఆంగ్లం).

**సెకండరీ (ఉన్నత పాఠశాల) విద్య :**

సెకండరీ (ఉన్నత పాఠశాల) విద్య – IX , X తరగతులు :

IX - X మూడు భాషలు :

1. మాతృభాష / ప్రాంతీయ భాష (లేక హిందీ ప్రాంతాలలో హిందీ) .
2. ఆధునిక భారతీయ భాష ( హిందీయేతర ప్రాంతాలలో హిందీ) .
3. అంతర్జాతీయభాష (ఆంగ్లం).

హైయర్ సెకండరీ (రెండవ ఉన్నత పాఠశాల) విద్య XI , XII తరగతులు

XI , XII రెండు భాషలు

1. మాతృభాష లేదా ప్రాంతీయ భాష
2. ఆంగ్లం

ఈ భాషా యోజన వ్యవస్థ నిజానికి కొత్తది కాదు. అనేక సిఫారసుల మీదట అంతకుముందు అవకాశం కల్పించినదే.

**సంస్కృత భాషా అధ్యయనం :**

సంస్కృతభాషాధ్యయనానికి అవకాశమూ ప్రోత్సాహమూ అందించాలి. ప్రాథమిక లేదా ప్రాథమికోన్నత విద్యలో తగిన స్థాయిలో హిందీ, మాతృభాషలైన ప్రాంతీయ భాషలతో కలిపి ఒక మిశ్రమ

పాఠ్యక్రమంలో భాగంగా ప్రవేశపెట్టవచ్చు .

సంస్కృతాన్ని సెకండరీ (ఉన్నత పాఠశాల) విద్యాస్థాయిలో అధ్యయనం చేయాలనుకునే విద్యార్థులకోసం ఒక అదనపు ఐచ్ఛికంగానూ హైయర్ సెకండరీ (రెండవ ఉన్నత పాఠశాల) దశలోనూ తగిన ఐచ్ఛికాంశంగా అందించవచ్చు.

**విదేశీ భాషల అధ్యయనం :**

ఆదరణ ఉండి, తగిన మౌలిక ఉపకరణాలతో బోధనావకాశం ఉన్న చైనీసు, జపనీసు, రష్యను, ఫ్రెంచి, జర్మను, అరబ్బీ, పారశీకం, స్పానిషు మొదలైన భాషలను సెకండరీ (ఉన్నత పాఠశాల) విద్యా స్థాయిలో అదనపు ఐచ్ఛికాలుగా అందించవచ్చు.

**బోధన మాధ్యమం :**

పాఠశాల విద్యలోని అన్ని దశలలోనూ మాతృభాష మాధ్యమంగా ఉండాలి. ఒకవేళ భాషావ్యవహర్తలకు మాతృభాష/ప్రాంతీయ భాష ఒకటే అయితే అదే భాష, ప్రాథమికవిద్య పూర్తి అయ్యేవరకూ అన్ని స్థాయిలలోనూ మాధ్యమంగా ఉంటుంది. మాతృభాష, ప్రాంతీయ భాష ఒకటి కాని వ్యవహర్తల విషయంలో ప్రాంతీయ భాషను మూడవ తరగతి నుండీ బోధనా మాధ్యమంగా స్వీకరించవచ్చు.

**చర్చ :**

జాతీయ విద్యా విధాన ప్రణాళిక 1968, విద్యా విధాన ప్రణాళిక 1986, త్రిభాషాసూత్రం అమలు కోసం విద్యావిధానంపై పునరుద్ఘాటిస్తూ 1992లో భారత పార్లమెంటు చేసిన కార్యాచరణ ప్రణాళికా ఇవన్నీ అక్షరాలా చిత్తశుద్ధితో అమలులోకి రావాలి. కనీసం ప్రాథమిక విద్యాస్థాయిలోనైనా మాధ్యమంగా మాతృభాష ఉండాలి .

పాఠశాల ప్రక్రియలో మరిన్ని భాషలు నేర్చుకోవడం విద్యార్థికి భారం కాకుండా చూడటమే సరైన పద్ధతి. భాషా శాస్త్రవేత్తలూ, విద్యావేత్తలూ, రాజకీయవేత్తలూ తరచుగా విద్యార్థులకు మాతృభాషా మాధ్యమమే తగినదని చెప్తుంటారు. అలాకాదని ఆంగ్లమాధ్యమం ద్వారా చదివితే ఆంగ్లం బాగా వస్తుందని కొందరు చెప్తుంటారు. కానీ అది అసంబద్ధం. ఈ విధానం జాతీయస్ఫూర్తికీ మానవతావిలువలకూ విరుద్ధం. అసలు ఎవరికీ మాతృభాషకాని ఆంగ్లమాధ్యమం ఎవరికోసం? ఎందుకోసం? దీనికి కొందరు చెప్పే జవాబు ఉద్యోగభద్రత. భారతదేశం లోపలా, భారతదేశం బయటా ఉద్యోగాలకోసం భారతీయభాషలను వాడే పద్ధతికి తగిన విద్యావిధానం భారతదేశంలో లేదు. దీనికి చైనా, జపాన్, రష్యా, ఫ్రాన్స్ వంటి ఆంగ్లేతర భాషలు మాట్లాడే దేశాలే తార్కాణాలు. ఉదాహరణకు , కర్ణాటక రాష్ట్ర ప్రభుత్వం ప్రాథమికోన్నత పాఠశాల స్థాయిలో రెండు భాషలలో ఒకటిగా కన్నడ (ప్రాంతీయ భాష) భాషను పరిచయం చేసింది. ఆ స్థాయిలో మార్గదర్శకాలుగా మూడు భాషలు ఉన్నాయి. అవి , మాతృభాష / ప్రాంతీయ భాష , ఒక ఆధునిక భారతీయ భాష మరియు విధిగా ఆంగ్లం . మూడు భాషలు బోధించడం ప్రాథమిక విద్యావిధానంలో సర్వసాధారణం. ప్రాంతీయభాషా మాతృభాషా ఒకటి కాని విద్యార్థులు తమ మాతృభాషను ఎంచుకుంటే గనక తమ రాష్ట్ర అధికార భాషనే ప్రాంతీయభాష లేక ఆధునిక భారతీయ భాషల విభాగంలో ఏదో ఒక దానిలో విధిగా స్వీకరించాలనే నియమం రాష్ట్రప్రభుత్వమే విధించవచ్చు.

కన్నడ మాతృభాషగా కలవారు, కన్నడం మాతృభాష కాకపోయినా కర్ణాటక రాష్ట్రంలో నివసించేవారు అందరూ తప్పనిసరిగా త్రిభాషాసూత్రంలో భాగంగా కన్నడభాషను చదవాలని కర్ణాటకప్రభుత్వం నియమం పెట్టింది. అందుకు కావలసిన ఉత్తర్వులను జారీ చేసింది. ప్రాథమికోన్నత, సెకండరీ విద్యాస్థాయిలలో అన్నిపాఠశాలలు దీన్ని పాటించాలి.

పరోక్షంగా జీవవిధ్వంసానికి కారణమయ్యే భాషా విధానాల పట్ల న్యాయస్థానాలూ చట్టసభలూ పునరాలోచన చేయాలి. జీవవిధ్వంసాన్ని అరికట్టేందుకు మాతృభాషామాధ్యమం తప్పనిసరి చేస్తూ రాజ్యాంగ సవరణ చేయాలి.

**సూచనలు:**

1. ప్రభుత్వ, ప్రైవేటు, కార్పోరేట్ పాఠశాలల్లో కూడా అన్ని స్థాయిల్లో పదో తరగతి వరకు తెలుగు మాధ్యమం తప్పనిసరిగా ఉండాలి.
2. మొదట మాతృభాషలో చదవడం రాయడం నేర్చుకున్న విద్యార్థికి పాఠశాల విద్యాభ్యాసంలో ఉత్తీర్ణత మెరుగ్గా ఉంటుంది. అలాగే ద్వితీయ భాషాధ్యయనం సులభతరం ఔతుంది. ప్రాథమిక స్థాయిలో శాస్త్రీయ, ఆధునిక పద్ధతుల ద్వారా భాషను బోధించేలా చూడాలి. ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నతవిద్యా స్థాయిలలో భాషా సాంకేతికతలు వినియోగించే వీలు కల్పించాలి.
3. అన్ని విద్యా విభాగాలలో తెలుగును ఒక భాషగా బోధించే విధానం ఉండాలి.
4. వృత్తి/సాంకేతిక/ తంత్ర విద్యా కళాశాలలలోనూ, భాషాధ్యయనం, పరిశోధనలకు అవకాశం కల్పించాలి.
5. నియత, అనియత, వయోజన, పాఠశాలేతర విద్యాబోధనలలోనూ, కళారంగాలలోనూ భాషకు ప్రాతినిధ్యం కల్పిస్తూ, మాతృభాషానైపుణ్యాలనూ పెంచుకొనేలా చూడాలి. వీటి వల్ల తెలుగు మాధ్యమంలో చదవడం, తెలుగు చదివినవారికి ఉపాధి అవకాశాలు కలుగుతాయి. దేశప్రగతికి ఇది దోహదం చేస్తుంది.

ఇటీవల భారతదేశ సర్వోన్నత న్యాయస్థానం ఎవరికి నచ్చిన మాధ్యమంలో వాళ్ళు చదువుకోవడానికి రాజ్యాంగం కల్పించిన హక్కును ఉట్టంకిస్తూ ఒక తీర్పు చెప్పింది. అది నిజమే. కానీ దానివల్ల దేశ భాషలన్నీ పూర్తిగా కనుమరుగయ్యే ప్రమాదం ఉంది. అది ప్రస్తుతం వ్యక్తిస్వేచ్ఛనూ హక్కునూ పరిరక్షిస్తున్నట్లు ఉన్నా, కొద్దికాలంలోనే ప్రాంతీయభాషల విధ్వంసానికి దారితీసేటట్లుగా ఉంది.

**(తరువాయి వచ్చే సంచికలో.....)**

**రచయితలు**

**డా॥ గారపాటి ఉమామహేశ్వరరావు, ఫోను:** 9866128846,

**డా॥ అద్దంకి శ్రీనివాస్. ఫోను:** 8500305374.

**హైదరాబాదులోని కేంద్రీయ విశ్వవిద్యాలయంలో ఆచార్యులు.**

ఇవీ ముచ్చట్లు

# మాతృభాషపై మంత్రిగారి అవగాహన ఇదీ!



ప్రభుత్వ పాఠశాలల్లో మధ్యాహ్న భోజనం పెడుతున్నాం. ఉచితంగా యూనిఫాంలు అందిస్తున్నాం. అయినా ప్రభుత్వ పాఠశాలల్లో రోజురోజుకీ విద్యార్థులసంఖ్య తగ్గిపోతోంది. కానీ ప్రయివేటు ఇంగ్లీషు మీడియం స్కూళ్లలో ఎంత మొత్తం ఫీజులు చెల్లించయినా తమ పిల్లల్ని చదివిస్తున్నారు. చాలాసార్లు మా పర్యటనల్లో తల్లితండ్రుల్ని ప్రశ్నించాను. ఎందుకమ్మా అంత డబ్బు ఖర్చుచేసి మీ పిల్లల్ని ఇంగ్లీషు మీడియంలో చదివిస్తున్నారని? 'గ్లోబలైజేషన్‌లో పోటీ పెరిగిపోయింది. మా పిల్లలు ఇంగ్లీషుమీడియంలో చదివితేనే ఉద్యోగాలొస్తాయి' అంటూ తల్లిదండ్రులు సమాధానం చెబుతున్నారు. తమ పిల్లలకోసం పేదవారు కూడా త్యాగాలు చేస్తున్నారు..' ఈ మాటలన్నది రాష్ట్ర మానవ వనరులు, విద్యాశాఖమంత్రి గంటా శ్రీనివాసరావు. ఇటీవల (2-9-15) శ్రీ కొప్పరపు కవుల కళాపీఠం ఏర్పాటు చేసిన సభలో అతిథిగా పాల్గొన్న మంత్రి విశ్లేషణ. మామూలుగా అయితే 'అయ్యో నిజమే కదా! ప్రభుత్వం మాత్రం ఇంకేం చేస్తుంది?' అనిపిస్తుంది. తెలుగు భాషను దారుణంగా నాశనం చేసిన అధికార పాలనా వ్యవస్థలో దాదాపు ఇరవయ్యేళ్లుగా భాగస్వామ్యమున్న మంత్రి - అమాయకంగానో, ప్రజల్ని, భాషాభిమానుల్ని అజ్ఞానులనుకొనో చేసిన ప్రసంగం అది!

అంతకు ముందు ఆ సభకు అధ్యక్షత వహించిన మహాసహస్రావధాని డా॥ మేడసాని మోహన్, భాష పరిరక్షణకు ప్రభుత్వం శ్రద్ధ వహించాలని చేసిన విజ్ఞప్తికి మంత్రి ప్రతిస్పందన అది. వేదికపై అధికార భాషా సంఘం పూర్వ అధ్యక్షులు, భాషాభిమాని, ప్రస్తుత శాసనసభ ఉపసభాపతి మండలి బుద్ధప్రసాద్, ప్రముఖ సంపాదకులు కె. రామచంద్రమూర్తి, భాషాసంస్కృతుల గురించి ఎన్నో గొప్ప చలన చిత్రాలను రూపొందించిన కె. విశ్వనాథ్ వంటి దిగ్గంతుల సాక్షిగా మంత్రి అంత అవగాహనా రాహిత్యంతో మాట్లాడితే, ఇక ఈ రాష్ట్రంలో తెలుగుభాష పూర్వవైభవాన్ని సంతరించుకుంటుందని ఆశించగలమా? లేక కార్పొరేట్ విద్యాసంస్థల అధినేత మంత్రి నారాయణతో వియ్యమందుకోబోతున్న గంటా మరో విధంగా ఎలా మాట్లాడగలుగుతారు అనుకుందామా? ఆ సందేశమిచ్చి సభ మధ్యలోనే సెలవు తీసుకుని మంత్రి వెళ్లిపోయారు. ఆ తర్వాత మళ్లీ మాట్లాడిన డా॥ మేడసాని 'అయ్యా! ఇంగ్లీషు చదువులు చదువుకోవద్దని తెలుగు భాషాభిమానులు అనడంలేదు. ఇంగ్లీషు చదువుకోమనండి. కానీ, కనీసం ఒక అంశంగా తెలుగును చదువుకొనేలా తగిన చర్యలు తీసుకోండి. అమెరికా సంయుక్త రాష్ట్రాలు అన్నింటిలోనూ అక్కడి తెలుగువారు 'పాఠశాల' పేరుతో సంస్థలు స్థాపించి, అక్కడి పిల్లలకు తెలుగు నేర్పిస్తున్నారు. ఇక్కడ మనం ఎందుకు చేయలేకపోతున్నామో ఆలోచించండి' అని వేడుకున్నారు. మంత్రితో విభేదించడం ఎందుకనుకున్నారో ఏమో మండలి బుద్ధప్రసాద్ మంత్రి మాటలను పట్టించుకోలేదు. మండలి ఈ సభలో మాత్రం భాషాభివృద్ధి అంశాన్ని స్పృశించలేదు.

'ఉద్యోగాల కోసం ఇంగ్లీషే చదవాలి. అందుకోసమే ఈతరం వారికి ఇంగ్లీషు చదువులు తప్పనిసరి' అనే తప్పుడు సిద్ధాంతాన్ని ప్రచారం చేసే కొందరు కార్పొరేట్ విద్యానుకూలురైన మేధావులు, అవగాహనలేని పాలకులు మన పొరుగునే వున్న కేరళ అనుభవాన్ని పరిశీలించాలి. కేరళ రాష్ట్రంలోని విద్యావిధానంలో శతాబ్దాలుగా ఇంగ్లీషుమీడియందే అగ్రస్థానం. అయినా మాతృభాషాభిమానంలో మలయాళీలు ముందుభాగాన నిలుస్తారు. ఇది ఎలా సాధ్యమవుతుందో అధికార పీఠాలలో కొనసాగుతున్న ప్రజాప్రతినిధులు, అధికారులు పరిశోధించాలి. మూడు దశాబ్దాలుగా తెలుగునాట మాతృభాష నాశనం కావడానికి మూలకారకులైన రాజకీయవాదులు, ఇకనైనా కళ్లు తెరవకపోతే తెలుగుభాష ఎలా బతికి బట్టకడుతుంది?! ఆంగ్లభాషలో విద్యనభ్యసించే వారిలో ఎంతశాతంమంది - గత ముప్పై ఏళ్ల అనుభవంలో- ఉద్యోగాలలో స్థిరపడ్డారు? కోటి విద్యలు కూటికొరకే కదా? నిజమే. ఆంగ్ల మాధ్యమం మాత్రమే కూడుపెడుతుందా? నవ్యాంధ్రప్రదేశ్‌లోనైనా భాషా విధానంలో జరిగిన తప్పిదాలను సరిదిద్దుకోకపోతే చరిత్ర క్షమించదు.

- **బి.వి. అప్పారావు,** విశాఖపట్నం, ఫోను: 9347039294

## కవితలకు ఆహ్వానం

నవంబరు 14 నుండి 20వ తేదీ వరకు నిర్వహించే గ్రంథాలయ వారోత్సవాల సందర్భంగా జీవిత పర్యంత విద్యాలయం, పుస్తకాల గుడి అయిన గ్రంథాలయాలపై 30 వరుసలకు మించకుండా కవితలు వ్రాసి క్రింది చిరునామాకు పంపగలరు. ఎంపిక చేసిన రచనలను పత్రికలో ప్రచురిస్తాము. మొదటి మూడు స్థానాలలోని కవితలకు బహుమతులిస్తాము.

సంపాదకులు: **గ్రంథాలయ సర్వస్వం** (మాసపత్రిక), శ్రీ సర్వోత్తమ భవనం, విజయవాడ-520010. ఫోన్: 0866-2472313, 2487296, Email: apla1914@gmail.com

## ఊళ్ల పేర్లను మార్చాలి

గోదావరి పుష్కరాల ముగింపు సమావేశంలో ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడుగారు ప్రసంగిస్తూ 'రాజమండ్రి పేరును 'రాజమహేంద్రవరం'గా మారుస్తానని ప్రకటించారు. ఆంగ్లేయుల పాలనలో మారిపోయిన 'రాజమండ్రి' పేరును 'రాజమహేంద్రవరంగ'గా మారుస్తాననడం తెలుగువారందరూ సంతోషించదగ్గ విషయం. తెలుగు రాష్ట్రాల్లో వివిధ కారణాలవల్ల మారిపోయిన ఊళ్ళపేర్లు చాలా ఉన్నాయి. కాని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడి దాదాపు 60 సంవత్సరాలు కావస్తున్నా ఊళ్ళపేర్లు మార్పు జరగకపోవడం శోచనీయం. మహానగరాలైన మద్రాసు 'చెన్నై'గాను, కలకత్తా 'కోల్‌కత్తా'గాను, బొంబాయి 'ముంబై'గాను మార్పు చెంది చాలా ఏళ్ళయ్యాయి. గత సంవత్సరం కర్నాటక రాష్ట్ర ప్రభుత్వం ఆ రాష్ట్రంలోని 12 పట్టణాల పేర్లను కన్నడీకరణం చేసింది. ఉదాహరణకు BANGALORE అన్న పేరును కన్నడ ఉచ్చారణకు తగినట్లు BANGALURU అని మార్చింది. ఈ పేర్ల మార్పుకు కేంద్ర ప్రభుత్వం అనుమతి తీసుకోవాల్సివుంటుంది. అది కేవలం తతంగం మాత్రమే. అందుకు కేంద్రప్రభుత్వం బేషరతుగా అనుమతినిస్తుంది. కాని ఆదిశగా ఆంధ్రప్రదేశ్‌ను పాలించిన రాష్ట్రప్రభుత్వాలు చొరవచూపకపోవడం శోచనీయం. ప్రస్తుతం చంద్రబాబునాయుడుగారు రాజమండ్రి పేరును రాజమహేంద్రవరంగా మారుస్తానని ప్రకటించడం ప్రశంసనీయం.

కాని చంద్రబాబునాయుడుగారు ఆ సందర్భంలోనే 'నర్సాపూర్' అని మాట్లాడడం విడ్డూరం. బాధ్యతగలవ్యక్తిగా తెలుగుదనాన్ని విస్మరించడం ఎంతవరకు సమంజసం? నర్సాపురం అనివుండాలిగదా? ఇలా 'పూర్'లుగా పిలువబడ్డ వూళ్ళు ఆంధ్రప్రదేశ్‌లో చాలానే ఉన్నాయనుకుంటాను. వాటినన్నింటిని తెలుగు నుడికారంతో 'పురం' అని మార్చాలి. రాజమండ్రితోనే ఆగకుండా ఆంధ్రప్రదేశ్‌లో అస్తవ్యస్తంగా మారిన ఊళ్ళపేర్లన్నిటిని మార్పు చేసే కార్యక్రమాన్ని చేపట్టాలి. ఇందుకు తమ ఊళ్ళపేర్ల మార్పును కోరుకునే ప్రజలు ముఖ్యమంత్రిగారికి విజ్ఞప్తులు పంపితే మంచిది. ఈ విషయమై తెలుగు భాషోద్యమ సమాఖ్య కృషి చేయవలసిందిగా మనవి.

**ఆర్. శ్రీనివాస్,** బెంగళూరు

## చిత్తశుద్ధిలేని ప్రభుత్వం

**మీరు** అమ్మనుడిలో 'చిత్తశుద్ధి, శ్రద్ధ కొరవడిన ప్రభుత్వ ఉత్సవం తెలుగు భాషాదినోత్సవం' అని వ్రాసిన దానిని చదివాను. భాషపై అధికార, ప్రభుత్వ వర్గాలకున్న గౌరవం ఎంతపాటిదో అర్థమైంది.!

తెలుగుభాషకు గౌరవ మర్యాదలు సంపాదించడానికి తెలుగు వెలుగు ఇంటింటా నింపాలంటే పాఠశాలలో తెలుగు మాధ్యమం తీసుకురావాలన్న మీ తపన **'నడుస్తున్న చరిత్ర'** పాఠకులకు తెలుసు. భూస్వామ్య పెత్తందారీ పోకడలతో ఉన్న నేటి తెలుగు రాష్ట్రాలను ఏలే పెద్దలు తెలుగును విడనాడి, ప్రాథమిక పాఠశాల స్థాయినుంచి అమ్మనుడిని వదలి ఆంగ్ల మాధ్యమంలో చదువులు సాగించాలన్న పట్టుదలతో ఉన్నారు. వినతిపత్రాలు పుచ్చుకొని వాటిని ఖాతరు చేస్తారని నమ్మటం మంచిదికాదనిపిస్తుంది. తెలుగు మాట్లాడే ఇరు రాష్ట్రాల మేధావులను తెలుగు పునరుజ్జీవనం కోరే వారందరితో సంఘటిత

కవిత

## నాడు...! నేడు...!

**నాడు**

నేను నాటిన గులాబీలు
ముళ్ళను మాత్రమే విసిరినప్పుడు
వెన్నెల్లు చిందే చందమామ మసకేసినప్పుడు
కారుచీకటి కబంధ హస్తాలు
హృదయాన్ని పిండివేసినప్పుడు
ఈ జీవితం ఇంతేనేమోనని భయపడ్డాను

నేడు
గులాబీలనూ ముళ్లనూ
వేర్వేరుగా చూడటం నేర్చుకొంటున్నాను
గులాబీల గుబాళింపులో
ముళ్ళు గుచ్చుకున్నా ఆనందమే,
మనసునిండా అభిమానమే...

చీకటి కడుపున కాంతి పుడుతుందనీ
అమావాస్య తరువాత ఆనందపు వెలుగు వస్తుందనీ
హేమంతం కౌగిలిలోనే వసంతం ఉద్భవిస్తుందనీ
ముళ్ళలో పూచిన గులాబీలే
ఈ జీవితంలో కుళ్ళును కడిగి వేయగలవనీ

కళ్ళను తెరిపించి
వాస్తవానికి అద్దంపట్టి
జీవితాన్ని పూలపాన్పు చేస్తాయని
రాచబాట వేస్తాయని
బ్రతుకు పథంలో
అడుగులు వేయడం నేర్చుకొంటున్నాను

**– జంజనం ఈశ్వరబాబు**
ఫోన్: 9618029508

## చలసాని ప్రసాద్ సంస్మరణ వ్యాసం

**ఆ**గస్టు సంచిక చదివాను. ముఖ్యంగా చలసాని ప్రసాద్‌గారి గురించి మీరు చాలా విషయాలు తెలియజేశారు. 'అమ్మనుడి' పత్రికతో ఆయన పెంచుకున్న అనుబంధాన్ని వివరించారు. తెలుగుభాషపై మీకూ ఆయనకూ ఉన్న బాధ్యతాయుతమైన ఆలోచనలు ఎంతగానో ఆలోచింపచేశాయి. చలసాని పట్ల మీకు ఉన్న ఆలోచనలన్నీ పూసగుచ్చినట్టుగా 'నివాళి' ఉంది. 'అమ్మనుడి పత్రికకోసం చలసాని వంటి పెద్దలు నిజంగా బతికి ఉంటే ఎంతో మేలు జరిగి ఉండేదనిపిస్తుంది. సంస్మరణ వ్యాసం ఆయన వ్యక్తిత్వాన్ని తెలియజేస్తుంది.

**– సజ్జా వెంకటేశ్వర్లు,** వేటపాలెంపోస్టు, 9951169967

స్పందన

- ఎమ్. రాజగోపాలరావు

# ధర్మం-మతం-రెలిజియన్-మౌలికావగాహన

ఈమధ్య 'అమ్మనుడి'లో ధర్మం-మతం-రెలిజియన్ (Religion) పదాల సంబంధాల గురించి చర్చ సాగటం గమనించాను. ఎవరికివారు వాటి వర్తమాన అవగాహనలతో సాగుతున్నట్లు కనపడుతున్నది. కొంత స్పష్టతను అందించగలనేమోనని నాకు తెలిసిన విషయాలను ప్రస్తావించటానికి ప్రయత్నిస్తున్నాను.

ముందుగా గమనించవలసిన విషయమొకటుంది. ఇప్పటికీ ఉత్తర భారతంలో హిందూ, జైనం, బౌద్ధం, సిక్కు, ఇస్లాం, క్రైస్తవం వంటి వాటినన్నింటినీ ధర్మాలు అనే అంటున్నారు. వాటిని దక్షిణ భారతంలో మతాలంటున్నారు. విదేశాలలో Hinduism, Buddhism, Jainism, Sikkism, Christinity, Islam అంటున్నారు. వారు ఏ విశిష్ట వాదాన్నయినా 'ism' అంటారు. అట్లా వచ్చినవే Communism, Marxism, Confucionism వగయిరా. వీటికి మతభావం వర్తించదు. వాటి నేపథ్యాల పరిశీలనలోనే గ్రహించుకోవలసి ఉంటుంది.

'Religion' అనే ఆంగ్లపదం 'Religar' అనే గ్రీక్ పదంనుంచీ 'Religio' అనే లాటిన్ పదంనుంచీ ఉత్పన్నమయిందని ఆంగ్లభాషా నిఘంటువులలో విజ్ఞాన సర్వస్వాలలో వివరణ కనిపిస్తుంది. ఈ రెండు పదాలకు దాదాపు ఒక అతీత శక్తిమీద విశ్వాసముంచటమే అంటున్నారు. అది లౌకిక రూపాలకు అతీతం. ఆ అతీత శక్తిమీది విశ్వాసాన్ని కాలాంతరాలలో ఒక వ్యక్తికో, వస్తువుకో ఆరోపించుకొని మతంగా/ ధర్మంగా రూపొందించుకొన్నారు.

భారతదేశంలో ఏనాటినుంచో 'ధర్మం' ప్రాచుర్యమందింది. అది వైదికేతర శ్రమణ సంప్రదాయాలలో విస్తృత ప్రాచుర్యమందుకొన్నది. మనుస్మృతి 'వేదోఖిలో ధర్మమూల'మంటూనే స్మృతి, శీలాలు, సత్పురుషుల ఆచారాలు ఆత్మసంతుష్టి గూడా ధర్మమూలమేనంటున్నది. వేదత్రయంలో- ఋగ్యజుస్సామాలలో - 'ధర్మ' పదం 10 సార్లే తటస్థ పడుతుందని బిమల్‌చరణ్ లా (వీరు కలకత్తా విశ్వవిద్యాలయ అధ్యాపకులలో సర్వేపల్లి రాధాకృష్ణన్ సమకాలికుడు, మహాపండితుడు) వివరించారు. జైనం, బౌద్ధం వంటి శ్రమణ సంప్రదాయాలలో అది మూలసూత్రంగా కొనసాగుతున్నది. జైనుల 'సూత్రకృతాంగం' 383 పూర్వ ధర్మాలను వివరిస్తున్నది. బౌద్ధ 'బ్రహ్మజాలసుత్తంతం' బుద్ధుడు తిరస్కరించిన 62 అసద్ధర్మాలను వివరిస్తున్నది. బుద్ధుడు సమ్యక్ సంబోధిపొంది సాధించిన 'సద్ధర్మ' 'ధర్మచక్ర ప్రవర్తనం' బౌద్ధంలో అత్యంత ప్రాచుర్యమందిన ధర్మాల సమాహారం 'ధమ్మపదం సుప్రసిద్ధాలు. ధర్మమనే పదం బౌద్ధంలో చాలా విస్తృతంగా ప్రయుక్తమవుతూ సందర్భాన్నిబట్టి అనేక అర్థాలను అందిస్తున్నది. వాటిని ఆచార్య బుద్ధఘోష (క్రీ.శ.420 ప్రాంతం) నాలుగు వర్గాలుగా సంక్షిప్తీకరించారు. 1. గుణం, 2. దేశ్యం (దెననం), 3. పరియత్తి (బుద్ధవచన అవగాహన, ఆచరణ), 4. నిస్సత్త నిజ్జీవధర్మం-సత్త్వం-జీవంలేని మానసిక శారీరక ధర్మాలు. ఇటీవలి కాలంలో ఛైల్డర్స్ (Childers), మోనియర్ విలియమ్స్(M. M. Williams), రైస్ డేవిడ్స్ (Rhys Davids), వంటి సంస్కృత, పాళీ నిఘంటుకారులు ధర్మ పదానికి 20 అర్థాలదాకా ఇచ్చారు. బౌద్ధంలో ధర్మమనే పదవిస్తృతినవి అందిస్తాయి. ఆర్య సమాజ వ్యవస్థాపకుడు స్వామి దయానంద సరస్వతి 'హిందూమతం' అనటం, విగ్రహారాధన అవైదికమంటూ 'వైదిక ధర్మాన్ని' పునరుద్ధరించారు. అది ఉత్తర భారతాన్ని ఎంతగానో ప్రభావితం చేసింది, చేస్తున్నది. ఆవిధంగా ఏనాటినుంచో వస్తున్న ధర్మమనే పదం ఈనాటి వరకూ ఉత్తరభారతంలో వేళ్లూనుకుపోయింది.

ధర్మం-పదానికి అనేక నిర్వచనాలున్నాయి. వాటిలో ఈనాటి మతం, దైవవిశ్వాసం అనే ఛాయగూడా కనిపించదు. వాచవిగా కొన్ని నిర్వచనాలను సంక్షిప్తంగా ప్రస్తావించుకోవచ్చు. ధరతిలోకానితి- లోకమంతటికీ వర్తించేది; ధ్రియతేవాజనైరితి'-ప్రజలు గుర్తుంచుకొనేది; 'అభ్యుదయ నిశ్శ్రేయససిద్ధి'- ఉరోగమించి నిశ్శ్రేయసమందుకోవటం; 'చోదనాలక్షతార్థో ధర్మః'- మానవులను కార్యాచరణకు ప్రేరేపించేది. 'స్వలక్షణ ధారణాత్ ధర్మః' - ఒక స్వీయలక్షణం ధరించేది; సంక్లేశ వ్యావధానికో ధర్మః- క్లేశాలను తొలగించి విశుద్ధతనందించేది- వగయిరా కాలాంతరాలలో అర్థ, నిర్వచనాలు మారుతున్నా మౌలికార్థంలో కొనసాగుతూనేవుంది.

మతమనేపదం, నాకు తెలిసినంతలో, ప్రథమంగా హరిభద్రధమ్ సూరి (క్రీ.శ. 8వ శతాబ్ది ప్రాంతం) 'షడ్దర్శన సముచ్చయం'లో దర్శనపదానికి మతపదం సమాంతర పదంగా వినియోగించారు. బౌద్ధమతమ్, నైయాయిక మతమ్ సాంఖ్యమతమ్, జైన మతమ్, కాణాద దర్శనమ్ (వైశేషికమతం), జైమినీ మతమ్ (మీమాంసాదర్శనం), లోకాయతమతమ్‌లను సంక్షిప్తంగా వివరిస్తుంది. 'షడ్దర్శన సముచ్చయం' దీనిలో ఏడు మతాలు / దర్శనాలు కనిపిస్తాయి. అయితే నైయాకిక మతభేదంగానే వైశేషికాన్ని పరిగణించటంతో ఆరుదర్శనాలే లెక్కకొస్తాయి. ఈ మతాలన్నీ దర్శనాలుగానే ఉన్నాయంటుంది 'షడ్దర్శన సముచ్చయమ్':

*'బౌద్ధం నైయాయికం సాంఖ్యం జైనం వైశేషికం తథా*
*జైమినీయంచ నామాని దర్శనా నామమూన్యహో'*

ఆయా దర్శనాలను వివరించే సందర్భంలో దృక్పథాలను వాటి ఆచార్యుల మతాలంటుంది. ఆ విధంగా క్రీ.శ. 8వ శతాబ్ది వరకు దర్శనాలు- మతాలు సమాంతరాలుగా కొనసాగాయి తప్ప వాటిని ధర్మాలుగా సంప్రదాయం పరిగణించలేదని తేలుతుంది. అంతేకాక హరిభద్రహరి వాటిని 'లోకాయతికాలు' అనటం- అంటే విశ్వాసంతో, దైవంతో సంబంధం లేనట్లుగా వివరించటం గమనార్హం. చార్వాకం తప్ప మిగిలిన ఆరుదర్శనాలు తరువాతి కాలంలో 'ఆస్తికదర్శనాలు' గా, వైదికాలుగా, దైవికాలుగా రూపాంతరం చెందటం కాలాంతర పరిణామాలను ప్రతిబింబిస్తుంది. ఈ పరిణామాలలో వైదిక, శ్రమణ సంప్రదాయాల మధ్య ఎన్నో ఆదాన ప్రదానాలు చోటు చేసుకొన్నాయి. అయినా వైదికులు (హిందువులు) అన్నిటికీ వేదమే మూలమంటారు. జైనులు తమ మతం ప్రారంభమయి ఆచార్య పరంపరలో మహావీరునిదాకా కొనసాగిందంటారు. సమ్యక్సంబోధిలో పూర్వం వినని (అశ్రుతపూర్వమయిన) సద్ధర్మాన్ని ఆవిష్కరించుకొన్న గౌతమ బుద్ధుడు 'ఏసదమ్మోపనంతనం' అన్నాడు. 25 మంది పూర్వబుద్ధుల పరంపరలో బుద్ధుని ధర్మం కొనసాగిందనీ అది వేద పూర్వకాలంనుంచీ కొనసాగుతున్న దంటారు బౌద్ధులు. ఆ విశ్వాసాల మధ్య సహేతుకంగా ఆదాన ప్రదానాలను వివరించినా వారంగీకరించరు. ఆ విధంగా ఎవరి విశ్వాసానికి వారే కట్టుబడిపోతూ మౌలికాంశాలను విస్మరిస్తుంటారు.

సమయోచితంగానే కాక, వాటి పూర్వాపరాలను సమీక్షించుకోగలిగితే పాక్షిక అవగాహన నుంచి- విశ్వాసాలనుంచి- బయటపడే అవకాశం లభిస్తుంది కదా! ఆలోచించండి.

**రచయిత శ్రీ ఎమ్. రాజగోపాలరావు విశ్రాంత ఆచార్యులు,**
**పెక్కు బుద్ధ గ్రంథాల రచయిత, గుంటూరు.**
**ఫోను: 9866944186**

ఇందూరు కత

# కౌలువుశాల

## పూదోట శౌరీలు

సికిందరాబాదు 'రైలునిలుకు' మందితో నిండిపోయి ఉన్నది. ఆరవ అరుగు దగ్గర ముంబయికి పోయే దేవగిరి 'వడిబండి' కిటకిటగ ఉన్నది. మెల్లగా తొవ్వ చేసుకుని నేను మా ఆయనా ఇరువుల్లా కూలబడినాము. నా మనసంతా దిగులు గూడు కట్టుకుని ఉన్నది. పక్కనున్న మా వారిని చూసిన. ఆయనదీ అదే పరిస్తితి. ఎంత ఆపుకొందమన్నా నాకు కన్నీళ్ళు ఆగుతలేవు. పదిహేనేండ్లు కళ్ళలా పెట్టుకుని పెంచుకున్న కొలువుశాలలా ఇడసబెట్టి వచ్చుడే నా కన్నీళ్ళకు కారణం. అడవుల వేటలా ఎనకబడిపోతడని కాదు, నా కొడుకుని కొలువులశాలల జేర్చింది. 'నా సోపతిగాళ్ళు అందరూ అక్కడ చేరుతున్నరు. నేను గూడ అక్కడ చేరుత' అని బువ్వ తినకుండ కూచున్నడు అందుకే ఒప్పుకున్నము.

నేను నా కొడుకుకు మంచిగ బుద్ధి మాటలు చెప్పి, వాడిని విడవలేక, విడవలేక విడిచిపెట్టి వచ్చిన 'ఆంటీ జర హటో' అనే పిలుపుతో ఈ లోకంలకు అచ్చిన. ఎదురుగ నా కొడుకు ఈడుల ఉన్న పోరగాడు, ఇంకా మీసకట్టు గూడ మొలవని, పసిమి వన్నె పొల్లడు. అతని కళ్ళు చింతనిప్పులోలె ఎర్రగ మండిపోతున్నయి. గజగజ వణుకుతున్నడు. సోపతిగాడేమో, ఇంకొక పోరగాడు ఒక సందుగను ఇరువు కిందకు నెట్టి 'పయిలంగా సోయిరా' అని చెప్పి కిందకు దిగిండు. రైలు కూతబెట్టి బిరబిర పోబట్టింది.

ఆ పోరగాడిల నా కొడుకే కనవడుతున్నడు. ఏదో గాబరగాభర ఉన్నట్లున్నడు. నాకు అతన్ని చూస్తుండే ఏదో అనుమానంగ ఉన్నది. మెల్లగ మాటలు కలిపిన. 'ఏం చదువుతున్నవు తమ్మీ' అని అడిగిన 'ఇంటర్ ఆంటీ' అన్నడు బిడియంగ. 'ఇప్పుడు తాతీలు లేవుగద, ఇంటికి ఎందుకు పోతున్నవు' అని అడిగిన మల్ల. ఈ లోపట పెట్టెలా కి.రా. వచ్చుడు కనబడింది. కిల్లాకులను ఎలపటకు తీస్తున్నరు అందరూ.

నా పక్కనున్న పోరడిలా ఏదో కలవరం అటు ఇటు బిత్తరగ చూస్తూ కన్నీళ్ళు పెట్టుకుంటున్నడు. 'ఏమయింది తమ్మీ అట్లున్నవు' అడిగిన. 'నా తాన పైసల్లేవు ఆంటీ' అన్నడు చెమలు తుడుచుకొంట. 'ముందు నువ్వు పాయిఖానల దాక్కో తరవాత ఆలోచిద్దం'



అన్నడు మా ఆయన. ఈ రూటలో ఒక్క ఉరుకున లేచిపోయిండు. ఆపోరడు. ఏ తల్లి కన్న బిడ్డడో, ఏ ఇక్కట్లు వచ్చి ఇట్ల డబ్బులు గూడ లేకుండ ఇంటికి పోతున్నడో అనుకొని నా మనసు బాధగా మూలిగింది. కి.రా అందరి కిల్లాకులను చూసి ఎల్లిపోయిండు మరి కాసేపటికి ఆ పోరగాడు కళ్ళు తుడుచుకొంట తిరిగి వచ్చిండు. రైలు కామారెడ్డిని దాటింది. ఇందూరుల పదినిముషాలు ఆగుతది. తిరిగి మన్నాడులనే ఆగేది. మేము ఇందూరుల దిగేస్తము. ఈ లోపటనే ఆ పోరగాడి కతేందో తెలుసుకోవాలె అనిపించింది.

నా దగ్గరున్న ఒక సేపు (ఆపిల్) ను తీసి 'తిను తమ్మీ' అంట అతనికి ఇచ్చిన. చెయ్యి పట్టుకుని చూస్తే అతని సెయ్యంతా సలసల మరుగుతున్నది. 'ఇంత జెరంల ఎందుకు బయలెల్లినవు తమ్మీ' అని అడిగిన. కళ్ళు తుడుచుకొంట నోరు విప్పిండు.

నా పేరు కునాల్ అన్నదాతే. మాది మహరాష్ట్ర. మా వూరు జాల్నా దగ్గిర ఒక పల్లెటూరు. మా బాపుపేరు విశాల్ అన్నదాతే. ఆయన రైతు. నాకు మా ఇంటిని ఇడసబెట్టి ఇంతదూరం వచ్చి చదువుకొనుడు ఇష్టంలేదు. కానీ మా బాపు నన్ను బలిమిట్కీ ఇక్కడ చేర్చిండు. నేను పెద్ద డాక్టర్ని కావాలని ఆయన కోరిక. నాకు మా ఊర్లా ఉండి చదువుకొనుడే ఇష్టం. అక్కడున్న చెట్లు, పిట్టలు, చెరువు అన్నీ ఇష్టం. మా వూరి అందాలను బొమ్మలుగ గీసుడు అంటే ఇంకా ఇష్టం. మా బాపుకునేను బొమ్మలు గీసుడు ఇష్టం లేదు. అవేమన్న తిండిపెడతయా అంటడు. నేను మా వూరినీ, మా అమ్మనూ, ఇడిసిపెట్టి ఉండలేక ఇట్ల ఎల్లిపోతున్నా. పైసలు లేక టిక్కెట్టు తీసుకోలేదు. మొన్నటికెల్లి జెరం. అసలు చచ్చిపోవాలని అనిపించేది. ఏదయితే అదవుతుందని జైలులాంటి అక్కడి కెల్లి పారిపోయి అస్తున్న' అని చెప్పిండు.

ఇందూరు వస్తున్నది. మేము అక్కడే దిగాలె. మరి ఈ పోరగాడు ఎట్ల? కిల్లాకు లేదని కి.రా. దించేస్తాడేమో ఆ పోరడి చేతల 100 రూపాయలు పెట్టిన. ఇందూరుల రైలు ఆగినప్పుడు జెప్పనబోయి జాల్నాకు కిల్లకును తీసుకుని రమ్మని మా ఆయనకు జెప్పిన.

ఇందూరుల రైలు ఆగింది. మా ఆయన రైలు దిగి కిల్లాకు కోసం ఉరికిండు. నేనూ రైలు దిగి తలుపు దగ్గర నిలబడి ఉన్న కునాల్‌కు ధైర్యం చెబుతున్న 'మీ బాపుకు నచ్చజెప్పు. మీ ఊర్లోనే ఉండి చదువుకొంటానని జెప్పి ఒప్పించు. ఎట్లాంటి పిచ్చిపనులు చేయకు' అని చెప్పి అతని పలుకొంట్లను తీసుకొన్న కునాల్ దిగి వచ్చి 'అమ్మా మీ సాయాన్ని మరువలేను, మీరు అచ్చం మా అమ్మోరె ఉన్నరు' అని కన్నీళ్ళతో నా చేతులు పట్టుకొన్నడు.

రైలు కూతేసింది. దూరంగా మా ఆయన కిల్లాకుతోని ఉరికి వస్తున్నడు 'కునాల్ ముందు నువ్వు రైలెక్కు' అంటూ నా దగ్గరున్న చిల్లరను అతని చేతిలో పోస్తా అన్నాను. కునాల్ రైలెక్కిండు. రైలు వేగాన్ని అందుకొంది. మా ఆయన ఉరకలేకపోతుండు. అప్పుడు అక్కడున్న రైలు కైకిలివాళ్ళు ఆ కిల్లాకును అందుకుని ఉరికిన్రు. 400 మీటర్ల ఉరుకుడు పోటిలా బద్దను ఒకరి చేతికెల్లి ఒకరు మార్చుకొంటా ఉరుకుతరే, అట్ల ఆ కైకిలోళ్ళు ఉరికి కిల్లాకును కునాల్ చేతిల పెట్టిన్రు. అమ్మయ్య అనుకొని కుదుటబడిన.

ఇంటికి పోగానే కునాల్ వాళ్ళు బాపుకు పిలుపిచ్చి 'మీ పోరగాడు దేవగిరిల అస్తున్నడు. జెరంతోని బాధపడుతున్నడు. ఇంకా ఏ చెడుపు చేసుకోలేదు. సంతోషించండి. మీ కొడుకు మనసెరిగి మెసలుకోండి' అని బుద్ది చెప్పిన. మల్ల ఒక వారం అయినంక కునాల్ దగ్గరకెల్లి పిలుపు అచ్చింది. 'ఆంటీ నేను కునాల్‌ని. మంచిగున్నర ఆంటీ. మా బాపుతోని మీరేం మాట్లాడినరో దెల్వదుగానీ, ఇప్పుడు నేను మా వూరి కాలేజీలోనే చదువుతున్న. 'అంతా మీ చలవే ఆంటీ' అనిండు కునాల్. గొంతుల ఎంతో సంతోషం వినిపించింది. ఆ తరువాత ఆరు నెలలకు నా కొడుకు కూడా మా ఊరికే తిరిగివచ్చి ఇక్కడే ఇంటర్లా చేరిండు. ఆ కొలువుశాల చెరను తప్పించుకున్నందుకు వాడికే కాదు. నాకు నిమ్మళం అనిపించింది.

**రచయిత్రి ఈ కథలోవాడిన కొత్త మాటలు :**

| | | |
|---|---|---|
| నిలుకు | = | స్టేషన్ |
| అరుగు | = | ప్లాట్‌ఫాం |
| వడిబండి | = | ఎక్స్‌ప్రెస్ |
| ఇరువు | = | సీటు |
| అడకు | = | ర్యాంక్ |
| కొలువుశాల | = | కార్పొరేట్ కాలేజి |
| సందుగు | = | పెట్టె |
| కి.రా | = | (కిల్లాకు రాబట్టరి) టికెట్ కలెక్టర్ |
| పలుకొంట్లు | = | ఫోనునెంబరు |

**రచయిత్రి**
**శ్రీమతి పూదోట శౌరీలు**
**విశ్రాంత ఉపాధ్యాయిని.**
**భాషోద్యమ కార్యకర్త. బోధన్**
**(ఇందూరు జిల్లా) తెలంగాణ**
ఫోను: 9010153505



**'అమ్మనుడి'లో కథలకు ప్రముఖ కథారచయిత శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య ప్రశంసలు**

తెలుగు ప్రజలు తమ ప్రాంతాల్లో తాము మాట్లాడుకొనే మాటల్లోనే కథలను 'అమ్మనుడి'లో ప్రచురించడాన్ని తాను హృదయ పూర్వకంగా అభినందిస్తున్నట్లు ప్రఖ్యాత కథారచయిత శ్రీపెద్దిబొట్ల సుబ్బరామయ్య తెలియజేశారు. ప్రతినెలా ఒక కథనే ప్రచురిస్తున్నా – కథాంశంతోపాటు భాష తీరుతెన్నులు తనను ముగ్ధుణ్ణి చేస్తున్నాయని ఆయన చెప్పారు. ప్రతి నెలా కథా రచయితను తాను ఫోన్‌చేసి అభినందిస్తున్నట్లు తెలిపారు. విస్తారమైన నేలపై పరచుకొని వివిధ ప్రాంతాల్లో నివసిస్తున్న తెలుగువారి స్వంత మాటల్లోనే మేము ప్రచురిస్తున్న కథలు శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య గారి వంటి ప్రఖ్యాత కథకుల ఆదరణను పొందినందుకు ఎంతో సంతోషిస్తున్నాము. వారికి నా ధన్యవాదములు – సంపాదకుడు

మరచిపోతున్నాం...5

- డా॥ ఈమని శివనాగిరెడ్డి
- డా॥ మొవ్వా శ్రీనివాసరెడ్డి

## క్రీ.శ. 1523నాటి పెదజంగమరెడ్డి

# శ్రీశైలం రాగి రేకు శాసనాలు - 1

గతంలో మల్లంపల్లి సోమశేఖర శర్మ, నేలటూరు వెంకటరమణయ్య, పి.వి. పరబ్రహ్మ శాస్త్రి లాంటి శాసన పరిశోధకులకు కొత్త కొత్త రాతి శాసనాలు, రాగిరేకుల శాసనాలు అందుబాటులోకి రావటాన, 'భారతి', 'ఆంధ్రసారస్వత పరిషత్ పత్రిక'లాంటి ప్రచార మాధ్యమాల ద్వారా తెలుగు నేలపై గల చరిత్ర, సంస్కృతి, సంప్రదాయాలకు సంబంధించిన విషయాలు వెలుగు చూసిన సంగతి పాఠకులకు విదితమే. అయితే మహామహులైన అప్పటి శాసన పరిశోధకులు, అలాంటి పత్రికలు ఇప్పుడు లేకపోయినా శాసనాలు కొత్తగా వెలుగులోకి వస్తున్నాయి. ఈ కాలపు పాఠకులకోసం తెలుగుభాష, లిపి, శాస్త్రాలపై ప్రజలకు అతి చేరువగా వున్న 'అమ్మనుడి' పత్రిక ఒడిలోకి కొత్త కొత్త శాసనాలు వస్తూనే ఉన్నాయి. ఈ పరంపరలో అనంతపురం జిల్లా తనకల్లు సంస్థానంనుంచి 16వ శతాబ్దం మొదటి పాదంలో విడుదల చేసిన రాగిరేకు శాసనాలు- కొత్తగా రెండు తెలుగు శాసనాలు మా దృష్టికి వచ్చాయి. ఇంతవరకూ శ్రీశైలం దేవాలయ స్వర్ణమండపాలను, గోపురాలను, ప్రాకారాన్ని నిర్మించింది తనకల్లుకు చెందిన కొమ్మిరెడ్డి పెదజంగమరెడ్డి అనే విషయం ఈ క్రింద అందిస్తున్న శాసనాల ద్వారా వెలుగు చూసింది. మొట్టమొదటిసారిగా 'భారతి' కొత్త శాసనాలను ఎలా ప్రచురించేదో అలాగే 'అమ్మనుడి' పత్రికకూడా ఈ కొత్త శాసనాలను అక్కున చేర్చుకొని, మక్కువగల పాఠకులకోసం అందిస్తున్నది. - సంపాదకుడు

హైదరాబాద్ జూబ్లీహిల్స్‌లో ఉంటున్న సెంట్రల్ ఎక్సైజు ముఖ్య కమీషనర్‌గా పనిచేసిన ముక్తాపురం వెంకట్రామిరెడ్డిగారి సతీమణి, దేశాయి రామిరెడ్డి కుమార్తె అయిన శ్రీమతి చిన్నమరెడ్డి భద్రపరచిన రెండు రాగిరేకు శాసనాలను ఇటీవల పరిశీలించడం జరిగింది. విజయనగర కాలంలో కనకగిరి (అనంతపురం జిల్లా తనకల్లు) నుంచి పాలించిన దేశాయిరెడ్ల అనువంశీయురాలైన శ్రీమతి చిన్నమరెడ్డి వద్ద వంశపరంపరగా కాపాడుకొస్తున్న ఈ రెండు రాగిరేకు శాసనాలను క్రీ.శ. 1523వ సంవత్సరంలో అప్పటి పాలకుడు పెదజంగమరెడ్డి విడుదల చేశాడు. శ్రీ కృష్ణదేవరాయల పాలనాకాలంలో శ్రీశైలంలో విడుదల చేసిన ఈ శాసనాలు అనంతపురం జిల్లా చరిత్ర పునర్నిర్మాణానికే గాక, వెలుగు చూడని రెడ్డి ప్రభువుల ఔన్నత్యాన్ని తెలుసుకోవటానికి ఉపయోగపడతాయి.

ఈ రెండు శాసనాలు విజయనగర రాజైన శ్రీ కృష్ణదేవరాయలి ఆజ్ఞలకు లోబడి పాలిస్తున్న తనకంటిపురం దేశాయి జంగమరెడ్డి రాజ్యవివరం, ఎల్లలూ, కొన్ని వర్గాలవారికి చెల్లే మర్యాదలు, వర్తనలను వివరిస్తున్నాయి. పరిశీలించిన రెండు శాసనాలలో మొదటి శాసన వివరాలు ఆసక్తికరంగా ఉన్నాయి.

సూర్య, చంద్ర రేఖాచిత్రాలు 'శ్రీ విరూపాక్ష' అన్న మొదటి శాసనాక్షరాలతో ప్రారంభమైన ఈ శాసనాన్ని శాలివాహన శక సంవత్సరం 1445 (క్రీ.శ.1523) ప్రమాదినామ సంవత్సరం, ఆశ్వయుజ శుద్ధ దశమి గురువారమునాడు విడుదల చేశారు. మహామండలేశ్వర, కర్ణాటకాధీశ్వర, శ్రీ సహాయశూర వీర ప్రతాప, గండర గండ, గండభేరుండ బిరుదాంకితులైన విజయబుక్కరాయలు నరసరాయలు, శ్రీ కృష్ణరాయలను ప్రస్తావించటమైంది. శాసనంలో పేర్కొన్న 1523 వ సంవత్సరములో శ్రీకృష్ణదేవరాయలు విజయనగర సింహాసనంపై ఉన్నందున శాసనంలో ముందుగా పేర్కొనటమైంది.

శాసనంలోని వివరాల ప్రకారం శాసనకర్త పెద జంగమరెడ్డి, దేశాయి చక్రప్పరెడ్డికి మనుమడు. చవుటి రెడ్డికి కొడుకు. ఈ పెదజంగమరెడ్డి శ్రీశైల మల్లికార్జున, భ్రమరాంబికా కృపాకటాక్ష వీక్షణాలంకారులుగాను, శ్రీమత్ గణేశ్వర, గౌరీశ్వర పాదపద్మారాధకులు, సమస్త దేవతా ప్రతిష్ఠాపకులు, శ్రీశైలం స్వర్ణమంటపం, గోపురం, ప్రాకారం, వేదిక, సోపానములు, రత్నఖచిత కవాట ద్వారములు నిర్మించి స్థాపించినవారు, రామాయణాది గ్రంథాలను బాగా చదివిన వారు, దేవ, బ్రాహ్మణ పూజావిధేయులు. ఎల్లప్పుడూ బ్రాహ్మణుల చేత ఆశీర్వదింపబడినవారు, శ్రీమన్నారాయణ పాదాలనుంచి ఉద్భవించినవారు, శ్రీ చవుదేశ్వరిదేవి ఆరాధకులు, తనకంటి దేశాయి రెడ్లు, కరంజ గోత్రమునకు చెందినవారు.

ఇంకా శ్రీశైలం, సింహాచలం, మహానంది, యినుగొండ, ఉదయగిరి ప్రాంతాలను పాలిస్తూ, పాగొండ, మిడిగిశి, రత్నగిరి, నిడిగల్లు, మద్దగిరి మొదలగు ఐదు గిరిదుర్గాలను నిర్మించిన, గురులింగ జంగమ భక్తులు, రాయవేశ్యా భుజంగ బిరుదాంకితులు, గండపెండేరము, భూచక్రము మొదలైన అన్ని బిరుదులతోపాటు ఛత్రము, చామరము, ఆందోళిక, రథ, అశ్వము మొదలైన లాంఛనములు కలిగి కనకగిరి పట్టణమను పేరు గల్గిన తనకంటిపురము దేశాయి చక్రప్పరెడ్డి మనుమడు, చవుటిరెడ్డి కొడుకు అయిన కొమిరెడ్డి పెదజంగమరెడ్డి ఈ శాసనాన్ని రాయించాడు.

సింహాసనంపైగల నలుగురు రెడ్లు, శెట్లకు సంబంధించిన నాలుగు సింహాసనములవారు, అన్ని దేశాలకు చెందిన వ్యాపారులు, అయ్యావలి వ్యాపారసంస్థకు చెందిన పృథ్వీశెట్టి, మంత్రి రాయన భాస్కరుడు, ఇంకా సభవారు, బైరిశెట్టి మొదలైన వారి విన్నపం మేరకు పూర్వము చెల్లే మర్యాదలు. ఆచార వ్యవహారాలు, ప్రాయశ్చిత్తములు మొదలైన కార్యక్రమాలకు విచారణకర్తలుగా తనకంటి దేశాయి కొమిరెడ్డి పెద జంగమరెడ్డి వ్యవహరిస్తుండేవాడు.

ఈ తనకంటి దేశాయి రెడ్ల రాజ్య వివరాలు ఇలా ఉన్నాయి. శ్రీశైలానికి దక్షిణమునందున్న పెనుగొండ, తూర్పుదిశలోనున్న ఉదయ(భాను) గిరి, తుంమ్మలామల, పంచమలల (ఐదుకొండలు)కు తూర్పున

నృసింహభాస్కరక్షేత్రము, దక్షిణమున మల్లయగిరి, అశ్వగిరిల మధ్యనున్న కనకగిరి పట్టణానికి ప్రతినామమైన తనకంటి పురము వారి ముఖ్యపట్టణంగా చెప్పబడింది.

ఇంకా, తనకంటికి తూర్పున గల కొండలుపాలెం, సూర్య కొమ్మాళ్ళకాలువ, రాచవీడు, ప్రతాపగిరి, అశ్వగిరి, బాహు(దా)నది, పీలేరు, మర్యాదరామపురము (మదనపల్లి), దక్షిణాన రామసముద్రము, చమ్మకూరు, శతశృంగ పర్వతాలు, ఆమని కొండ, హొసకోలు (అంబోజ) రాయదుర్గము, ఏకచక్రపురము, హోసూరు, బాగులూరు, అనికల్లు, డెంకణికోట, బెంగుళూరు, పశ్చిమాన దేవళాపురము, పంచనంది, దాలినాయనిపాలెం,నగరగిరి, గుడిగొండ, ఇప్పటి కొడికొండ, లేపాక్షి, యిలెకోటదుర్గము, చిత్రావతి, గోరంట్ల, తుమ్మలారుపట్టణము, నేత్రనాశికాపురము, పార్లపల్లె, గండి, పంచలింగాల, పాలకొండ, ఉత్తరాన తిమ్మానాయనిపాలెం, హముదుర్తి కూడా చేరి ఉన్నాయి. పైన చెప్పిన నాలుగు దిక్కుల మధ్యనగల కోటలు, పట్టణాలు, పేటలు, పుణ్యక్షేత్రాలు, అగ్రహారాలు, పాలెములకు ఆనుకొని ఉన్న పల్లెలలో ఇల్లు వర్తన, పెండ్లి వర్తన, జరిమానాలు మొదలైన వాటిలో వారికి చెల్లే మర్యాదలు, ఇంకా మహాపుణ్య క్షేత్రాల్లో జరిగే నిత్యోత్సవ, మాసోత్సవ, రథోత్సవ, వసంతోత్సవముల సందర్భముగా లభించే పూలహారాలు, ప్రసాద పళ్ళెములు, అతిరసములు, మనోహరములు, శ్రీపాదరేణువు, తీర్థప్రసాదములు, తాంబూల వివరాలు కూడా పొందుపరచబడ్డాయి.

**శాసనం చివరన వరాహము, కత్తి బొమ్మలున్నాయి.**

ఈ శాసనం వల్ల కృష్ణదేవరాయలి కాలంలో సామంతులుగా దేశాయిరెడ్లుండేవారనీ, వారు అనంతపురం జిల్లా తనకల్లునుంచి పాలించారనీ, శ్రీశైలం దేవాలయ ప్రాకారం, స్వర్ణమండపం, సోపానాలు గోపురాలను నిర్మించారని తెలుస్తుంది. ఇప్పటివరకూ శ్రీశైలం ప్రాకార నిర్మాణాన్ని విజయనగర పాలకులుగానీ, కొండవీటి రెడ్డి ప్రభువులు గానీ చేపట్టి ఉంటారనే భావనను త్రోసిపుచ్చి, తనకంటి దేశాయి రెడ్లే నిర్మించారని చెప్పవీలవుతుంది. అంతేకాక వీరి భూభాగంలో బెంగుళూరు కూడ చేరి ఉండడం గమనించాల్సిన విషయం.

**మొదటిరేకు మొదటిప్రక్క శాసనపాఠం**

**శ్రీ విరూపాక్ష**

1. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు
2. 1445 అగు నేటి ప్రమాదినామ సం(వ)త్సర అశ్విజ శుద్ధ 10 నగు (రు)
3. వాసర పుణ్య దివస శుభముహూర్త మంద్దు।
4. శ్రీమన్మహామండలేశ్వర సకర్ణాటకాధిశ్వర అసహాయ శూ
5. ర వీర ప్రతాప గండ్డర గండ్డ గండ భేరుండ శ్రీమదఖండ
6. క లక్ష్మీ అయిశ్వర్య మహారాజ శ్రీ విజయ బుక్కరాయ శ్రీ నరస
7. రాయ శ్రీ కృష్ణరాయ మహాస్వామి నయ్యన వరూ
8. స్వస్తి సమస్త భువన మండల పంచాశత్కోటి భూమండల విస్తీర్ణప్రణ
9. తానెకైక భూరి గుణాలంకృత పృథ్వి త్రేతాయుగ శ్రీశైల మల్లికార్జు
10. న కృపా కటాక్ష వీక్షణాలంకారులైన స్వస్తి సమస్త నిజనామాంక్కాశ
11. శా ప్రశస్తి సహితులైన శ్రీమద్గణేశ్వర గౌరీశ్వర దేవర దివ్యశ్రీ పా
12. ద పద్మారాధకులైన అభినవ జెంబ్బూ ద్వీప దక్షిణ వారణాశి కాశిని
13. హరణ పుణ్యక్షేత్రంబునకు సమానంబైన శ్రీ గోదావరి కృష్ణాకా



14. వేరి మహా పుణ్యక్షేత్రంబ్బునకు మధ్య వవుచున్న శ్రీశైల మల్లికార్జు
15. శ్రీ భ్రమరాంబికా సమస్త దేవతాప్రతిష్ఠాపన స్వర్ణమంటప గోపు
16. రప్రాకార వేదికా స్థంభసోపాన నవరత్నఖచిత కవాట ద్వారనిర్మిత స్థా
17. పిత సత్యసంపన్నులైన శ్రీమద్రామాయణానేక శతకోటి గ్రందాం
18. కిత ప్రతిగ్రహ ప్రవీణులైన కోటిలింగ ప్రతిష్ఠాపనాచార్యులైన
19. సప్త సంతానాది షోడశ మహాప్రతిష్ఠాసనాచార్యులైన దేవ బ్రాహ్మణ
20. పూజా విధేయులైన। అనవరత భూ సురాశీర్వాద సత్య సంపన్నులైన శ్రీ
21. మన్ నారాయణ పాదారవింగ సంభవులైన। కరంజస గోత్రోద్భవులైన।
22. శ్రీ చౌవుడేశ్వరి యిష్ట దేవతా పాద ప్రసాద సంభవులైన శ్రీశైల సింహాచల
23. మహానంది యినుకొండ వుదయగిరి సమస్తరాజ్యభార దురంధరులైన పాగొ
24. ండ మిడిగిశి రత్నగిరి నిడిగల్లు మద్దగిరి పంచగిరి ప్రతిష్ఠాపన రాజ్యభార ధవు
25. రెయులైన గురులింగ్గ జంగమ పాదశేవ నిరంత్తర భక్త సంపన్నులైన రాయ
26. వేశ్యా భుజంగ్గ బిరుదాంకిత గండ పెండ్దార భూచక్రాది సమస్త ఛత్ర ఛామ
27. రాంద్దోలికా రథాశ్వాది సమస్త బిరుదాంకితులైన కనకాచల సమానదిరులైన
28. శ్రీమన్మహా భూమి ప్రభువులైన కనకగిరి పట్టణమునకు ప్రతి నామంబైన తనకంటి పురము
29. దేశాయి చక్రప్పరెడిటగారికి పౌత్రులైన చవుటిరెడ్డిగారికి పుత్రులైన కొమిరెరెడి పెదజం
30. జంగమరెడ్డి నవరిగె వ్రాయించి యిచ్చిన వర శాసనక్రమ మెట్లన్నను మీరు రెడినా
31. లుగు సింహాసనముల వారునుశెటి నాలుగు సింహ్వాసనముల వారును చా
32. లు మాల సమస్త దేశాదిశ్వలున్ను అయ్యావళ ముఖ్యులైన పృథ్విశెటి రాయన మం

33. శ్రీ భాస్కరాన్ను మొదలుగాను సభవారులున్ను బైరిశెట్టి వారురున్ను..
34. ... బహుదినముల నుంచి మనవి చేసుకొంటె... మీరు......
35. మునకు పూర్వాపూర్వముల నుంచి భాద్యులు..... మహారాజశ్రీ
36. రాయ నరసింగరాయ స్వామి నయ్య సవరిగె... రిగటి సింహాసనము వు
37. ధరించినారు గనుక మా మనవి చిత్తగించి అతనికంటి కొమిరెడ్డి పెదజంగమ
38. రెడిగారికి మహారాజ వుదయభాను చక్రవర్తు లాదిగాను పూర్వాపూర్వము
39. నుంచి వస్తున్న రెడ్డి రాజ్యమునకు ఆచార వ్యవహార ప్రాయశ్చిత్తము వి

**మొదటి రేకు రెండవప్రక్క శాసనపాఠం**

40. చారణ కర్తలుగను కను వీరికి చెల్లెటి రాజ్య
41. వివరము శ్రీశైలానకు దక్షిణ దిగ్భాగమందు వు
42. పు చుంన ఘ వంర్ధ పినాకిని ఘనగిరి ప్రతినామం బైన పె
43. నుగొండ పురంబునకు పూర్వదిశ యంద్దు వొపుచుంన్న చి
44. త్రావతి భూరకాపురి వుదయ భానుగిరి తుంమల తుంమ్మలా
45. పుల పంచ్యమలలకు ప్రాగ్భగంబున ధర్మార్థ కామ మోక్ష స
46. ంప్రదాయకంబైన శ్రీ అర్జున నది శ్రీనృసుంహ్వ భాస్కర
47. క్షేత్రంబున దక్షిణ దిగ్భాగంబ్బున వొపుచుంన్న మల్లయగిరి
48. అశ్వగిరి... సభోతిరవాన అర్జున దీ వుభయ పుణ్యక్షేత్రంబ్బు
49. నకు మధ్యె వొపుచున్న కనకగిరి పట్టణంబునకు ప్రతినామంబైన
50. తనకంటిపురము యేలేటి దేశాయి రెడ్ల వారికి చెల్లెటి రాజ్య
51. వరము యీ కనకగిరి పట్టణమునకు తూర్పున కొండెలు పాళ్య
52. ము సూర్య కొమాళకాలువ ఘండి విరచిత శ్రీ రాచవీడు
53. ప్రతాపగిరి అశ్వగిరి కలుఘటి బాహునది పీలేరు మర్యాద
54. రామపురముగాను యీ దక్షిణము రామసముద్రము చంమ్మ
55. కూరు శతశృంగ పర్వతములు కొళాల ఆమనికొండ హొసకో
56. టి అంభోజ రాయదుర్గము యేకచక్రపురము హోసూరు బాగు
57. ఊరు అనికల్లు ధెంకిణికోట బెంగ్గళూరు దక్షిణ పినాకిని మె
58. రనుగా పశ్చిమము దెవలాపురముపంచ్చనంది పశ్చిమ పినాకి.
59. ని నానుగొండు దాలినాయణపాళ్యము నగరగిరి గుడిగొండ లేపాక్షి..
60. ...నాయకుని పాళ్యము యిలెకోటి దుర్గము చిత్రావతి గోరంట్ల వానవో
61. తరంగసళము తుమ్మలామ పట్టణము నేత్ర నాశికాపురము.
62. ...పార్లపల్లె గండి పంచలింగాల పాలకొండమలో వుత్తర తింమానాయ
63. ని పాళ్యము 'హముదుర్తి పాలెనవుల కమల (అకోటి గోళ తలుపులము.
64. పాలనురుచు మెరగాను యీ చతుర్తిక్కుల రాజ్యములో గాను మధ్య వుండే దుర్గము.
65. లు పట్టణములు పేటలు పుంణ్యక్షేత్రములు అగ్రహారములు పాళ్యనట్లు గ్రామం.
66. తములు పల్లెలు మెరగామీకు లా చారమునకు మీకు చెల్లెటి యిలువర్తన పెండ్లి వ
67. ర్తనలు... వర్తన తప్పువొప్పులు, పుణ్యక్షేత్రములు... శ్రీ యీ దివ్య మహాక్షే.
68. త్ర మందు నిత్యోత్సవ, మాసోత్సవ రథోత్సవ వసంతోత్సముల యెందు మీ
69. కు... వర్తనపూలహారము తళికా ప్రసాదము అతిరసములు-2 మనోహర
70. ములు 2 శ్రీపాదరేణువు సంన్నిధి తీర్థ ప్రసాదము పంణ్యారము గిన్నెలు 2 తాంబూలా
71. లు ద్విగుణములు... మెరగాను నెమకము కాపులు యిచ్చెడి సంవత్సరమము 1 కి...



72. స... సంవత్సరము 1 కి ధాన్యము యిర.... పెండ్లిండ్లకు వర్తన నాణ్య ... సింహా
73. సనమునకు నాలుగు... ఆకులు కట్టెలు...
74. నెయి శె... పండుగ వర్తనలు టెంకాయలు 2 ... గాలమునకు...
75. చెల్లెటి యీ మర్యాదను మీకు పూర్వాపూర్వములనుంచి నడుస్తు వుండగను
76. ... అదెమెర గాను ధర్మశాసనం వ్రాయించి యిచ్చినాము
77. వంశపుత్ర పారంపర్యము ఆచంద్రార్క స్థాయిగాను అనుభవించ్చు కొని సు
78. ఖాన వుండమని వ్రాయించి యిచ్చిన ధర్మశాసన మీ శ్రీరామ వాక్యము । మ
79. ద్వంశ... పర మహిపతి వంశజాతాః యె భూమి పాన్సతతము జ్వల ధర్మం
80. లో౹ మద్ధర్మమెవ సతతం పరిపాలయంత్త । తత్పాద పద్మ యుగళం సిరసా విధ
81. ... శ్రీ విరూపాక్షా. (వరాహము, కత్తి లాంఛనముల చిత్రములు)

---

**రచయితలు**

**డా౹౹ ఈమని శివనాగిరెడ్డి,** ఫోను: 9848598446
ప్రముఖ వాస్తు శిల్పి, పరిశోధకులు, విజయవాడ కల్చరల్‌సెంటర్ సంచాలకులు.
**డా౹౹ మొవ్వా శ్రీనివాసరెడ్డి,** ఫోను: 9490333488
ఆంధ్ర లయోలా కళాశాలనందు చరిత్ర అధ్యాపకులు.

– డి.పి. అనూరాధ

# తొలినాళ్లలో నౌకా వాణిజ్యం

హైదరాబాద్... రోమ్ ఈ రెండు నగరాలకు మధ్య దూరం 9వేల కి.మీ. పైనే ఉంది. కానీ 2000 ఏళ్ల కిందట... ఆనాటి రోమన్ చక్రవర్తి టైబీరియస్, రోమ్ పార్లమెంట్లో – ఉల్లిపొరలా సన్నగా ఉన్న మన నూలు బట్టలవాడకాన్ని నిషేధించాడట... ఆనాడు మన నేతగాళ్ల నూలు... పట్టుబట్టలకు రోమన్ శ్రీమంతుల్లో చాలా మోజు ఉండేదట... వాటిని ధరించడం వల్ల శరీరమంతా కన్పిస్తోందని ఇది స్త్రీ పురుషులకు తగినది కాదని టైబీరియస్ ఆదేశం... ఇంతకీ మన నూలు వస్త్రాలు రోమ్‌కు ఎలా వెళ్లాయి?

ఇండియాకు సముద్ర మార్గాన్ని కనుగొనడానికి బయల్దేరిన కొలంబస్ అమెరికాకు వెళ్లాడు.. వాస్కోడగామా 15వ శతాబ్దిలోగానీ భరతఖండానికి రాలేదు.. మరి రెండు వేల ఏళ్ల కిందట మనం రోమ్‌తో వ్యాపారం చేశామా? అదెలా సాధ్యం? నమ్మశక్యంగా లేకపోయినా ఇది నిజం!

చాలా ఆలస్యంగా వెలుగుచూసినా వాస్తవం వాస్తవమే... ఆనాటి రోమన్ సామ్రాజ్య నాణేలు దక్షిణ భారతదేశంలో ఎన్నో లభ్యమయ్యాయి. కానీ బంగారు, వెండి నాణేలు ఎక్కువగా మన తెలుగు నేల మీదే దొరికాయి. కోటిలింగాల, ధరణికోట, కొండాపూర్ (మెదక్), పెనుగంచిప్రోలు (కృష్ణాజిల్లా), పెదబంకూర్ (కరీంనగర్), అక్కెనపల్లి (నల్గొండ), నాగార్జునకొండ, సుస్తుల్లాపూర్ (కరీంనగర్), నెల్లూరు, ఒంగోలు, పిఠాపురం, బావికొండ ఇలా ఎన్నో ప్రదేశాలలో రోమన్ నాణేలు బయటపడ్డాయి. ఈ నాణేలను బట్టి ఓ అంచనాకు రావచ్చు. క్రీస్తు పూర్వం 27వ సంవత్సరం నుంచి మొదలై క్రీస్తు శకం 2వ శతాబ్దికి రోమ్‌తో నౌకావాణిజ్యం ఉన్నత దశకు చేరింది. మూడో శతాబ్దికి తగ్గుముఖం పట్టింది కానీ, క్రీస్తు శకం 5వ శతాబ్ది వరకూ కొనసాగింది. మన తెలుగునేలపై దొరికిన మొదటి రోమన్ నాణెం అగస్తస్‌ది. అంటే క్రీస్తు పూర్వం 27వ సంవత్సరానిది. చిట్టచివరి రోమన్ నాణెం క్రీస్తు శకం 491 నుంచి 518 వరకూ రోమన్‌ను పరిపాలించిన అనస్టేషియస్ చక్రవర్తిది... ఈ ఇద్దరు పాలకుల మధ్యలో21 మంది రోమన్ చక్రవర్తులు పరిపాలించారు. వీరి నాణేలు కూడా మన నేలమీద దొరికాయని ప్రముఖ నాణేల పరిశోధకులు డాక్టర్ దామె రాజిరెడ్డి గారు తేల్చిచెప్పారు.



నానేఘాట్ వద్ద రచయిత్రి

నాగార్జున కొండ శిల్పంలో రోమన్, సిథియన్ సైనికుల శిల్పాలు కూడా బయటపడ్డాయి. అంటే మనకు ఆనాడు యూరపుతో గట్టి అనుబంధమే ఉండేది. అసలు మనవాళ్లు అక్కడికి ఎలా వెళ్లేవారు? రోమన్లు ఇక్కడికి ఎలా వచ్చేవారు? సముద్ర దారులు ఏవి?

సింధునాగరికత సమయంలో సుమేరియన్ల రాజధాని ఉర్‌కు ఓ సముద్రమార్గం, ఆఫ్రికాకు మరో సముద్రమార్గం ఉండేవని చరిత్రకారులు కనుగొన్నారు. కాలగమనంలో ఈ దారులు మూతపడ్డాయి. సింధునాగరికతకు సుమారు రెండు వేల ఏళ్ల తరువాత వచ్చిన మౌర్యులు సముద్ర వ్యాపారంపై అంతగా దృష్టిపెట్టలేదు. గ్రీకు చక్రవర్తి అలగ్జాండర్ కూడా నేల దారిలో భారతదేశం వచ్చాడు. **భారతదేశంలోనే మొట్టమొదటిసారిగా నౌకావాణిజ్యానికి దారులు వేసింది శాతవాహనులు.** అరేబియా సముద్ర తీరంలోని కళ్యాణ్, సూరత్, బ్రోచ్ నౌకా కేంద్రాలను నిర్మించి అభివృద్ధి చేసింది శాతవాహనులే. మహారాష్ట్ర, గుజరాత్‌లలో ఉన్న ఈ నౌకా కేంద్రాలు నేటికీ కూడా ప్రముఖమైనవిగా ఉండడం విశేషం. ఆనాడు వర్తకులకు వసతి గృహాలుగా కొండలలోని రాతి గుహలు ఉపయోగపడేవి. అందుకే మునుపెన్నడూ లేనివిధంగా రాక్ కట్ ఆర్కిటెక్చర్ శాతవాహనుల కాలంలో ఊపందుకుంది. కల్యాణ్‌కు 150 కిలోమీటర్ల దూరంలో ఉన్నటువంటి **నానేఘాట్ కనుమను** ఆనాడు టోల్‌గేట్లా ఉపయోగించేవారట శాతవాహన రాజులు. అటు రోమ్ నుంచి వచ్చే వర్తకులు, ఇటు మగధ నుంచి వచ్చే వర్తకులు ఇక్కడ పన్నును చెల్లించి ముందుకు సాగాలనే నియమం ఉండేదట. ఈ విషయాన్ని రుజువు చేయడానికి ఈనాటికీ ఇక్కడ ఒక పెద్ద రాతి పాత్ర సాక్షిగా కనిపిస్తుంది. వర్తక వాణిజ్యం బాగా ఉన్నతస్థానంలో ఉన్నప్పుడు బంగారు వెండి నాణేలతో ఈ పాత్ర రోజుకు అయిదు సార్లు నిండేదట.

**నౌకా చిత్రాలు:**

శాతవాహన రాజులు ఓ అంశంలో అందరి చక్రవర్తులకంటే ముందున్నారు. నాణేలమీద తమ నౌకల చిత్రాలను ముద్రించారు. నాణేల మీద నౌకా చిత్రాలను ముద్రించిన మొట్టమొదటి శాతవాహన చక్రవర్తి యజ్ఞశ్రీ శాతకర్ణి. దీన్ని అర్థం చేసుకోవచ్చు. యజ్ఞశ్రీశాతకర్ణి కాలంలో నౌకావ్యాపారాలు ఎంత జోరుగా ఉన్నాయో! నాణేల మీద నౌకల చిత్రాలను ముద్రించే పద్ధతి రోమన్లకు కూడా ఉంది. క్రీ.శ.117 నుంచి

శ్రీనాథుడి హరవిలాసంలో తెలుగు వర్తకులు - వారి సాహసాలు సుదీర్ఘమైన సముద్రతీరం, కృష్ణా, గోదావరి వంటి పెద్ద పెద్ద నదుల వల్ల తెలుగువారు నౌకావాణిజ్యంలో గొప్ప సాహసికులుగా పేరు తెచ్చుకున్నారు. మచిలీపట్నం, కోరంగి, కోటిపల్లి, కళింగపట్నం వంటి ఓడరేవులు ద్వారా 200 అడుగుల పొడవు, 100 అడుగుల వెడల్పుగల పెద్ద పెద్ద ఓడలలో 3, 4 చిన్న చిన్న పడవలను, వందలాది నౌకర్లను ఎక్కించుకుని 20 నుంచి 200 ఓడలు గల గుంపుతో విదేశీ వర్తకానికి వెళ్లేవారట. ఇక్కడి వజ్రాలను, నూలు బట్టలను విదేశాలలో అమ్మి, అక్కడ దొరికే వస్తువులను ఇక్కడికి తీసుకువచ్చేవారట. శ్రీనాథుడి హరవిలాసంలో వీటన్నిటి గురించి ప్రస్తావన ఉంది.

పంజార కర్పూర పాదపంబులు దెచ్చె
జలనొంగి బంగారు మొలక దెచ్చె
సింహళంబున గంధ సింధురంబుల దెచ్చె
హరుముంజి బలుతేజి హరులు దెచ్చె
గోవ సంశుద్ధ సంకుమద ద్రవ్యము దెచ్చె
భోట గస్తూరికా పుటకోశములు దెచ్చె
చీని చీనాంబర శ్రేణి దెచ్చె
జగద గోపాలరాయ వేశ్యాభుజంగ
పల్లవాదిత్య భూదాన పరశురామ
కొమరగిరి రాజదేవేంద్రు కూర్మిహితుడు
జాణ జగజెట్టి దేవయ చామశెట్టి...

ఈ పద్యంలో ఆయా దేశాలు, వస్తువులతో పాటు వర్తకుడి పేరు దేవయ చామశెట్టి అని కూడా ఉండడం విశేషం. ఇలా వివిధ దేశాలకు వలస వెళ్లిన కొందరు వర్తకులు విదేశీ గడ్డలపై అన్నీ అనుకూలించిన వేళ వలస రాజ్యాలను స్థాపించారు. ఆయా కోట కొమ్మలపై తెలుగు జెండాలను ఎగరవేసి తెలుగుజాతికే కీర్తిని తీసుకు వచ్చారు.

138 మధ్యప్రాంతంలో రోమ్‌ను పాలించిన హాడ్రియన్ మొట్టమొదటిసారిగా నాణేలపై నౌకల చిత్రాలను ముద్రించారు. హాడ్రియన్ కంటే 80 ఏళ్ల ముందే యజ్ఞశ్రీ శాతకర్ణి నౌకాముద్రలున్న నాణేలను వేయించాడు. మరో ఇద్దరు శాతవాహన రాజులు వాశిష్టిపుత్ర పులుమావి, వాశిష్టిపుత్ర శాతకర్ణి కూడా నౌకాముద్రలున్న నాణేలను ముద్రించారు. అంటే ఇది రోమన్లను చూసి కాపీకొట్టడం కాదు మన వాళ్ల ఒరిజినల్ ఐడియా అని ఖచ్చితంగా చెప్పవచ్చు.

నాణేలకు సంబంధించి శాతవాహన రాజులు అశోకుడు.. చంద్రగుప్తుడి కంటే గ్రేట్... నాణేలపైన తమ చిత్రాలను వేసుకున్న తొలి భారతీయ చక్రవర్తులుగా కూడా వీరు పేరు తెచ్చుకున్నారు. వాశిష్టిపుత్ర పులుమావి, వాశిష్టిపుత్ర స్కందశాతకర్ణి వెండి నాణేలపై తమ ముఖచిత్రాలను, పేర్లను ముద్రించారు. ఈ నాణేలపై భాష ప్రాకృతం, ప్రాచీన తెలుగులో ఉండే లిపి బ్రాహ్మీలో ఉండడం విశేషం.

శాతవాహన కాలంనాటి నాణేలమీద ఉన్న అక్షరాలవల్లే హిబ్రూ భాషలో ద్రావిడ భాషలకు సంబంధించిన పదాలు వాడుకలోకి వచ్చి ఉండవచ్చని చరిత్రకారుల అభిప్రాయం. హిబ్రూ భాషలోకి మన పదాలు చేరడానికి మరో కారణమూ ఉంది. మన నెమళ్లని ఈజిప్టుకు తీసుకుపోయేవారు. ఆనాడు వారికి అవి కొత్త పక్షులు. వారి భాషలో వాటికి పేరులేదు. అందమైన పొడవైన తోక ఉన్న పక్షి కాబట్టి దానికి తూకి అని పేరు పెట్టుకున్నారు. తోక... తూకి అయిందన్నమాట. హిబ్రూ భాషలో తూకి అంటే నెమలి అనే అర్థం నేటికీ ఉంది.

మన ప్రాచీన నౌకావాణిజ్యం గురించి నాణేలే కాదు, శిల్పాలు కూడా తెలియజేస్తున్నాయి. మధ్యప్రదేశ్‌లోని సాంచి స్థూపానికి నాలుగు వైపులా ఉన్న ద్వార తోరణాలు శాతవాహన కాలంలోనే నిర్మించారు. అపురూపమైన శిల్ప సంపదగా ఈ ద్వారతోరణాల్లోని శిల్పాలు పేరు తెచ్చుకున్నాయి. ఇక్కడి తూర్పు ద్వారంలో ఓ నౌకా శిల్పం ఉంది. ఈ నౌక మధ్యలో ఓ బౌద్ధగురువు కూర్చున్నాడు. ఇటూ అటూ ఇద్దరు మనుషులు తెడ్లను వేసి పడవను నడుపుతున్నారు. ఒడ్డును నిలుచున్న నలుగురు మనుషులు అతడికి నమస్కరిస్తూ అటువైపు తిరిగి నిలుచున్నారు. ఈ శిల్పంలో పడవ ఎంతో స్పష్టంగా కన్పిస్తుంది. ముంబాయిలోని కన్హేరి గుహాలయాల్లో కూడా నౌకా శిల్పాలు లేకపోలేదు.

ఇవన్నీ చిన్న ఓడలు కానీ పెద్ద ఓడల శిల్పాలు మాత్రం బొరబొదూర్లోని స్థూపంలో బయటపడింది. ఇండోనేషియాలోని బొరబొదూర్ ప్రపంచంలోనే అతి పెద్ద రాతి బౌద్ధ స్థూపం.

**ఆనాటి నౌకాదారులు ఏవి?**

ఆనాటి నౌకాదారులు ఏవి? ఎలా వర్తకం జరిగేది? క్రీ.శ. ఒకటో శతాబ్దంలో తెలుగు ప్రాంతంలోని ముఖ్య వ్యాపార కేంద్రాల పేర్లు రెండు గ్రంథాలవల్ల తెలుస్తున్నాయి.

ఒకటి పెరిప్లస్ ఆఫ్ ఎరిత్రియన్ సీ... దీనిని హిప్పాలస్ అనే నావికుడు క్రీ.శ. 1 వ శతాబ్దిలో రాశాడు. రెండోది ఈజిప్టుకు చెందిన టోలమీ రాసిన ఏన్షియంట్ జాగ్రఫీ... దీనిని క్రీ.శ.2వ శతాబ్దిలో రాసినట్లుగా ధ్రువీకరించారు. ఈ గ్రంథాలు మన వర్తక వ్యాపారాల గురించేకాదు, ఓడరేవుల గురించి ఎన్నో విషయాలు తెలియజేస్తున్నాయి.

పెరిప్లస్ గ్రంథం పరాలియా అంటే నేటి నెల్లూరులోని కమర, పొదుక, సపోటమ ముఖ్యవ్యాపార కేంద్రాలని రాసింది. పొదుక అంటే నేటి పూదూరు, అలాగే సపోటమును నేటి కొత్తపట్నంగా గుర్తించారు. పరాలియాలకు ఉత్తరాన మసాలియా విస్తరించిందని ఇక్కడ అతి సున్నితమైన మస్లిన్లు లభిస్తాయని, దీనికి ఉత్తరాన ఉన్న దొసరిన్ ప్రాంతం ఏనుగు దంతాలకు ప్రసిద్ధిచెందిందని హిప్పాలస్ రాశాడు. మసాలియా అంటే నేటి గుంటూరు, కృష్ణా, పశ్చిమ గోదావరి ప్రాంతాలు. దొసరిన్ నేటి కళింగ ప్రాంతం. టోలమీ వ్రాసిన ఏన్షియంట్ జాగ్రఫీలో వీటితో పాటు కరుగ నేటి కడప, పొలూర నేటి పాలూరు, పికెండక నేటి పెనుకొండ పేర్లు కూడా ఉన్నాయి.

మైసోలస్ నేటి కృష్ణానది ముఖద్వారం హంసలదీవి సమీపంలో కంటకశిల... నేటి ఘంటశాల. కొడ్డూరు నేటి కోదూరు... అలోసైని అంటే నేటి అవనిగడ్డ తదితర ముఖ్య నగరాలు ఉన్నాయని రాశాడు.

అలోసైని ఓ వ్యాపారకేంద్రమని ఇక్కడి నుండి ఓడలు జావా, మలయా ద్వీపాలకు బయల్దేరుతాయని రాశాడు.

శాతవాహనుల కాలంలో అన్ని రకాలుగా అభివృద్ధి కన్పిస్తుంది. దీనికి కారణం లేకపోలేదు. భూగోళ శాస్త్ర దృష్ట్యా తెలుగు ప్రాంతం ఉత్తర దక్షిణాల మధ్య వారధిలా ఉంది. దేశంలోని ప్రముఖ వర్తకదారులన్నీ మన నేల మీదుగానే ఏర్పడ్డాయి. పొడవైన తీరరేఖ... కృష్ణా గోదావరి నదులు ప్రవహిస్తూ మన నేలను సస్యశ్యామలం చేయడమే కాదు అన్ని రకాల పంటలను పండించి వాణిజ్యపరంగా ముందుండేలా చేశాయి. మన నేత కళాకారుల నైపుణ్యం అమోఘం.. తూర్పున చైనా నుంచి ముడి పట్టును... ఇండోనేషియా... జావా నుంచి సుగంధ ద్రవ్యాలు దిగుమతి చేసుకొనేవాళ్లం. ప్రాచీన కాలంలో పట్టుబట్టలకు చీనాంబరాలనే పేరు ఎలా వచ్చిందో దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు.

నూలు వస్త్రాలు నేయడంలో మనకు పెట్టింది పేరు. ఉప్పాడ, ధర్మవరం, చీరాల, మంగళగిరి ఎంతో ప్రముఖమైనవి. చైనా పట్టుతో దుస్తులను తయారుచేసి రోమ్‌కు ఎగుమతి చేసేవాళ్లం. మనదేశం నుంచి వీటితోపాటు సుగంధ ద్రవ్యాలు, ఉల్లిపాయలు, చింతపండు, ఉసిరికాయలు, పండ్లు, బెల్లం, నెయ్యి, నువ్వులనూనె, నెమళ్ళు, ఖడ్గమృగాలు, సింహాలు, ఏనుగులు, వేటకుక్కలను, ఎద్దులను పర్షియా, సిరియా, ఆఫ్రికా దేశాలకు ఎగుమతి చేసేవారట. దట్టమైన అడవులు, అంతగాలేని రహదారుల వల్ల నౌకాయానమే ఆకాలంలో ముఖ్య రవాణా మార్గం... విదేశాలకు ఎగుమతి కావలసిన సరుకులను చిన్న చిన్న పడవల మీద నదీ మార్గాల ద్వారా, బండ్లమీద భూమార్గాల ద్వారా సముద్ర తీర రేవులకు చేర్చేవారు. నది సముద్రంలో కలిసే చోటా చిన్నా పెద్దా ఏదో ఒక రేవు ఉండేది.

తూర్పు తీరాన ఉన్న మోటుపల్లి, ఘంటశాల తదితర నౌకాశ్రయాల నుంచి సరుకుల ఓడలు కన్యాకుమారి మీదుగా కల్యాణ్, సూరపుర్క... నేటి సూరత్, బ్రూచ్లకు చేరేవి. ఇక్కడినుంచి వేరే ఓడల్లో ఈజిప్టు, నైరోబీ, కెన్యా, సూడాన్, జాంజిబార్ ప్రాంతాలకు వెళ్లేవి. సరుకులను నౌకలనుండి దించేవారు. భూదారుల్లో అలెగ్జాండ్రియా చేరేవి. అక్కడి నుంచి మధ్యధరాసముద్రంలో నౌకలపై రోమ్, గ్రీస్, యూరప్ అంతా చేరేవి.



హిప్పోలస్‌వల్లే ఓ అద్భుత విషయం ప్రపంచానికి తెలిసింది. దక్షిణ ఆసియా ప్రాంతంలో వర్షరుతువు ఉంటుందని, ఈ రుతువులో నైరుతి రుతుపవనాల ప్రభావం వల్ల ఎర్రసముద్ర ప్రాంతం నుంచి ఇండియాకు సులభంగా చేరుకోవచ్చని రాశాడు. ఈ రుతువులో సముద్రతీరం వెంట కాకుండా నేరుగా సముద్రంలో భారతదేశానికి వెళ్లవచ్చని రాశాడు. ఈనాడు లాగానే అప్పట్లో కూడా సముద్ర దొంగల బెడద ఎక్కువగా ఉండేదట. తీరం వెంట వెళ్లే ప్రతి ఓడను వాళ్లు దోచుకునేవారట. సముద్రం మధ్యలోంచి రుతుపవనాల సమయంలో వెళితే తొందరగానే కాకుండా దొంగలనూ తప్పించుకోవచ్చని వర్తకులకు బాగా తెలిసిపోయింది. దీంతో నౌకా వాణిజ్యం బాగా ఊపందుకుంది. శాతవాహనులు రోమన్ నాణేలు మన దేశంలో కూడా చెల్లుబాటు అయ్యేలా చేశారు. శాతవాహనులు ఎక్కువగా సత్తు నాణేలనే ముద్రించారు. రోమన్లు ఇక్కడి వస్తువులను బంగారు నాణేలు ఇచ్చి తమ వస్తువులకు సత్తు నాణేలను తీసుకొని పోయేవారు.

రోమ్ నగరం తగలబడుతున్నా ఫిడేలు వాయిస్తూ కూర్చున్న నీరో భారతదేశానికి బంగారం తరలిపోతోందని వాపోయాడట. రోమన్ దేశస్తుడు ప్లీనీ రాతలను బట్టి ప్రతి సంవత్సరం భారతదేశానికి 5 కోట్ల సెస్టర్సెస్లు అంటే 1 కోటి 25 లక్షల దీనారాలు రోమన్ సామ్రాజ్యం నుంచి వచ్చేవి. ఆనాడు రోమన్ సామ్రాజ్యం పది వంతులు ఇండియాతో ఒక వంతు పార్థియాతో వ్యాపారం చేసేదని ఓ చైనా యాత్రికుడు రాశాడు. రోమ్‌తో ఇంతలా ఉన్న వ్యాపారం క్రీ.వ. 5వ శతాబ్దిలో క్షీణించడానికి కారణం సిల్క్ రూట్ ఏర్పడడం. ఆ తరువాత రోమన్ సామ్రాజ్యం పతనమవడంతో మన నౌకా వాణిజ్యం బాగా పడిపోయింది. ఇలా క్రీ.శ. శకం తొలినాళ్లలోనే ప్రపంచాన్ని చుట్టిన వీరులు మన పూర్వీకులు.

**రచయిత్రి శ్రీమతి డి.పి. అనూరాధ**
**చరిత్ర పరిశోధకురాలు, టి.వి. కార్యక్రమాల వ్యాఖ్యాత**
**హైదరాబాదు. ఫోన్: 9010016555**

జనవాణి

# అమరావతి... అమరావతి...

**మ**నసులో మాటగా డా॥ వావిలాల సుబ్బారావుగారు వ్రాసిన 'అమరావతి... అమరావతి... అమరావతి..." వ్యాసం చదివాను. అందులో డా॥ సుబ్బారావుగారు చేసిన సూచనలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పరిశీలించవలసిన అవసరం ఎంతేని వున్నది. లేకుంటే కొత్త అమరావతిలో కలిసిపోతున్న పాత గ్రామాలు తమ ఉనికిని ప్రాశస్త్యాన్ని కోల్పోయే ప్రమాదం కలదు. సింగపూర్ సంస్కృతినికాక, మన సంస్కృతిని ప్రతిబింబించేవిధంగా నూతన రాజధానిలో భవన నిర్మాణాలు జరగాలి.

'మరపురాని లవణం' వ్యాసాన్ని చదివిన తరువాత 1975–77లో నిజామాబాద్ జిల్లా సహకార అధికారిగా నేను పనిచేసినప్పుడు 'చెల్లినిలయం'లో శ్రీమతి హేమలత లవణంగారిని కలిసి, జోగిని వ్యవస్థ గురించి చర్చించుకున్న విషయాలు, పరిష్కారాలు గుర్తుకు వచ్చినవి.

ఆలోచనాత్మక వ్యాసాలు, రచనలు, కవితలు అందిస్తున్న 'అమ్మనుడి' సంపాదకులకు అభినందనలు.

**– పరుచూరి శ్రీనివాసరావు,** కోలవెన్ను, 9963218700.

## సెప్టెంబర్ 19 తాపీధర్మారావు జయంతి – తెలుగు జనమాధ్యమాల దినోత్సవం సందర్భంగా

# అప్పరుసు కృష్ణారావుకు తాపీ ధర్మారావు పురస్కారం

**తా**పీ ధర్మారావు వేదిక –పాత్రికేయులకు ఇస్తున్న 'తాపీ ధర్మారావు పురస్కారాన్ని' ప్రముఖ పాత్రికేయుడు అప్పరుసు కృష్ణారావు ఈ సారి అందుకొన్నారు. ఇంతకుముందు నాగసూరి వేణుగోపాల్, కె. శ్రీనివాస్, టంకశాల అశోక్, జి. శ్రీరామమూర్తి గార్లు ఈ మన్ననను అందుకొన్న సంగతి తెలిసిందే. ఈ సందర్భంగా ఆయన 'మీడియాలో–విస్మృత వర్గాలు' అనే అంశంపై 'తాపీ ధర్మారావు స్మారక' ఉపన్యాసం చేశారు. *(ప్రసంగం పూర్తిపాఠాన్ని 35 నుండి 39 పుటలలో చదవండి.)*

కార్యక్రమంలో ముఖ్య అతిథిగా పాల్గొన్న యూపీఎస్సీ పూర్వ సభ్యుడు, ద్రవిడ విశ్వవిద్యాలయం పూర్వ ఉపకులపతి ఆచార్య కె.ఎస్.చలం మాట్లాడుతూ, ఉత్తరాంధ్రకు చెందిన తాపీ ధర్మారావే లేకపోతే పత్రికల్లో ప్రజల భాష ఉండేది కాదని అన్నారు. వ్యవహారిక భాషా పితామహుడు గిడుగు రామ్మూర్తి వారసుడిగా తాపీ ధర్మారావు భాషలో నూతన శకాన్ని తీసుకువచ్చారని ఆయన పేర్కొన్నారు. విస్మృత వర్గాల గురించి ఆనాడే తాపీ వారు ప్రస్తావించారని ఆయన గుర్తు చేశారు. తాపీ ధర్మారావును ప్రస్తావించకుండా తెలుగు వ్యవహారిక భాష గురించి మాట్లాడలేమని చలం స్పష్టం చేశారు. ఎంతో మంది మహనీయులను అందించిన ఉత్తరాంధ్ర మరెన్నో సంస్కరణలకు వేదిక అయ్యిందని ఆయన అన్నారు. విస్మృత వర్గాలను విస్మరించే ఏ రాజ్యం మనుగడ సాగించలేదని, అలాంటి ప్రయత్నాలను తాపీ ధర్మారావు సమర్థవంతంగా ఎదుర్కొన్నారని చెప్పారు.

ప్రత్యేక వక్తగా పాల్గొన్న రచయిత, పరిశోధకుడు, చెన్నై ఆకాశవాణి కేంద్రం సీనియర్ కార్యనిర్వహణాధికారి నాగసూరి వేణుగోపాల్ మాట్లాడుతూ, తాపీ ధర్మారావు చేసిన సాహిత్య సేవ నేటి తరానికి ఆశించిన స్థాయిలో తెలియడం లేదని ఆవేదన వ్యక్తం చేశారు. వ్యవహారిక భాషతోపాటు సమాజాన్ని పట్టిపీడిస్తున్న ఎన్నో సామాజిక అంశాలపై తాపీ వారు స్పందించిన తీరు అమోఘమని కొనియాడారు. తాపీ ధర్మారావు వేదిక, యూజేఎఫ్ కలిసి నిర్వహించిన ఈ కార్యక్రమం భావి తరాలకు మార్గదర్శకం కాగలదని ఆశాభావం వ్యక్తం చేశారు.

రచయిత, విమర్శకులు ఆచార్య చందు సుబ్బారావు మాట్లాడుతూ, ఎక్కడయితే విప్లవం ఉంటుందో అక్కడ రాచరిక వ్యవస్థ తమ పీఠం కాపాడుకునేందుకు ప్రజలను కళా రంగం వైపు మరలిస్తారని అన్నారు. అలాంటి కుట్రే ఉత్తరాంధ్రలో జరిగిందని ఆయన గుర్తు చేశారు. ఉత్తరాంధ్రలో ఉదయించిన ఎందరో సాహిత్య, సంగీత కళాకారులు జగత్తును ఏలారని పేర్కొన్నారు. ఆలాంటి వ్యవస్థలో భాగం కాకుండా తాపీ ధర్మారావు చాలా జాగ్రత్తగా సామాజిక అంశాలను పుణికి పుచ్చుకుని సాహితీ సేవ చేశారని తెలిపారు. దేవాలయాలపై బూతుబొమ్మలెందుకు?, పెళ్లి పుట్టుపూర్వోత్తరాలు, ఇనుప కచ్చడాలు, రాలూ రప్పలూ, పాత పాళీ, కొత్త పాళీ ఇలా పలు రచనల ద్వారా సమాజాన్ని ప్రశ్నించారని చందు సుబ్బారావు అన్నారు.

ప్రత్యేక అతిథి, తాపీ ధర్మారావు మనుమరాలు సుజాతాషా తన ప్రసంగంలో ఎన్నో అంశాలను ప్రస్తావించారు. బ్రతికి ఉండి చనిపోయే కన్నా, చనిపోయినా బ్రతికి ఉన్నవారే నిజమైన మనిషి అని తాతయ్య అనేవారు అని ఆమె చెప్పారు.

అనుకోని అతిథిగా వచ్చిన మాజీ ఎంపీ. డా॥ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ మాట్లాడుతూ గిడుగు, నార్ల, ఎ.బి.కె.ల వారసుడిగా కృష్ణారావు నిలవాలని అభిలషించారు.

యూజేఎఫ్ అధ్యక్షుడు ఎం.ఆర్.ఎం. వర్మ అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమంలో ప్రధాన కార్యదర్శి ఎం.నాగేశ్వరరావు, 'అమ్మనుడి' పత్రిక సంపాదకుడు, తాపీ ధర్మారావు వేదిక సమన్వయకర్త డాక్టర్ సామల రమేష్‌బాబు ప్రసంగించారు. యూజేఎఫ్ కంటెంట్ ప్రొవైడర్ డాక్టర్ లీలా ప్రసాద్ స్వాగతోపన్యాసం చేయగా, వర్కింగ్ సెక్రటరీ కుర్రా విజయ్ కుమార్ వందన సమర్పణ చేశారు.

ఈ కార్యక్రమంలో మాజీ ఎం.ఎల్.ఎ., ది విశాఖ కో ఆపరేటివ్ బ్యాంక్ గౌరవ చైర్మన్ మానం ఆంజనేయులు, ఆచార్య కె. వెంకటేశ్వర్లు, ఆంధ్రవిశ్వవిద్యాలయం జర్నలిజం విభాగాధిపతి ఆచార్య పి.బాబీవర్ధన్, సాహితీవేత్త రామతీర్థ, విశ్వవిద్యాలయం డిప్యూటీ రిజిస్ట్రారు డి. నటరాజ్, ఆచార్య దుగ్గిరాల విశ్వేశ్వరం, పలువురు సాహితీ ప్రముఖులు, పాత్రికేయులు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు.

**ఫోటోలు రెండవ అట్టపై చూడండి.**

**కవిత**

## సాగర సందర్శన

**నా**గార్జున సాగరం కాదది
కూలి దుక్కాల మడుగు
కూలిన జీవితాల గోడుగు
మా అమ్మా అయ్యల చెమట గింజల ఒడి
కాబోయే బియ్యపు మడి
మా ఆకలి పొలం లో మెతుకుల కలల గిన్నె
కమ్మ, కాపు, రెడ్డి, రాజుల నీటి గింజల పాతర !
మా వొంటి మీద ఇంకిపోయిన కలల ఉప్పు సాగరం
దమనాల్నీదుక్కాల్నీ జాడించిన ఆరామం
బానిసల శ్రమను మూడు పంటలా
మెక్కుతున్న రాతి జాతర !
మా కష్టాలు పెంచిన కన్నీటి కుంట
ఊళ్లను మింగిన దేవర
ఈ దేవళం లో మాకు ప్రవేశం లేదుర !

**– కృపాకర్ మాదిగ, హైదరాబాదు,**



# 19-9-2015 న తాపీ ధర్మారావు జయంతి - తెలుగు జనమాధ్యమాల దినోత్సవం

## 'తాపీ ధర్మారావు స్మారకోపన్యాసం'

# మీడియా - విస్మృత వర్గాలు

### - పురస్కార గ్రహీత అప్పరసు కృష్ణారావు

**తాపీ** ధర్మారావు జయంతి సందర్భంగా ఈ అంశంపై మాట్లాడే అవకాశం కల్పించినందుకు తాపీ ధర్మారావు వేదికకు, ఉత్తరాంధ్ర జర్నలిస్టు ఫ్రంటుకు కృతజ్ఞతలు.

ప్రాచీన సాహిత్యం నుంచి ఆధునిక సాహిత్యం వరకు, శిష్టవర్గాలనుంచి సామాన్య వర్గాలవరకూ తాపీ ధర్మారావు చేసిన ప్రయాణం వందేళ్లకు పైగా తెలుగు సాహిత్య సామాజిక చరిత్రలో విశిష్టమైనది. నిజానికిది ప్రయాణం అనడంకన్నా పరిణామం అని చెప్పాల్సి ఉన్నది. సాహిత్య ఆకాశం నుంచి భూమార్గం పట్టడానికి జరిగిన ఒక విస్తృత ప్రయాణంలో తాపీ ధర్మారావు అత్యంత ముఖ్యమైన భూమిక పోషించారు. ఆయనా, ఆయన ఆలోచనా ధోరణి, ఆయన రచనలు అందులో భాగమయ్యాయి. తెలుగు సాహిత్య, సామాజిక చరిత్ర పరిణామం అధ్యయనం చేయాలంటే తాపీ ధర్మారావును అధ్యయనం చేస్తే ఒక సమగ్ర స్వరూపం మనకు అర్థమవుతుంది. తెలుగు సమాజంలోనే కాదు, మొత్తం ప్రపంచ వ్యాప్తంగా మారుతున్న ధోరణులను ఆయన అర్థం చేసుకోవడం మాత్రమేకాదు, జీర్ణించుకున్నారు. అందుకు తగ్గట్లుగా తన భాషను, భావాల్ని మార్చుకున్నారు. పీడిత జన పక్షపాతిగా మారారు. తన తర్వాతి తరాన్ని తన పిల్లలద్వారా ఆయన తయారు చేశారు. ఒకరకంగా చెప్పాలంటే వారితో ఆయన ప్రభావితుడయ్యారు. ఆయనది పరిణామశీలితత్వం అనడానికి ఇదొక నిదర్శనం. సినిమాల్లో భాష మారడానికే కాదు, ఇవాళ తెలుగు పత్రికా రచనలో జరిగిన అనేక మార్పులకు ఆద్యుడు ఆయన. 'సాహిత్యం జాతి జీవితం ప్రతిబింబించాలి. కవి ప్రజలలో, ప్రజలతో, ప్రజలకోసం బ్రతకాలి. తలంతా కళ్లు పెట్టుకుని ప్రజల జీవితం గ్రహించాలి... మనిషికీ సమాజానికీ మధ్య ఉన్న సంబంధం స్పష్టంగా కనపడేలా చూపించాలి. తెలుగు కవి, తెలుగు రచయిత, తెలుగు ప్రజల జీవితంలో ఉండి వ్రాయాలి. నిజమైన తెలుగు సాహిత్యం తయారు చేయవలసిన పని ఇంకా ఉంది...' అని అన్నారు తాపీ ధర్మారావు.

ప్రాచీన సాహిత్యం, గ్రాంథిక వాదంనుంచి బయలుదేరిన తాపీ ధర్మారావు క్రమంగా ప్రజా ఉద్యమాల్లోకి, ప్రజా సాహిత్యంలోకి ప్రజల్లోకి ప్రవేశించారు. స్వేచ్ఛ, సమానత్వం గురించి తపించారు. ఛాందస భావాలను నిరసించారు.

*'ప్రజల జీవనము పిడికిట పట్టుక ప్రకటించేది రాతా. / రజతాచలముల పట్టీల్ కొట్టుచు రాసిందంతా రోతా...'* అన్నారు.



పురస్కారం స్వీకరించిన తరువాత
తాపీ 'ధర్మారావు స్మారకోపన్యాసం' చేస్తున్న శ్రీ ఎ. కృష్ణారావు.

*'మందుటాకలిలోను... ఎండు నాల్కలలోన / మొండిబారిన పేద బండ గుండెలలోను...*

*గాండ్రించు భావాల నిండించి / నీ గొంతు సింహనాదము చేయరా... / ఓ కవీ స్థిరమైన పేర్మోయరా...'* అని పిలుపునిచ్చారు.

*'ప్రజల కవినై గొంతు రగిలించి పాడితే / బక్కడొక్కలు రేగి ప్రళయమారుతమట్లు / తక్కువెక్కువలెల్ల ఒక్క దెబ్బను కూల్చి / లోకాల నూగింపవా... ఓ కవీ శోకాల తొలగింపవా...'* అని ఆయన రాశారు.

ఆయన జయంతి సందర్భంగా 'మీడియా- విస్మృత వర్గాలు' గురించి మాట్లాడడమంటే ఆయన ఆలోచనా ధోరణిని ప్రతిఫలించడమే నని, ఆయనకు నివాళి అర్పించుకోవడమేనని భావిస్తున్నాను.

తాపీ ధర్మారావు భావాలలో ఒక విప్లవాత్మకమైన మార్పు ఎలా వచ్చింది? సంస్కృత సాహిత్యంపై, గ్రాంథిక భాషపై, పద్య సాహిత్యంపై పట్టు ఉన్న ఆయన ప్రజల భాషపై, ప్రజల జీవితాలపై ఎందుకు దృష్టి కేంద్రీకరించారు? వేగుచుక్క గ్రంథమాలను స్థాపించి 'జనవాణి'లాంటి ఉద్యమ పత్రికలకు సంపాదకత్వం వహించి, అభ్యుదయ రచయితల సంఘం అధ్యక్షుడై, నిజాం వ్యతిరేక పోరాటంలో తెలంగాణ ప్రజల పక్షాన నిలిచి పోలీసులను ధిక్కరించిన ధైర్య సాహసాల్ని ఆయన ఎలా సంపాదించుకోగలిగారు? రాయవేలూరు జైలులో రాజకీయ డిటెన్యూలపై కాల్పులు జరిపి ఒక నాయకుడి హత్యకు, అనేకమంది హింసకు

కారకుడైన పోలీసులను, గవర్నర్ రాజాజీని ఆయన ఎలా చెరిగి పారేయగలిగారు?

'నేను వాస్తవాలు తెలిపాను. ప్రభుత్వం ఏమి చేస్తుంది? నిన్నూ, నన్నూ కాల్చి చంపుతారా? చంపనీ.' అని రాసిన ధర్మారావుకు ఆ తెగింపు ఎక్కడినుంచి వచ్చింది? 'ఒక వీరుడు మరణిస్తే వేలకొలది మరణింతురు. ఒక నెత్తుటి చుక్కలోన ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లు' అని వ్రాసిన సోమసుందరం లాంటి కవులకు ప్రేరణ నందించిన శక్తి ఆయనకు ఎలా వచ్చింది?

తాపీ ఉత్తరాంధ్ర రచయిత మాత్రమే కాదు, విశ్వజనీన భావజాలానికి ప్రతినిధి. అయితే తెలుగు సాహిత్యంలో ఉత్తరాంధ్ర రచయితలు పోషించిన బృహత్తర పాత్ర చెప్పుకోదగ్గది. అందుకు సామాజిక, చారిత్రక నేపథ్యం ఉన్నది. ఉత్తరాంధ్ర రచయితలు చేసిన రచనల్లో కనిపించినంత ప్రాపంచిక దృక్పథం, అంతర్జాతీయ అవగాహన ఇతర ప్రాంత రచనల్లో అంతగా కనిపించదంటే అతిశయోక్తి కాదు. ఉత్తరాంధ్ర ఎప్పుడూ కొత్త గాలుల్ని ఆహ్వానించింది. 'ఈ విప్లవాగ్నులు ఎచటివని చెబితే శ్రీకాకుళంవైపు చూడమని చెప్పాలి' అని విప్లవకవులు కూడా అన్నారంటే శ్రీకాకుళం ప్రాధాన్యత తెలుస్తుంది. కెవిస్‌చలంగారు తన వ్యాసంలో చెప్పినట్లు ఉత్తరాంధ్రలో, ముఖ్యంగా శ్రీకాకుళంలో ఎప్పుడూ ఎవరికీ ఊడిగం చేసిన పరిస్థితి లేదు. బ్రిటీష్‌వారు ఈ ప్రాంతాన్ని తమ అదుపులోకి తీసుకురాలేకపోయారు. ఇక బౌద్ధ జైన మతాల సంగమంగా ఈ ప్రాంతం అవతరించింది. అంటే ఈ నేలలో ఒక తిరుగుబాటు తత్వం ఉన్నది. ఇక్కడ జన్మించిన అనేకమంది వైతాళికులుగానే కాదు, చరిత్రలో తిరుగుబాటుదార్లుగా కూడా నిలబడ్డారు. తాపీ ధర్మారావులో సామాజిక, తాత్విక, రాజకీయ సంగమానికి నేపథ్యం ఈ ప్రాంతమేనని చలంగారు చెప్పడం నూటికి నూరుపాళ్లు నిజం.

అయితే మొత్తం సాహిత్యంలోనూ, చరిత్రలోనూ, సామాజికశాస్త్ర అధ్యయనంలోనూ ప్రజల దృక్పథం ఏర్పడడానికి ఫ్రెంచి విప్లవం బీజం వేసింది. అంతకుముందు సామాన్యుల తరపున ఆలోచించిన వారు తక్కువ. పేదలు, కార్మికులు, రైతులు, ఇతర విస్మృత వర్గాల పక్షాన ఆలోచించడానికి ఫ్రెంచి విప్లవం రేకెత్తించిన భావాలు తోడ్పడ్డాయి. ఇది భారతదేశ మేధావుల్లోనూ ప్రభావం చూపింది. ఫ్రెంచి సాహిత్యం భారత్‌లోకూడా ప్రవేశించింది. ఫ్రెంచి విప్లవం, పారిశ్రామిక విప్లవం, మార్క్సిస్టు భావాల వ్యాప్తి, రష్యన్ విప్లవం 18, 19, 20 శతాబ్దాల్లో చరిత్ర అధ్యయనంలోనూ, సాహిత్యంలోనూ అనేక మార్పులకు కారణమైంది. ఈ మార్పులు వీరేశలింగం, గురజాడ అప్పారావు, తాపీ ధర్మారావు, శ్రీశ్రీ మొదలైన వారందరి భావజాలంలోనూ మార్పులకు కారణమయ్యాయి.

'విస్మృతవర్గాలు' అన్నమాట మొదట వాడింది 19వ శతాబ్దికి చెందిన ఇటాలియన్ మేధావి ఆంటోని గ్రామ్‌స్కీ. జాతి, కులం, లింగం, ప్రాంతం, మతం ఆధారంగా వివక్షకు గురైన వర్గాలపై సాంస్కృతిక ఆధిపత్యాన్ని ఆయన సిద్ధాంతీకరించారు. అణగారిన వర్గాలు, క్రింది వర్గాల గురించి ఆయన ప్రస్తావించారు. ప్రభుత్వాలు సాంస్కృతిక సంస్థలను నిలుపుకోవడానికి ఏ విధంగా ఉపయోగించుకుంటాయో ఆయన వివరించారు. రాచరిక పాలన, భూస్వామ్య, జమిందారీ వర్గాల పాలననుంచి పెట్టుబడిదారీ వ్యవస్థ వరకు నాటి సాహిత్యం, కళారూపాలు సామాన్యులనుంచి ఎలా దూరమయ్యాయో గ్రహించడానికి గ్రామ్‌స్కీ సిద్ధాంతీకరణ దోహదం చేస్తుంది.

తాపీ ధర్మారావు సరిగ్గా గ్రామ్‌స్కీ ధోరణిలో ప్రజలకోసం యోచించారు. నన్నయ్య కాలంలో ప్రజల కవిత్వం, ప్రధానంగా దరువులు, యక్షగానాలు, పదాలు, పాటలు, కథలు, ద్విపదలు ఎలా ఉండేవో తన 'కొత్తపాళీ'లో సమగ్రంగా వివరించారు. ప్రజలకోసం వ్రాసిన రచనలన్నీ 'గాసటబీసట' అన్నారని, 'చెట్టునీడన కూర్చున్నాడు…' అనే బదులు వృక్షఛ్ఛాయన నుపవిష్టుండయ్యెను…' అని వ్యాఖ్యానించారని తాపీ చెప్పారు. విషయాన్ని బట్టి మంచి చెడ్డలు కలగడం పోయి, భాషను బట్టి హెచ్చుతగ్గులు కలిగాయని, క్రమంగా ఆంధ్రం అంతరించి సంస్కృతం ప్రవేశించిందని క్రమంగా కవికీ, జనానికీ మధ్య మహాసముద్రాలు పెరిగిపోయాయని తాపీ విశ్లేషించారు.

భారతదేశంలో అణగారిన వర్గాలకు చారిత్రకంగానూ, చరిత్ర రచనలోనూ జరిగిన అన్యాయాన్ని ఆస్ట్రేలియాలో స్థిరపడ్డ భారతీయ మేధావి రంజిత్ గుహా సిద్ధాంతీకరించారు. అణగారిన వర్గాల చరిత్ర రచన గురించి (సబాల్టర్న్ హిస్టరియోగ్రఫీ) ఆయన విశ్లేషించారు. ఆర్థిక వనరుల్లో, సామాజిక హోదాలో, మేధావిత్వంలో ఆధిక్యత కారణంగా చరిత్ర రచన కొన్ని వర్గాలకే సానుకూలంగా ఉండడం, చరిత్రలో వారి ఆధిపత్యం, నియంత్రణ స్పష్టంగా కనపడడం గురించి ఆయన అభివర్ణించారు. దీన్ని సంపన్నవర్గాల చరిత్ర రచన (ఎలైటిస్ట్ హిస్టరియోగ్రఫీ) అని ఆయన అన్నారు. భారత దేశంలో బ్రిటన్ దీన్ని ప్రభావితం చేసిందని, రాజుల పాలన ఆధారంగా చరిత్ర రచనకు ఇది ప్రోత్సాహం కలిగించిందని ఆయన చెప్పారు. బ్రిటీష్‌వారు అధికారాన్ని బదిలీ చేసిన తర్వాత కూడా ఈ ధోరణులు మన చరిత్ర రచనలో, మన భావజాలంలో జీర్ణించుకుపోయాయని, స్వాతంత్రోద్యమ చరిత్రలో సామాన్యుల సాహసాలకు విలువ లేకుండా పోయిందని ఆయన అభిప్రాయపడ్డారు. గాంధీ, నెహ్రూ, పటేల్ లాంటి వారికిచ్చిన ప్రాధాన్యత బిర్సాముండా, అల్లూరి సీతారామరాజు లాంటివారికి ఇవ్వలేదు. బిర్సా ముండా అమరుడైన తర్వాత 98 సంవత్సరాలకు పార్లమెంటు ఆవరణలో విగ్రహం నెలకొల్పారు. పార్లమెంటులో విగ్రహం పొందిన తొలి గిరిజన నాయకుడాయన. జార్ఖండ్ ఏర్పడడానికి ముందు ఓటు బ్యాంకు రాజకీయాల్లో భాగంగా ఈ విగ్రహం నెలకొల్పారు. ఇప్పటికీ అల్లూరి సీతారామరాజుకు పార్లమెంటులో స్థానంలేదు. చాలా గిరిజన పోరాటాలకు, రైతాంగ పోరాటాలకు చరిత్ర రచనలో స్థానం లేకుండా పోయింది. నిజానికి గిరిజన పోరాటాల విషయంలో బ్రిటీష్‌వారు అనుసరించిన విధానాలకు, తర్వాత స్వతంత్ర భారతదేశంలో ప్రజాస్వామ్య ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలకూ తేడాలేదు. గిరిజన పక్షాన నిలిచిన బస్తర్ రాజు ప్రవీణ్ చంద్రదేవ్‌ను 1966లో కాంగ్రెస్ సర్కారు పోలీసులచే హతమార్చిన తీరు ఇందుకు నిదర్శనం. నయా వలసవాదం, నయా జాతీయ వాదం ప్రజలపై, భారతదేశంలో అణగారిన వర్గాల వనరులపై ఆధిపత్యం, పట్టు కొనసాగించడానికి వీలు కల్పించింది. నిజమైన కథానాయకులకు, విస్మృతవర్గాలకు చరిత్ర

రచనలో స్థానం లేకుండాపోయింది.

19వ శతాబ్దంలో సాంకేతిక విప్లవం వల్ల ఏర్పడిన పత్రికా ముద్రణపై కూడా సహజంగా సంపన్న వర్గాల పట్టు కొనసాగింది. పెట్టుబడిదారీ విధానం సఫలం కావడానికి అనుకూల భావజాలం వ్యాప్తి చేయడానికి దోహదపడ్డాయి. స్వాతంత్ర్యోద్యమ కాలంలో కూడా దేశంలో జరిగిన అన్ని తిరుగుబాట్లను, పోరాటాలను పత్రికలు రికార్డు చేయలేదు. విచిత్రమేమంటే ఒకప్పటి సంపన్న వర్గాలు, మధ్యతరగతి మేధావులు చూపించిన ప్రగతిశీలత, ఉదారత్వాన్ని కూడా ఇప్పటి నయా సంపన్నవర్గాలు, నూతన భాగ్యవంతులు ప్రదర్శించడంలేదు. కార్పొరేటీకరణ పెరుగుతున్న కొద్దీ పత్రికలలో, మీడియాలో విస్మృత వర్గాలకు స్థానం తగ్గిపోవడం ఇందుకు నిదర్శనం. చాలా చోట్ల ప్రజల ప్రతిఘటనను, పోరాటాన్ని పత్రికలు రికార్డు చేయటంలేదు. అసలు ప్రజల ప్రతిఘటననే అభివృద్ధి నిరోధకంగా పత్రికలు చిత్రించే స్థితికి చేరుకున్నాయి. ఎక్కడో ఒక చోట ప్రజల ప్రతిఘటన తీవ్రమై, పోలీసుల కాల్పుల్లో వారు మరణించే స్థితికి చేరుకున్న తర్వాత, పత్రికలు తప్పనిసరి పరిస్థితుల్లో దాన్ని ఒకటి, రెండు రోజులు చిత్రించి వదిలి వేస్తున్నాయి. ఆ తర్వాత జరిగిందేమిటో తెలుసుకోవడానికి చాలా కష్టపడవలసి వస్తుంది.

స్టాక్ మార్కెట్ హెచ్చుతగ్గులను పత్రికల పతాక శీర్షికల్లో ఎక్కించడంలో ఉన్న ఆసక్తి, రైతుల ఆత్మహత్యల గురించి రికార్డు చేయడంలో ఉండదు. ఒక కార్పొరేట్ టీవీ సంస్థ సిఇఓ భార్యకున్న అక్రమసంబంధాలు, ఆమె చేసుకున్న పెళ్లిళ్లు, ఆమె స్వంతకూతురును హత్య చేయడం గురించి రోజుల తరబడి మొదటి పేజీలో వ్రాసే పత్రికలు ఆకలి చావుల గురించి, గ్రామాల్లో రైతాంగ సంక్షోభం, దళితుల పట్ల వివక్ష గురించి చూసీ చూడనట్లు వ్యవహరిస్తున్నాయి. నయా సంపన్నుల వార్తలు, నగరంలో నేరాలు, వ్యాపార సంస్థల లావాదేవీలకు, రాజకీయ నాయకుల సంచలనాత్మక ప్రకటనలకు ప్రాధాన్యతనిస్తున్న పత్రికలు కార్మిక, రైతు కూలీలు, దళిత వర్గాలు ఎదుర్కొంటున్న సంక్షోభాన్ని అంతగా చిత్రించడం లేదు. రాజకీయపార్టీలు, వాటిని పోషించే వ్యాపార సంస్థల చేతుల్లో పావులైన పత్రికలు క్రమంగా వారి వర్గ ప్రయోజనాలను కాపాడేందుకే పనిచేసే స్థితికి చేరుకుంటున్నాయి. పత్రికా యజమానుల ప్రయోజనాలను కాపాడడం ద్వారా వారిని తమవైపుకు తిప్పుకునే రాజకీయ పార్టీలు, వ్యాపార సంస్థల గురించి స్పష్టంగా తెలుస్తోంది. ఈ పరిణామాన్ని జాతీయ స్థాయిలో కూడా చూడవచ్చు. ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ కేసునుంచి తమను తప్పించేలా చేయనందుకు ప్రధానికి సన్నిహితుడైన ఒక పత్రికా సంపాదకుడిని ఉద్యోగం నుంచి తప్పించిన ఉదాహరణలు జాతీయస్థాయిలో ఉన్నాయి. ఒక సహజవాయు సంస్థగురించి వచ్చిన ఆరోపణలను ప్రసారం చేయడం ఆపనందుకు ఒక ఛానెల్ సంపాదకుడిని తప్పించిన సందర్భం ఉన్నది. తటస్థంగా వ్యవహరించే పత్రికలను, ప్రసార సాధనాలను వెతుక్కోవలసి వస్తుంది. పత్రికల్లో మనకు కావల్సిన వార్తల గురించి అన్వేషించాల్సిన పరిస్థితి ఏర్పడింది. మార్కెట్ పత్రికల తీరుతెన్నులను పూర్తిగా శాసించే స్థితి నెలకొన్నది.

విచిత్రమేమంటే పత్రికలు, ప్రసార సాధనాలు చెప్పలేని అంశాల గురించి ప్రజలకు వివరించేందుకు సోషల్ మీడియా అద్భుతంగా పనిచేస్తున్నప్పటికీ, రానురానూ అది కూడా కొన్ని వర్గాల ఆధిపత్యంలోకి వెళ్లే క్రమం కొనసాగుతున్నది. అంతటా పెట్టుబడి మాయే కనుక సోషల్ మీడియాను కూడా కొన్ని వర్గాలు, పార్టీల కిరాయిమూకలు ఆవరించాయి. వాస్తవాలను వక్రీకరించేందుకు, మసిపూసి మారేడుకాయ చేసేందుకు, ప్రత్యర్థులపై బురద చల్లేందుకు పార్టీలు సోషల్ మీడియా కోసం ప్రత్యేక విభాగాలే ఏర్పర్చుకున్నాయి. చరిత్రను వక్రీకరించి, ఒక నాయకుడిని ఉన్నతంగా చిత్రించి, వ్యతిరేకులపై అసత్య ప్రచారం ఉధృతంగా చేసి, ప్రజల అభిప్రాయాన్ని ప్రభావితం చేసే పరిస్థితి ఏర్పడింది. ఎన్నికల్లో విజయం సాధించేందుకు ఈ అక్రమ ప్రచారం కూడా దోహదం చేసింది.

ఆధునిక మార్కెట్‌లో ప్రజాభిప్రాయాన్ని ప్రభావితం చేసే కారణాలు వేరు. మార్కెట్టు ద్వారా భయాన్ని కల్పించవచ్చు. మార్కెట్టు ద్వారా అభిమానాన్ని కల్పించవచ్చు. మార్కెట్టు ద్వారా ఏ ఆలోచనైనా దారి మళ్లించవచ్చు. ఈ క్రమంలో కారణం అనే దాన్ని సులభంగా హతమార్చవచ్చు. అసలెందుకు ఇలా జరిగింది? ఇది నిజమా కాదా అని తార్కికంగా ఆలోచించే వివేచనా శక్తిని హతమార్చవచ్చు. అమెరికా ఉపాధ్యక్షుడు అల్‌గోరే సైతం టీవీల ద్వారా ప్రచారాన్ని కొనుగోలు చేయడం ద్వారా తాను ఎన్నిక కాగలిగానని 'అసాల్ట్ ఆన్ రీజన్' (కారణంపై దాడి) అన్న పుస్తకంలో రాశారు. ప్రజాస్వామ్యం అనేది ఒక కొనుగోలు వస్తువు... అని ఆయన స్పష్టంగా చెప్పారు.

భారతదేశంలో ఈ పరిస్థితికి కారణం మొత్తం వ్యవస్థ కొన్ని వర్గాల చేతుల్లోకి పోవడం. దాదాపు పాతిక సంవత్సరాలు ఢిల్లీలో పనిచేసిన నాకు ఈ వ్యవస్థలోని దుర్మార్గాలకు సంబంధించి అనేక విషయాలు అవగతమయ్యాయి. ఎన్నికల్లో కోట్లాది రూపాయలు ఖర్చుపెట్టి పార్లమెంటులో ప్రవేశిస్తున్న అనేకమందికి ప్రజల దైనందిన సమస్యలతో సంబంధం లేదు. వ్యాపారస్తులు, మాఫియాలు, నేరచరితులు ప్రజాప్రతినిధులుగా అవతరిస్తున్నారు. వారు తమ ప్రయోజనాలను కాపాడుకునేందుకు చట్ట సభల్ని ఉపయోగించుకుంటున్నారు. సామాన్యులు ఎన్నికల బరిలో ప్రవేశించే పరిస్థితి లేదు. ప్రభుత్వాలు అభివృద్ధి పేరిట అత్యధికంగా ఉన్నతవర్గాలు, కాంట్రాక్టర్లకు అనుకూలంగా నిర్ణయాలు తీసుకుంటున్నాయి. సామాన్యులు బస్సు కిరాయి చెల్లించడానికి నానా అగచాట్లు పడుతుంటే ప్రభుత్వాధినేతలు కోట్ల ఖర్చుతో ప్రత్యేక విమానాల్లో ప్రయాణిస్తున్నారు. దేశం రూపురేఖల్ని, వేలాదిమంది భవిష్యత్తుని మార్చే ఎస్ఇజడ్‌లకు సంబంధించి చట్టాల్ని ఒక గంటలో ఎటువంటి చర్చా లేకుండా ఆమోదిస్తున్నారు. ఎస్‌సి, ఎస్‌టి అత్యాచారాలకు సంబంధించిన బిల్లును స్థాయీ సంఘం ఆమోదించినా పార్లమెంటులో దాన్ని రెండు సంవత్సరాలుగా ప్రవేశపెట్టకపోయినా చర్చించే నాథుడు లేడు.. అదే జిఎస్‌టి బిల్లుకోసం ప్రత్యేక సమావేశాలు ఏర్పాటు చేయాలని భావిస్తారు. 'ఈదేశంలో దేశీ చమురు త్రవ్వకాలు కొనసాగించే కార్యకలాపాలకు పన్నురాయితీ కల్పించడమైనది...' అని ఒక ఆర్థికమంత్రి ఒకే వాక్యంలో కొట్టిపారేస్తారు. దీనితో దేశంలో చమురు త్రవ్వకాలు సాగించే ఏకైక సంస్థకు వేలకోట్ల ప్రయోజనం కలుగుతుంది. ఆ సంస్థ ఎవరిదో వేరే చెప్పనక్కరలేదు.

రిటైల్ రంగంలో ఎఫ్‌డిఐని ప్రవేశపెట్టే బిల్లుపై ఓటు వేసేందుకు ఒక మద్యంవ్యాపారి అయిన ఎంపి నాలుగు గంటలకోసం ప్రత్యేక విమానంలో ఢిల్లీ వచ్చారు. ఎందుకంటే నష్టాల ఊబిలో ఉన్న తన విమానయాన సంస్థకు ప్రభుత్వ మద్దతు అవసరం కాబట్టి. ప్రజాస్వామ్యానికి నిలయమైన పార్లమెంటు, ప్రధానమంత్రి కార్యాలయమైన సౌత్‌బ్లాక్, ఆర్థిక వ్యవస్థని నిర్ణయించే సౌత్‌బ్లాక్‌లో లక్షల కోట్ల విలువైన నిర్ణయాలు జరుగుతుంటాయి. రాష్ట్రాల భవిష్యత్తులు మారుతుంటాయి. అతి సమీపంలో ఇండియాగేట్ వద్ద గాలిబుడగలు అమ్ముకునేవారు, వేరుసెనగలు అమ్ముకునేవారు, బూట్‌పాలిషు చేసేవారు, అడుక్కునేవారికి తమకు అత్యంత సమీపంలో ఎంతటి దారుణాలు జరుగుతాయో అర్థం కాదు. ఢిల్లీ వీధుల్లో గజగజ చలికి వణికిపోతూ ప్రతిఏడాదీ వందలాది మంది చనిపోతారు. అదే ఢిల్లీలో చెమటచుక్క కూడా చిందించకుండా కోట్లాదిరూపాయలు సముపార్జించేవారున్నారు. ఒకే కిలోమీటర్ పరిధిలో మనకు రెండు భారతదేశాలు కనిపిస్తుంటాయి. దీన్ని చిత్రించే మీడియాలేదు. 'మనదేశంలో ఆకలి చావులు, ఆత్మహత్యలు పెద్ద ఎత్తున జరుగుతున్నాయంటే మన పాలకులకు ఆకలి అంటే ఏమిటో తెలియదని అర్థం' అని ప్రముఖ జర్నలిస్టు పాలగుమ్మి సాయినాథ్ అన్నారు. మనదేశంలో ఫైవ్‌స్టార్ హాస్పిటల్స్ అనేకం ఉండవచ్చు. కానీ కనీసం 20 కోట్ల మంది జనాభాకు కనీస వైద్య వసతులు అందడం లేదు. ఇటీవల ఒక ప్రభుత్వ ఆసుపత్రిలో ఒక శిశువును ఎలుకలు తినేయడం ఇందుకు నిదర్శనం.

'మేం వ్యాపార వర్గాలకు అనుకూలంగా ఉండడానికీ, పేదలకు అనుకూలంగా ఉండడానికీ మధ్య వైరుధ్యం ఏమీలేదు' అని కేంద్ర ఆర్థికమంత్రి అరుణ్‌జైట్లీ చాలా అమాయకంగా పార్లమెంటులో ప్రకటించారు. ఎవరి ప్రయోజనాలు కొల్లగొడితే ఎవరికి ప్రయోజనం కలుగుతుందో ఆయనకు తెలియనిది కాదు. ఆర్థిక వ్యవస్థలో అభివృద్ధి అసమానతలను తగ్గిస్తోందా, లేక పెంచుతున్నదా అన్నది మనకు స్పష్టంగా అర్థమవుతోంది. ప్రపంచ వ్యాప్తంగా అరుణ్‌జైట్లీ లాంటివారు చెబుతున్న, అమలు చేస్తున్న విధానాల కారణంగా కేవలం 3 శాతం వర్గాలకే సంపద చేరిందని ప్రముఖ ఆర్థికశాస్త్రవేత్త థామస్‌పికెటీ లాంటివారు విశ్లేషించారు. సంపద అనేది ప్రతిభకు సూచకం కానేకాదని ఆయన చెప్పారు. విజయ్ మాల్యా సంపాదనకూ, అబ్దుల్‌కలామ్ సంపాదనకూ పోల్చగలమా? బిల్‌గేట్స్ సంపదకూ, స్టీవ్ జాబ్స్ సంపాదనకు పోల్చగలమా? ఈ వ్యవస్థ సులభ సంపాదనకు దోహదం చేసి, విస్మృత వర్గాలను విస్మృతం చేస్తోంది. విదేశాల్లో నల్లధనం గురించి ఆలోచిస్తున్నాం కాని, మన దేశంలో ఎన్నికల్లో నెగ్గేందుకు కోట్లాది రూపాయలు ఎలా ఖర్చుపెడుతున్నారని ఆరా తీసిన వారు లేరు.

న్యాయవ్యవస్థలో న్యాయం గురించి ఎంత తక్కువ మాట్లాడితే అంత మంచిది. 'అబద్ధం లేకుండా సాక్ష్యం కావాలంటే ఈ భూప్రపంచకమందు ఎక్కడైనా సాక్ష్యం అనేది ఉంటుందా, మీరు అనుభవం లేకుండా నీతులు చెబుతున్నారు కాని... హైకోర్టులో వకీళ్లు కూడా తిరగేసి కొట్టమంటారు... నీ పుణ్యం ఉంటుంది బాబూ... నిజం, అబద్ధం అని తేలగొట్టక ఏదో ఒక తడక అల్లి తయారుచేస్తే కాని ఆబోరు దక్కదు' అని ఈ ప్రాంతానికి చెందిన గురజాడ కన్యాశుల్కంలో




హెడ్‌కానిస్టేబుల్ గిరీశంతో అంటాడు. ఆయన కన్యాశుల్కం రాసి నూటాపాతిక సంవత్సరాలు సమీపిస్తున్నప్పటికీ న్యాయవ్యవస్థ తీరుతెన్నులు ఏమీ మారలేదు. పోనీ మనం రాసుకున్న భారత రాజ్యాంగం కులం, మతం, జాతి, ప్రాంతం మొదలైన వాటి ఆధిపత్య స్వభావాన్ని మార్చివేసిందా? పేదలకు, ధనికులకు మధ్య అగాధాన్ని చెరిపివేసిందా? అగ్రకులాలకూ, దళితులకు మధ్య తేడాను తగ్గించిందా? గిరిజన ప్రయోజనాలను కాపాడుతోందా? స్త్రీలకు, పురుషులకు మధ్య తేడా తగ్గించిందా? స్వాతంత్ర్యం తర్వాత రాజ్యాంగ యంత్రాంగపు వర్గ స్వభావం ఎంతమేరకు మారింది? ఈ ప్రాంతానికి చెందిన మరో గొప్ప రచయిత రావిశాస్త్రి రచనల్ని చదివితే అదేమీ మారనట్లు అర్థమవుతుంది. రావి శాస్త్రి రచనల్లో నేరానికీ, రాజ్యాంగ యంత్రాంగానికీ ఉన్న పరస్పరతతో న్యాయవాదులూ, న్యాయమూర్తులూ భాగం పంచుకుంటారని మనకు అర్థం అవుతుంది. 'కట్నం సదివిచ్చుకుని కేసును' తేలగొట్టేయడం' ఎలాగో ముత్యాలమ్మ వంటి నిరక్షరాస్యురాలికి తెలుసు. 'ఈ నోకంలో డబ్బూ, యాపారం తప్ప మరేట్నేదు.' అని ఆమె ద్వారా రావిశాస్త్రి జీవిత సత్యాన్ని చెప్పిస్తారు. ఆమె నేరం చేసానని ఒప్పుకోదు. కాని కేసు ఒప్పేసుకుంటానని చెబుతుంది. పేదలు కేసులు ఒప్పేసుకోవాల్సి వస్తే చాలామంది న్యాయమూర్తులు కేసులు తేలగొట్టేస్తారు. విఐపిల కేసులు తేల్చడానికి కోర్టులకు దశాబ్దాలకు పైగా పడుతుంది. అది ఒక ముఖ్యమంత్రి కేసు కావచ్చు. ప్రధానమంత్రి కేసు కావచ్చు. కేసులు తేలగొట్టేస్తే న్యాయమూర్తులకు ఎన్నో ప్రయోజనాలున్నాయి. గవర్నర్లు కావచ్చు. మానవహక్కుల కమీషన్ ఛైర్మన్లు కావచ్చు. రాజ్యసభ సభ్యత్వాలు పొందవచ్చు. ఇంకేమేదైనా పొందవచ్చు. రాజకీయ నాయకత్వానికీ, న్యాయ, అధికార యంత్రాంగానికీ మధ్య లాలూచీలు, ఒప్పందాల మూలంగానే ఈ రాజ్యాంగ వ్యవస్థ సాగుతుందన్న విషయంలో అవాస్తవం లేదు.

ఇక సంస్కరణల తర్వాత మరో వ్యవస్థ ఒకటి ఏర్పడింది. అది కార్పొరేట్ వ్యవస్థ. అది అన్ని వ్యవస్థల్నీ ప్రభావితం చేసేంతగా విస్తరించింది. పార్లమెంటులోనూ, చట్టసభల్లోనూ, ప్రభుత్వ యంత్రాంగాల్లోనూ, చివరకు నాయ్యవ్యవస్థలోనూ దాని ప్రభావం చొచ్చుకుపోయింది. న్యాయవ్యవస్థ ఏదిముఖ్యమైన కేసు అని భావిస్తుందో చెప్పడం కష్టం.

ఇక సంస్కరణల తర్వాత మరో వ్యవస్థ ఒకటి ఏర్పడింది. అది కార్పొరేట్ వ్యవస్థ. అది అన్ని వ్యవస్థల్నీ ప్రభావితం చేసేంతగా విస్తరించింది. పార్లమెంటులోనూ, చట్టసభల్లోనూ, ప్రభుత్వ యంత్రాంగాల్లోనూ , చివరకు న్యాయవ్యవస్థలోనూ దాని ప్రభావం చొచ్చుకుపోయింది. న్యాయవ్యవస్థ ఏది ముఖ్యమైన కేసు అని భావిస్తుందో చెప్పడం కష్టం. ఫలానా న్యాయమూర్తి వద్దకు కేసు వస్తే ఫలానా తీర్పువస్తుందని చెప్పడం సులభం. పైనుంచి వచ్చే ఆదేశాలకు అనుగుణంగా ముఖ్య నేతలకు అనుగుణంగా తీర్పులు వస్తాయని ప్రచారం జరుగుతుంది. న్యాయవ్యవస్థలో జరుగుతున్న అక్రమాన్ని, అవినీతిని ప్రశ్నించే ధైర్యం మీడియాకు లేదు. కాని ప్రజలు అన్నీ గమనిస్తుంటారు.

విచిత్రమేమంటే మీడియా సమాజంలో ఎంతశాతం వర్గాలకు ప్రాధాన్యతనిస్తున్నది? కేవలం పదిశాతం వర్గాలకు మీడియా ప్రాధాన్యతనిస్తున్నదని భావించేవారు అనేకమంది ఉన్నారు. మొత్తం సమాజంలో 90 శాతం వర్గాలు మీడియాకు విస్మృత వర్గాలయ్యాయా అని ఆలోచించాల్సిన అవసరం ఉన్నది. రాజకీయ పార్టీలు, నేతల కార్యకలాపాలే మీడియాకు ప్రధాన వార్తలవుతున్నాయి. ఒకరినొకరు విమర్శించుకుంటే ఎవరి ఎజెండాకు అనుగుణంగా వారు ప్రచారం కల్పించడం ఒక ధోరణిగా మారింది. ఒక వార్త ప్రాధాన్యత ఏఏ పత్రికల్లో ఎలా ఉంటుందో సామాన్యుడు కూడా చెప్పగలిగిన పరిస్థితి ఏర్పడింది.

ఈ పరిస్థితి పోవడానికి సామాజిక వర్గాల ఒత్తిడి, పౌరసమాజం నిరంతరం క్రియాశీలకంగా పనిచేయడం అవసరం.అదే సమయంలో ప్రజల్లో నిరంతరం చైతన్యం కల్పించడం అవసరం. అణగారిన వర్గాల చరిత్ర రచనను పునరుద్ధరించడానికి కొత్త వైఖరులను అవలంబించాల్సి ఉన్నది. అసలు చరిత్ర రచనను, మీడియాను, ప్రసార సాధనాలను నయా వలసవాద, నయా సంపన్నవాద ప్రభావం నుంచి విముక్తం చేసే క్రమాన్ని ఇంకా ప్రారంభించాల్సి ఉన్నది. తాపీ ధర్మారావువేసిన బాటలో మనం మరింత విస్తృతంగా ప్రయాణించినప్పుడే విస్మృత వర్గాలకు న్యాయం చేసినట్లువుతుంది. 'నిజమైన తెలుగు సాహిత్యం రావల్సిన అవసరం ఇంకా ఉన్నది' అని తాపీ ధర్మారావు ఈ అర్థంలోనే అన్నారని నేను భావిస్తున్నాను. నిజమైన తెలుగు సాహిత్యం మాత్రమే కాదు. నిజమైన తెలుగు పత్రికలు  రావల్సి ఉంది. తాపీ ధర్మారావు లాంటి మన పూర్వీకులు మనకు బాట వేసి వెళ్లారు. నా మటుకు నాకు ప్రశ్నించడంద్వారానే అనేక అంశాలు లేవనెత్తవచ్చునని, ప్రశ్నించడం ద్వారానే విస్మృత వర్గాల సమస్యలకు కావల్సిన పరిష్కారాలు అన్వేషించడం అన్వేషించవచ్చునని అనిపిస్తుంది. తాపీ ధర్మారావు శిక్షణ నిచ్చిన ప్రముఖ జర్నలిస్టు నార్ల వెంకటేశ్వరరావు ఇదే చెప్పారు.

'ప్రశ్న నుంచి పుట్టు పరిణత జ్ఞానమ్ము, / ప్రశ్నతోటి పెరుగు ప్రాభవమ్ము...

ప్రశ్నలేని ప్రగతి ప్రశ్నార్థకమ్మురా... / వాస్తవమ్ము నార్లవారి బాట' అని స్పష్టం చేశారు.

తాపీ ధర్మారావు తన జీవితాంతం ప్రశ్నిస్తూనే పోయారు. సాహిత్యంలోనే కాదు, వ్యవస్థలోని రుగ్మతల్ని ప్రశ్నించారు. ఆయన 'ఆలిండియా అడుక్కునే వాళ్ల మహాసభ' పుస్తకంలో ఇలాంటి ప్రశ్నలు ఎన్నో ఉన్నాయి. 'ముష్టివాడిని సృష్టించింది భూలోక బ్రహ్మలే' అని ఆయన అన్నారు. 'మానవులంతా ఒకే కుటుంబం అంటారుకదా? అటువంటి కుటుంబంలో ఒక్కడు అడుక్కోవాల్సిన అవసరం ఎందుకు వచ్చింది? ఎలా వచ్చింది? ఎందుకు రావాలి? ఈ నీచత్వం ఎవరిది? ఆ అడుక్కున్నవారిదా? కాక ఆ కుటుంబానిదా? .... గాంధీ మహాత్ముడు ప్రజల చేతుల్లో అధికారం పెట్టాడు. ఎందుకు పెట్టాడు? లక్షలూ కోట్లు ఇనుప పెట్టెల్లో భర్తీ చేయమనా?... వాళ్లేదో అడుక్కుంటున్నారని భావిస్తాం. నిజం అదికాదు. వాళ్లు సంఘాన్ని హెచ్చరిస్తున్నారు. మరుగునబడ్డ విషయాన్ని జ్ఞప్తి చేస్తున్నారు. చెంపపెట్టు పెడుతున్నారు. కొరడాపెట్టి కొడుతున్నారు. ఓరి దౌర్భాగ్యుల్లారా, ధర్మం చర అని వేదాలుఘోషిస్తున్నా, మీరు మీ ధర్మాన్ని పరిత్యజిస్తున్నారు. ఇప్పటికైనా గ్రహించండి... వర్తకంలో ధనికుడైనవాడూ, లాటరీలో మేటి అయినవాడూ, యుద్ధాల్లో పెద్దవాడైనవాడు, పరిశ్రమల్లో పైకం కూర్చినవాడు ఆ సొత్తంతా తాను చెమటోడ్చి గడించిందే అనుకుంటాడు. నిజానికి వీరికి చెమటేలేదు. అసలు చెమటోడ్చినవాడు ఒక పూట భోజనంతో ఉపవాసాలు చేస్తున్నాడు. ఇదంతా వట్టి దోపిడీ. ఇప్పటి శిక్షాస్మృతికి చిక్కని దోపిడీ... దొర ఎవడు? దొంగ ఎవడు? అని ప్రశ్నించారు తాపీ ధర్మారావు. ఆయన మనకు తాతాజీ, ఆ తాతాజీ మార్గంలో ఆలోచిస్తే చాలు విస్మృత వర్గాల గురించి సరైన దిశలో ఆలోచించినట్లేనని భావిస్తున్నాను

తాతాజీ పేర నెలకొల్పిన ఈ అవార్డు నాకు లభించడంతో నాకు అపార గౌరవం లభించినట్లేనని భావిస్తున్నాను.


**రచయిత శ్రీ అప్పరసు కృష్ణారావు**
**'ది న్యూ ఇండియన్ ఎక్స్‌ప్రెస్'**
**దినపత్రిక సంపాదకులు, ఫోను : 9810223863**


## కొత్తగా నవలలు రాసేవారికి పురస్కారం

క్రొత్తగా నవలలు రాసే రచయితలను ప్రోత్సహించాలనే ఉద్దేశ్యంతో ఒక నవలాకారుడు రచించిన మొదటి నవలకు 10 వేల రూపాయల పారితోషికం ఇవ్వాలని అంపశయ్య నవీన్ సాహిత్య సమితి నిర్ణయించింది. ఈ పారితోషికాన్ని ప్రతి సంవత్సరం **డిసెంబర్ 24**వ తేదీన జరిగే నవీన్ జన్మదినోత్సవ కార్యక్రమంలో ప్రదానం చేస్తారు.

**వివరాలకు :** డి. స్వప్న, కార్యదర్శి, అంపశయ్య నవీన్ లిటరరీ ట్రస్టు, 2-7-71, ఎక్సైజ్ కాలనీ, హనుమకొండ, వరంగల్లు-506 001. ఫోను:0870-2456458.

**అమ్మనుడిని ప్రేమించలేనివాడు,**
**అమ్మనూ దేశాన్ని ప్రేమించలేడు.**

సంస్మరణ

# మహామహోపాధ్యాయ, పద్మశ్రీ

# పుల్లెల శ్రీరామచంద్రుడు




సంస్కృత భాష నుండి తెలుగులోకి శతాధిక గ్రంథాలను అనువాదం చేసి, తెలుగువారికి అందించిన మహాపండితుడు శ్రీ పుల్లెల రామచంద్రుడు. వారు 1927 అక్టోబర్ 23-24 రాత్రి శ్రీమతి సత్యవతి, శ్రీసత్యనారాయణ శాస్త్రి దంపతులకు కోనసీమలో జన్మించారు. తండ్రిగారివద్దే అక్షరభ్యాసం చేసి, వారివద్దే వ్యాకరణం, పంచకావ్యాలు చదువుకున్నారు. ఆ తర్వాత నరేంద్రపురంలో కొంపెల్ల సుబ్బరాయశాస్త్రి గారి వద్ద ప్రౌఢ కావ్యాలు, వ్యాకరణ గ్రంథాలు అధ్యయనం చేశారు. మద్రాసు సంస్కృత కళాశాలలోనూ, విశ్వవిద్యాలయంలోనూ అధ్యయనం కొనసాగించి, 'విద్వాన్'లో ప్రథమ స్థానాన్ని పొందారు. హిందీ 'విశారద'లో కూడా ఉత్తీర్ణులయ్యారు. మలికిపురం హైస్కూలులో కొంతకాలం సంస్కృత అధ్యాపకుడిగా ఉద్యోగం చేశారు. బెనారస్ విశ్వవిద్యాయంలో సంస్కృతం, ఇంగ్లీషు, హిందీ భాషల్లో ఎం.ఏ., పట్టభద్రుడయ్యారు. 1960లో ఉస్మానియా విశ్వవిద్యాలయ అనుబంధ కళాశాల అయిన ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాల, వరంగల్‌లో లెక్చరర్‌గా నియమితుయ్యారు. విశ్వకవి రవీంద్రుని 'గీతాంజలి'ని చక్కని మందాక్రాంత వృత్తంలో సంస్కృతంలోకి అనువదించి ఉత్తరప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వ పురస్కారాన్ని పొందారు. స్వాతంత్రోద్యమ ఇతివృత్తాన్ని తీసుకొని సంస్కృతంలో 'సుసంహత భారతం' అను నాటకాన్ని రచియించి దీనికి కూడా ఉత్తరప్రదేశ్ ప్రభుత్వ పురస్కారాన్ని పొందారు. వరంగల్లులో ఉద్యోగం చేస్తున్నప్పుడే రాఘవ శతకం, కుమతీ శతకం అను రెండు శతకాలను రచించారు. 1965లో హైదరాబాద్‌లోని ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని ఆర్ట్స్ కాలేజిలో సంస్కృత ఉపన్యాసకునిగా ప్రవేశించి 'లఘు సిద్ధాంతకౌముది'ని అనువదించారు. దాదాపు ఎనిమిదికి పైగా అలంకార శాస్త్ర గ్రంథాలను తెలుగులోకి అనువదించారు. సంస్కృతంలో సుమారు 45 గ్రంథాలను, తెలుగు వ్యాఖ్యానాలతో సంస్కృత గ్రంథాలను నలభైఐదింటిని, తెలుగులో ఇరవైఐదు గ్రంథాలను, హిందీలో రెండు గ్రంథాలను, ఇంగ్లీషులో రెండు గ్రంథాలను రచించారు. 'శ్రీమద్రామాయణం'ను బాలనందిని వ్యాఖ్యతో దాదాపు పదివేల పుటల మూలానుసారంగా అనువదించారు. కౌటిల్యుని అర్థశాస్త్రం, భరతుడి నాట్య శాస్త్రం సంపూర్ణంగా తెలుగులోకి అనువదించారు. 'బ్రహ్మసూత్ర శాంకరభాష్యం', 'భగవద్గీతా శాంకరభాష్యం', 'సర్వదర్శన సంగ్రహం', 'శాస్త్రసిద్ధాంత లేశ సంగ్రహం' లాంటి అనేక సంప్రదాయ గ్రంథాలకు పుల్లెలవారు చేసిన వ్యాఖ్యానం, అనువాదం తెలుగునాట విస్తృతంగా ప్రచారంలో ఉన్నాయి.

పుల్లెలవారి జీవితంలో 'మహామహోపాధ్యాయ'ను లాల్‌బహదూర్ శాస్త్రి సంస్కృత విద్యాపీఠం, ఢిల్లీ నుండి, 'వేదాంత విశారద' ను మద్రాసు సంస్కృత కళాశాల నుండి, ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం నుండి రెండుసార్లు సంస్కృత పురస్కారాలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పురస్కారం, రాష్ట్రపతి పురస్కారం, భారత ప్రభుత్వంచేత పద్మశ్రీ, విశ్వభారతి పురస్కారం లాంటి అనేక పురస్కారాలు పుల్లెల రామచంద్రుడు గారిని వరించాయి. 2015 జూన్ 27న హైదరాబాదులో అనారోగ్యంతో మరణిం చేంతవరకు సంస్కృత సాహితీ వ్యవసాయం చేస్తూనే వచ్చారు.

సీ॥ సంస్కృత శబ్దశాస్త్రజ్ఞ గణనమునం
దగ్రగణ్యుండవై యలరినావు
సాహిత్య శాస్త్రవిశాల వీథులయందుఁ
దెలుఁగు వెలుంగువై నిలిచినావు
వ్యాఖ్యాతృసంతతిలో ఖ్యాతి సాధించి
పాఠకబంధువై వరలినావు
గీర్వాణకవిలోక సార్వభౌముండవై
భద్రయశమ్ముఁ జేపట్టినావు

గీ॥ నీదు ప్రతిభామహత్త్వమ్ము నిఖిలగతుల
విస్తరించిన దీ మహావిశ్వమందు
సకలజనగణ మాశ్చర్యజలధి మునుఁగ
రమ్యగుణసాంద్ర! పుల్లెల రామచంద్ర!! 1

క॥ పుల్లెల శ్రీరామా! మా
యుల్లములందుఁ జిరకాల ముండుదు వయ్యా!
సల్లలితవచోమధువులు
సల్లుచు భవదీయ సుకృతిసంతతితోడన్. 2

తే॥గీ॥ తెలుఁగురాష్ట్రాలచదువులవెలుఁగు నీవు
కావ్యరసలోక నవరీతికాంతి వీవు
పరమసంతోషదాయక గురువు నీవు
రమ్యగుణసాంద్ర! పుల్లెల రామచంద్ర!! 3

తే॥గీ॥ ఇంచుమించుగా నీవు నిర్మించినావు
రెండు వందల గ్రంథాలు ప్రీతితోడఁ
దెలుఁగు పాఠకలోకము పులకరింప
రమ్యగుణసాంద్ర! పుల్లెల రామచంద్ర!! 4

తే॥గీ॥ సంస్కృతాంధ్రాంగ్లహిందీభాషలను నేర్చి
యెల్లవిబుధులు శ్లాఘించుకృతులు కూర్చి
వాసికెక్కితి వీవు విశ్వాన నిజము
రమ్యగుణసాంద్ర! పుల్లెల రామచంద్ర!! 5

క॥ సురలోక గురువుతోడను
సరస కళాగోష్ఠి నెఱప సాగితి వీ వో
పరుమగుణాకర! పుల్లె
వరవంశాంబోధిచంద్ర! పండితచంద్రా!! 6

ఉ॥ పుస్తకరూపముల్ గలిగి భూరిమహత్త్వము నీది నిల్చె నో
శస్తమనీషి! యాభువిని సర్వజనప్రియపద్ధతిన్' మతిన్
నిస్తుపాండితీమహిమ నికొనంగఁ దంచు పాఠకుల్
మస్తకమందు నీకృతుమాలు మాటికి నిల్పుకోవలెన్. 7

- రచయిత శ్రీ కుర్రా జితేంద్రబాబు
పరిశోధకులు, విమర్శకులు
ఫోను: 9848882600

తెలుగమ్మ ఒడిలో
బౌద్ధం - 8

# విద్యా, విజ్ఞాన వికాసాలకి నిలువుటద్దం తెలుగునాట బౌద్ధం

- బొర్రా గోవర్ధన్

"అమరావతీ పట్టణమున బౌద్ధులు
విశ్వవిద్యాలయములు స్థాపించునాడు"

అని ఎలుగెత్తి చాటాడు రాయప్రోలు సుబ్బారావుగారు. నిజం కూడా ఇదే! బౌద్ధం అనగానే అందరికీ ముందుగా గుర్తొచ్చేది విద్యే. విద్యావ్యాప్తికి బౌద్ధం చేసిన కృషిని చరిత్ర శిలాక్షరాలతో లిఖించింది. శిల్పం, చిత్రలేఖనం, విద్య, వైద్య రంగాలు మూడు పూవులు ఆరుకాయలుగా ఇటు తెలుగు నేలలోనే కాదు, అటు భరతఖండంలోనే కాదు, యావత్ ప్రపంచంలో వర్ధిల్లాయి అంటే అది బౌద్ధం వల్లే. అందుకే అందరూ బౌద్ధాన్ని ఒక వైజ్ఞానిక తత్త్వంగా కొనియాడతారు.

'జ్ఞానం', 'విద్య', 'విజ్ఞానం' అనే పదాలు
బౌద్ధ సువాసనలు వెదజల్లే పదాలే.

**విద్య అంటే** :'విద్' అనే ధాతువునుండి ఇది ఏర్పడింది. దీనర్థం 'తెలుసుకోవడం'.అని.

విద్ 'లాభే' – అంటే లభించేది,

విద్ 'జ్ఞానే' – అంటే జ్ఞానాన్ని కలిగించేది,

విద్ 'చేతనే', – అంటే చైతన్య పరిచేది,

విద్ 'ఆఖ్యానే' – అంటే తప్పుడు అభిప్రాయాల్ని నిరోధించేది,

విద్ 'నివాసే – అంటే విలువల్ని పెంచేది అని అంటారు.

మనం ఏ విషయాన్నైనా 'తెలుసుకుంటే' మనకు తెలివి కలుగుతుంది. తెలివి ఉంటే వర్తమానంలో సక్రమంగా జీవిస్తాం. భవిష్యత్తులో ఉన్నతంగా రాణిస్తాం.

మనం ఇప్పుడు తెలుసుకునేది 'గత' కాలంనాటి విషయమే గదా! అంటే గతాన్ని గురించి, దాని అనుపానాల గురించి తెలుసుకుని వర్తమానంలో గడుపుతూ, భవిష్యత్తుకు బాటలు తీయడమే 'తెలుసుకోవడం' వల్ల కలిగే ప్రధాన ఉపయోగం. అంటే... విద్య వల్ల కలిగే ఉపయోగం ఇదే!

**తెలివిని తెగనరికిన సంస్కృతి:** ఇలా సమాజంలో అందరూ 'తెలుసుకుంటే', 'విద్యావంతులైతే' సమాజం అంతా ఉన్నతిలోకి అడుగుపెడుతుంది. భవిష్యత్తు అగమ్యగోచరంగా లేకుండా, అందంగా ఉంటుంది. వ్యక్తిగతమే కాదు, సమాజం,దేశం తలెత్తుకు నిలబడుతుంది. ఒక జాతి తన సంస్కృతీ నాగరికతల్ని నిలబెట్టుకుంటుంది. దేశం వెన్నెముక బలపడుతుంది. ఆ జాతి ఎవ్వరి అడుగులకీ మడుగు లొత్తదు. దాసత్వంలోకి పోదు. దాసోహం అవదు. బానిసత్వాన్ని భుజానికెత్తుకోదు.

వెయ్యిపశువులు ఒక మనిషికి ఆధీనం అయినట్లు 'అఖండ' 'సువిశాల' మైన ఈ దేశం, 'మ్లేచ్ఛులు.....మ్లేచ్ఛులు' అని చెప్పుకునే వారి చెప్పుచేతల్లోకి పోయింది. ఇందుకు కారణం ఎవరు? ఏమిటి? వంద రకాలుగా, చర్చించుకున్నా చివరికి తేలే విషయం ఒక్కటే. ఈ దేశం 'విద్యావంతమైంది' కాకపోవడమే. అనాగరక, ఆటవిక మూఢనమ్మకాల్లో మునిగి పోవడమే!

మరలా మనం ప్రశ్నించుకోవాలి. ఇలా మునిగిపోవడానికి కారణం ఎవరు? – అని. అందుకు కోటి కారణాలు వెతుక్కున్నా– అసలు సిసలైన కారణం – 'విద్య' ఈ దేశంలో అందరికీ అందకపోవడమే! అందుకోడానికి ప్రయత్నించిన వారిని 'అంతం' చేయడమే. ఒకే ఒక్క వైదిక పురుష వర్గానికి తప్ప వైదికేతరులకి అక్షరం అందడం పరమ పాపంగా భావించడమే! అంటే నూటికి తొంభై ఐదు మంది చీకటిలో పడి ఉంటే.... ఉన్న ఆ నలుగురైదుగురు ఈ దేశాన్ని, ఈ దేశ సంస్కృతిని, ఈ దేశ సార్వభౌమాధికారాన్ని ఎలా కాపాడగలుగుతారు? నూతన నాగరికతను ఎలా నిర్మించగలుగుతారు? –

ఈ అవిటితనాన్నుండి , పుట్టుకతో వచ్చిన ఈ పోలియో వ్యాధి నుండి కాపాడింది బౌద్ధమే. దేశంలో విద్యావ్యవస్థ తలను తొలినాడే వైదికం తెగ నరికితే, తలెత్తుకు తిరిగేలా చేసింది బౌద్ధమే.

**బౌద్ధం – విద్య:** బౌద్ధం కులవ్యవస్థను అంగీకరించలేదు. కులాల పేరుతో సాగిన అంటరానితనాన్ని ఒప్పుకోలేదు. హెచ్చుతగ్గులవల్ల సమాజంలో తలెత్తిన న్యూనతాభావాల నుండి సమాజాన్ని కాపాడ్డానికి పూనుకుంది. ముఖ్యంగా విద్య సమాజంలో అందరికీ అందేలా చేసింది. బౌద్ధ సంఘంలో చేరిన వారందరూ తప్పని సరిగా చదువుకోవాల్సిందే! ఈ సంఘంలో చేరిన వారికి, చేరడంతోనే కులాల గుర్తింపు రద్దవుతుంది. ఇంటిపేర్లు, ప్రాంతీయపేర్లు, కులం పేర్లు ఇలాంటి ప్రత్యేక గుర్తింపులున్న పేర్లన్నీ రద్దవుతాయి– 'సంఘరక్షిత, ధర్మరక్షిత, ధర్మకీర్తి, శాసన రక్షిత, ఆనంద 'ఇలాంటి పేర్లు వస్తాయి. ఈ పేర్ల చివరగానీ, మొదట్లోగానీ, మధ్యలోగానీ వారికి సంబంధించిన కుల, మత, ప్రాంత ఆచూకీలేవీ కన్పించవు. కాబట్టి అందరూ విద్యను సమాన స్థాయిలో నేర్వాల్సిందే!

బౌద్ధం ఎంత గొప్ప విద్యావకాశాల్ని దిగువ కులాలవారికి అందించిందో 'ఉపాలి' ఉదంతం ఒక్కటి చాలు.

**ఉపాలి ఉదంతం:** ఉపాలి బుద్ధుని వంశం ( క్షత్రియ) వారికి తలలు గొరిగే మంగలి. శాక్యుల ఆస్థాన క్షురకుడు. కానీ, బౌద్ధసంఘంలో చేరాడు. విద్య, నైతిక, క్రమశిక్షణల్లో రాణించి మేటిగా నిలిచాడు. బుద్ధుని నిర్వాణానంతరం జరిగిన మొదటి 'బౌద్ధసంగీతి'లో ఓ అగ్రస్థానం అధిరోహించాడు. బౌద్ధ సాహిత్య మూల గ్రంథాలైన 'త్రిపిటక' గ్రంథ రచనా సంఘానికి అధ్యక్షుడయ్యాడు. వినయ పిటకానికి సారథిగా నిలిచాడు. నిజానికిది భారత రాజ్యాంగ రచనలో అంబేద్కర్‌కి దక్కిన గౌరవానికి మించిన గౌరవమే! ఎందుకంటే క్రీ.పూ. రెండున్నరవేల సంవత్సరంనాడు ఇప్పటికంటే అప్పుడు వైదిక భావజాలం బలం చాలా

బలీయంగా ఉండేది కాబట్టి.

'అందరికీ విద్య నేర్పడానికి' బౌద్ధం ఎంతటి ప్రతిఘటనల్ని ఎదుర్కొందో!

**వైజ్ఞానిక బౌద్ధ భారతం:** బుద్ధుని కాలానికే 'తక్షశిలలో' విశ్వ విద్యాలయం ఉంది. బుద్ధునికి సమకాలీనుడైన మహావైద్యుడు 'జీవకుడు' ఈ తక్షశిల విద్యార్థే.

ఆ తర్వాత... నలంద, విక్రమశిల విశ్వవిద్యాలయాలు ఉత్తర భారతదేశంలోని ప్రసిద్ధ విద్యాకేంద్రాలు. ఈ రెండూ ఈనాటి బీహార్ లోనివే. బీహార్ అంటేనే 'బౌద్ధ విహార్' అని. 'విహార్'అనే పదమే కాలక్రమంలో 'బీహార్'గా రూపాంతరం చెందింది. అనలు విహారాలంటేనే బౌద్ధ విద్యాలయాలు. గురుకులాలు. పై రెండూ కాక నేటి గుజరాత్ ప్రాంతంలో 'ఓదంతపురి' విశ్వవిద్యాలయం ఉంది. అదీ బౌద్ధ విశ్వవిద్యాలయమే.

నలందా విశ్వవిద్యాలయంలో ఆనాడే ఏడు ప్రత్యేక విభాగాల్లో విద్యాబోధన ఉండేది. గణితం, ఖగోళం, శిల్పం, చిత్రలేఖనం, వ్యాకరణం, రసాయనశాస్త్రం, ఇలాంటి ప్రత్యేక విభాగాలుండేవి. గణిత, ఖగోళ శాస్త్రవేత్త ఆర్యభట్ట ఈ విశ్వవిద్యాలయ విద్యార్థి, ఆచార్యుడు, చివరికి కులపతి కూడా. ఆర్యభట్ట బౌద్ధుడు. వరాహమిహిరుడు, రెండోభాస్కరుడు కూడా బౌద్ధులు అంటారు. వీరుకూడా ఈ విశ్వవిద్యాలయం నుండి బైటకొచ్చిన వారే.

అలాగే... జీవకుని తర్వాతివారైన చరకుడు, సుశ్రుతుడు కూడా బౌద్ధభిక్షువులేనని కొందర చారిత్రకుల అభిప్రాయం. వీరి సమకాలీనుడైన వాగ్భటుడు గొప్ప వైద్యుడు. బౌద్ధుడు. ఈయన రాసిన గ్రంథం 'అష్టాంగ హృదయం'. దీన్నే వాగ్భటీయం అంటారు. వీరికి పూర్వీకుడైన జీవకుడు గొప్ప వైద్య శిఖామణి. తరగని ఆయుర్వేద గని. ఈయన కడుపులో కణుతుల్ని, తలలో కణుతుల్ని శస్త్రచికిత్స చేసి తొలగించిన ఉదంతాలు వినయపిటకంలో ఉన్నాయి. అంతేకాదు ఆయన ఒక గొప్ప ఎముకల వైద్యుడు కూడా. స్వయానా విరిగిన బుద్ధుని కాలి ఎముకల్ని సరిజేసి, కట్టుకట్టిన ఉదంతం ఉంది.

ఈనాడు మనం గణిత శాస్త్రానికి జీవంగా చెప్పుకునే '0' (సున్న)ను కనుగొని, సంఖ్యలకి స్థానవిలువలు కల్పించింది కూడా బౌద్ధ గణిత విద్వాంసులే. మనం చెప్పుకునే 'అనంతం' 'అచింత్యం' 'అమేయం' అనే సంఖ్యల్ని, లక్షలు, కోట్లు స్థాన విలువల్ని రూపొందించిందీ బౌద్ధ గణిత వేత్తలే! క్రీ.పూ. 3వ శతాబ్ది గ్రంథమైన లలిత విస్తరంలో బౌద్ధ గణిత శాస్త్ర విశ్వరూపం దర్శనమిస్తుంది.

ఇక బౌద్ధుల ఖగోళవిజ్ఞానం గురించి వెయ్యిపేజీల పుస్తకమే రాయొచ్చు. ఈ శాస్త్రంలో ఆయనాంశాల్ని, విషవత్తుల్ని, భూమి విష్వత్ చాలనాల్ని గుర్తించిన వైనం బౌద్ధ 'నిదానకథ'లో దర్శన మిస్తుంది. అబ్బుర పరుస్తుంది. విశ్వంపుట్టుక, భూమి పుట్టుక, నేల ఏర్పడడం, జీవజాతులపుట్టుక, ఆదిమ కమ్యూన్ వ్యవస్థ, కుటుంబాల పుట్టుక, నేల పంపిణీ, రాజ్యాల పుట్టుక, దోపిడీ, రాజ్యాంగాల పుట్టుక వరకూ ఉన్న పరిణామమంతా దీర్ఘనికాయం లోని అగ్గణ్ణిసుత్తం లో ఉంది.

అంటే వైద్య, గణిత, ఖగోళ శాస్త్రాల్లో బౌద్ధుల పాత్ర ఎంత గణనీయమైనదో తెలుస్తుంది.

అలాగే... ఆచార్య నాగార్జునుని 'రసవాదం' రసాయన శాస్త్రానికే తొలిబీజం. నలందా విశ్వవిద్యాలయంలో రసాయనశాస్త్రం బోధించే గదుల నిర్మాణం, బున్‌సెన్ జ్వాలకాలూ, ఒక చోటనుండి అనేక చోట్లకు ఉష్ణప్రసారం జరిగే విధానం ఆధునిక విధానాలను తలపిస్తుంది.

ఈ దేశం గొప్ప 'వైజ్ఞానిక దేశం' అని మనం గత కాల ప్రాభవాల్ని గురించి చెప్పుకునేది 'బౌద్ధయుగం' గురించే. చదివితే నాలుక కోస్తాం, వింటే చెవుల్లో సీసం పోస్తాం, చూస్తే కళ్ళు పీకేస్తాం, అనే అమానవీయ సంప్రదాయం రాజ్యమేలిన యుగాన్ని గురించి మాత్రం కాదు.

ఇంతగొప్ప విద్యాప్రమాణాల్ని నెలకొల్పిన బౌద్ధం మన తెలుగు నేలమీద ఏం చేసింది?

**తొలి విశ్వవిద్యాలయాలు:** నిజం చెప్పాలంటే... మనం ఉత్తర భారత దేశంలో చెప్పుకొన్న నలంద, ఓదంతపురి, విక్రమశిల విశ్వ విద్యాలయాల కంటే పూర్వమే అమరావతిలో విశ్వ విద్యాలయం ఉంది. అంటే... తక్షశిల తర్వాత భరతఖండంలో నెలకొల్పిన విశ్వవిద్యాలయం ఇదే! అమరావతి విశ్వవిద్యాలయంలో ఎన్ని శాస్త్ర విభాగాలు ఉండేవో తెలియలేదు. కానీ.... 14 దేశాలవారు ఇక్కడ చదివేవారని తెలుస్తోంది. గాంధార, కాశ్మీర, చీనా, చిలాత, తోసలి, అపరాంత, వంగ, వనవాసి, యవన, తమిళ, పాలూర, శ్రీలంక – మొదలైన దేశాలవారు ఇక్కడికొచ్చి విద్య నేర్చేవారు.

ఆ తర్వాత నెలకొల్పిన నాగార్జునకొండలో మరో విశ్వవిద్యాలయం కూడా దేశ విదేశ విద్యార్థులతో కిటకిటలాడింది. నాగార్జున విశ్వవిద్యాలయ నిర్మాణం నలందా విశ్వవిద్యాలయాన్ని పోలి ఉంటుంది. అక్కడి గదులు, తరగతుల గదులు, విద్యార్థుల వసతిగృహాలు, ఆట స్థలాలు అన్నీ నలందను పోలి ఉంటాయి. ఆ శిథిలాలు ఇప్పుడు మనం 'అనుపు'లో చూడగలం.

మనకు తెలియకపోయినా నలందాలో ఉన్న విజ్ఞాన విభాగాల్లో ఒకటి రెండు మినహా దాదాపుగా అన్ని విభాగాల్నీ మన తెలుగు నేలమీది విశ్వవిద్యాలయాల్లో నేర్పేవారే అనడం అసత్యం కాబోదు.

బుద్ధుని తర్వాత రెండో బుద్ధునిగా పేరు పొందిన నాగార్జునితోపాటు, బౌద్ధతాత్త్విక ప్రపంచ ధృవతారలైన అతి కొద్ది మందిలో ఏడుగురు తెలుగువారు కావడం వెనుక, ఈ బౌద్ధ విశ్వవిద్యాలయాల కృషి ఎంతో ఉంది. అంతేకాదు, దేశవిదేశాల్లో బౌద్ధాన్ని వ్యాపింపచేసిన భిక్షువుల్లో కూడా నూటికి ఎనభైమంది తెలుగు భిక్షువులే. దీనికి కూడా ఈ విద్యాలయాల కృషే ప్రధాన కారణం.

**బౌద్ధ తాత్త్విక దిగ్గజాలు:** బౌద్ధ తాత్త్విక జగతిలో ధృవతారల్లా వెలిగిపోయి, దిగ్గజాల్లా నిలిచిపోయిన 1. ఆర్యదేవుడు (పొన్నూరు), 2. బుద్ధపాలితుడు (కంచికచర్ల), 3. భావవివేకుడు (మంగళగిరి), 4. ధర్మకీర్తి (తిరుపతి), 5.దిగ్నాగుడు (గుంటుపల్లి), 6. బోధి ధమ్ముడు (అమరావతి) వీరంతా మన తెలుగు నాట ప్రభవించిన బౌద్ధ వైజ్ఞానిక వెలుగులే!

ఆనాడు విద్యావిధానం మొత్తం 3 విధానాల్లో సాగేది.

**1.పారలౌకిక విద్యలు:** పరలోకాలకీ, మూఢనమ్మకాలకీ, మత విశ్వాసాలకీ సంబంధించిన విద్యను బోధించే విద్యలు. ఇవి మార్మిక

# తెలుగుభాష రక్షణకై మధిరలో సదస్సు

**మ**హాకవి గురజాడ అప్పారావుగారి జన్మదినం సందర్భంగా 21-9-2015న మధిర శ్రీనిధి డిగ్రీ కళాశాలలో 'తెలుగు భాష రక్షణ – అభివృద్ధి' అంశంపై సదస్సు జరిగింది. విశ్రాంత ఉపాధ్యాయుడు కాలం వీరభద్రరావు ఆతిథ్యంలో 'తెలుగు భాషోద్యమ సమాఖ్య' మరియు 'గురుదక్షిణ ఫౌండేషన్' ల ఆధ్వర్యంలో జరిగింది. శ్రీనిధి విద్యాసంస్థల కార్యదర్శి బి. అంజన్‌బాబు అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమంలో తె.భా.సమాఖ్య కేంద్ర మండలి ప్రతినిధి పారుపల్లి కోదండ రామయ్య తెలుగు భాష ప్రాముఖ్యతను, భాషను బ్రతికించుకోవాల్సిన ఆవశ్యకతను వివరించారు. రచయిత శాగంటి



కృష్ణమూర్తి భాష అందాలను రాగయుక్తంగా ఆవిష్కరించారు. తె.భా.సమాఖ్య మధిరశాఖ బాధ్యులు మాధవరపు నాగేశ్వరరావు 28-8-2015న గుంటూరు సభలో తీర్మానించిన పది నిక్కచ్చులను (డిమాండ్లను) తెలిపారు. తెలుగు భాషా విధానంపై రెండు తెలుగు ప్రభుత్వాల అలసత్వాన్ని ఎండగట్టారు.

గురుదక్షిణ ఫౌండేషన్ అధ్యక్షులు చేకూరి కాశయ్య, విశ్రాంత ప్రిన్సిపాల్ కర్నాటి రామ్మోహనరావు, రామిశెట్టి రోశయ్య, పారుపల్లి వెంకటేశ్వరరావు, రంగస్థల కళాకారుల సంఘం అధ్యక్షుడు పుతుంబాక శ్రీకృష్ణప్రసాద్, హైకోర్టు అడ్వకేటు ఎ.వి. రమణారావు, కళాశాల ప్రిన్సిపల్ అనిల్ కుమార్ ప్రసంగించారు.

ఈ సదస్సులో కళాశాల విద్యార్థులు, వివిధ రంగాల ప్రముఖులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా సభ ప్రతినిధులందరూ ఏకగ్రీవంగా గుంటూరు నిక్కచ్చులను బలపర్చారు. న్యాయస్థానాల్లో కూడా తెలుగును ఉపయోగించాలన్న రామిశెట్టి రోశయ్య ప్రతిపాదనను కూడా చేర్చారు. సాయంత్రం టివిఎం. ప్రభుత్వ పాఠశాల, అవగాహన సదస్సు విద్యార్థులనుద్దేశించి నిర్వహించారు.

ఇటువంటి సదస్సులు రెండు తెలుగు రాష్ట్రాల్లో అన్నిచోట్లా జరగాలి. ఐక్యంగా ఉద్యమించి, ప్రభుత్వాల మెడలువంచి, అమ్మనుడి'ని రక్షించుకొని, అభివృద్ధి దిశగా సాగుదాం.

విద్యలు. ఈ విద్యలకి బౌద్ధం బహు దూరం. బౌద్ధం ఆత్మనీ, పరలోకాన్నీ, మూఢనమ్మకాల్నీ, ఎప్పటికీ మారనివి' అని చెప్పుకునే విశ్వాసాలనీ ఒప్పుకోదు. కాబట్టి బౌద్ధ విద్యాలయాల్లో ఈ విద్యలు బోధించేవారు కాదు.

**2. తాత్త్విక విద్యలు:** తాత్త్విక విద్యలంటే దర్శనాలు. కార్యకారణ సంబంధాన్ని, ప్రమాణాల్ని (ప్రత్యక్ష, అనుమాన, శబ్దం మొదలైన ప్రమాణాలు) బోధించే ఫిలాసఫీ. బౌద్ధ విశ్వవిద్యాలయాల్లో ఈ బోధనలు ఉండేవి. ముఖ్యంగా బౌద్ధ తత్త్వానికి సంబంధించిన సైద్ధాంతిక విషయాలమీద ప్రత్యేక శిక్షణ ఉండేది. బౌద్ధ పిటకాల మీద మాస్టర్ డిగ్రీలు ఇచ్చేవారు. ఉదాహరణకి, వినయపిటకంలో నిష్ణాతుడైతే 'వినయధరుడు' అనీ, ఇంకా విశేష నిష్ణాతుడైతే 'మహావినయధరుడు' అనీ గుర్తించేవి. ఇవి ఎం.ఎ, పి.హెచ్‌డీ లాంటివి.

**3. వైజ్ఞానిక విద్యలు:** మనం ముందే చెప్పుకొన్నట్లు బౌద్ధం విజ్ఞానానికి పెద్దపీట వేసింది. ఈ విభాగంలో గణితం, ఖగోళం, రసాయనం, శిల్పం, చిత్రలేఖనం, జ్యామితి, సాంకేతికం (ఇంజనీరింగ్) మొదలైన శాస్త్రాలు ఈ కోవలోకి వస్తాయి. పైన చెప్పిన శాస్త్రాలన్నిటినీ బౌద్ధ విశ్వవిద్యాలయాలు బోధించాయి. వైజ్ఞానిక వ్యాప్తికి దోహదం చేశాయి.

అందుకే బౌద్ధ శిల్పకళలో శ్రేష్ఠమైన 'అమరావతి' శిల్పకళ, ప్రపంచ ప్రఖ్యాతిగాంచింది. బౌద్ధస్థూపాల్లో భారతదేశంలోకెల్లా అతి విశాలమైన స్థూపంగా పేరుపొందిన స్థూపం అమరావతి స్థూపం. దాని నిర్మాణంలో ఉపయోగించిన సాంకేతిక శాస్త్ర పనితనం మన వైజ్ఞానిక ప్రగతిని సూచిస్తుంది, చెప్పకనే చెబుతుంది.

ఒక్కమాటలో చెప్పాలంటే... ఆ ప్రభావం ఈ నేలమీద ఇంకా ఇంకిపోకుండా... తెలుగువారి ఖ్యాతిని ఈనాటికీ ప్రపంచంలో నిలబడేలా చూస్తూనే ఉంది. విద్యాకేంద్రంగా తెలుగు నేల ఈ నాటికీ విరాజిల్లుతుందంటే అది ఆనాటి బౌద్ధ విశ్వవిద్యాలయాలు వేసిన మార్గమే!

బౌద్ధాన్ని గుర్తుకుతెస్తూ ఈ నాటికీ 'సిద్ధార్థ', 'గౌతమ', 'నలంద', 'అమరావతి', 'విక్రమశిల', 'నాగార్జున' మొదలైన పేర్లతో మన తెలుగునాట ఎన్నో వేల విద్యాలయాలు అలరారుతున్నాయి.

అందుకే... తెలుగునాట బౌద్ధం, విద్యా విజ్ఞాన వికాసానికి నిలువుటద్దం!

**రచయిత శ్రీ బొర్రా గోవర్ధన్ ఉపాధ్యాయుడు, కవి,**
**నగరం (గుంటూరు జిల్లా) ఫోను : 9390600157**

సంస్మరణ

చీకటినుంచి వెలుగు వెల్లువ....

# జ్యోతిబాఫూలే!

– పుప్పల నరసింహం



తమసోమా జ్యోతిబా ఫూలే... అనడం పొరపాటు అవదు. చీకటినుంచి వెలుగు వెల్లువ (తమసోమా జ్యోతిర్గమయు...) వైపు చూసినవాడాయన, నడచినవాడాయన. జ్ఞానానికి పెద్దపీట వేశాడు. మానవ జీవితాన్ని ఏది నడిపిస్తున్నదో... దాన్ని దర్శించిన క్రాంతికారుడు... దార్శనికుడు... వైతాళికుడు... చింతనాపరుడు. అందుకే ఆయన జ్ఞానపక్షపాతి అయ్యాడు. గొప్ప ఆలోచనాపరులందరూ జ్ఞానాన్ని ప్రేమించినవారే... దాన్ని పదిమందికి పంచడానికి ప్రయత్నించినవారే. జ్యోతిరావు ఫూలే ఆ కోవకు చెందినవాడు.

కాకతాళీయమో అదేమిటో గాని జ్యోతిబాఫూలే, అంబేద్కర్ ఇరవురూ ఏప్రిల్ నెలలోనే పుట్టారు. మహారాష్ట్రలోని సతారాలో ఇద్దరూ పెరిగారు. జ్యోతిబా భార్యపేరు సావిత్రిబాయి, అంబేద్కర్ రెండవ భార్యపేరు సవిత... జ్యోతిరావుకు బ్రాహ్మణ సంపర్కంతో జీవనం మలుపు తిరిగింది. అంబేద్కర్‌కూ అంతే! అలాగే జ్యోతిబా సత్యశోధక సమాజ్‌ను, అంబేద్కర్ సమతాసైనికదళ్‌ను స్థాపించారు. ఇద్దరూ సంఘ సంస్కర్తలుగా గుర్తింపు పొందారు.

తొలి స్వాతంత్ర్య సమరం అంటే 1847 లోనే ఫూలే స్థానిక స్కాటిష్ మిషన్‌కు చెందిన హైస్కూలు విద్యను పూర్తిచేశాడు. అప్పటికే 'థామస్ పైనే' రచించిన 'రైట్స్ ఆఫ్ మ్యాన్' చదివి ప్రభావితుడయ్యాడు. మరాఠా వీరుడు శివాజీ, అమెరికా స్వాతంత్ర్య సమరయోధుడు జార్జివాషింగ్టన్ జీవిత చరిత్రలను చదివి ఉత్తేజితుడయ్యాడు. అక్కడినుండి ఆయన వెనక్కి తిరిగి చూడకుండా ముందుకే పయనమయ్యాడు. ఫూలే వెనుకబడిన 'మాలి' సామాజిక వర్గానికి చెందినప్పటికీ సంఘపరంగా అంటరానితనం విశృంఖలంగా ఉన్నా బ్రాహ్మణ మిత్రులతో కలిసి మెలిసి తిరిగాడు. ఆస్వేచ్ఛను కొంతమేర అనుభవించాడు. అదే బ్రాహ్మణ మిత్రుని వివాహంలో పాల్గొన్న సందర్భంగా కరుడుగట్టిన బ్రాహ్మణ పెద్దల దురుసుతనం వల్ల అతని మనసు కల్లోలం చెందింది. అప్పుడే తన కర్తవ్యమేమిటో బోధపడింది. చదువు... జ్ఞానం... జ్ఞానంతో జీవనం మెరుగు... ఇదే ఆయన సిద్ధాంతమైంది. రైట్స్ ఆఫ్ మ్యాన్ సాధించేందుకు నడుంబిగించాడు. శివాజీలా, వాషింగ్టన్‌లా ఉద్యమించాడు.

కేవలం మగవారు చదివితే సరిపోదు. ఆకాశంలో సగంగా ఉన్న మహిళలు చదువుకోవాలని తలచాడు. 19వ శతాబ్దంలో ఈ ఆలోచన విప్లవాత్మకమైనది. ఆడపిల్లలకు చదువును ఊహించని కాలమది. అయినా దూరదృష్టితో, తాను నమ్మిన, విశ్వసించిన సమాజం, అదీ మెరుగైన సమాజం ఏర్పడాలంటే బాలికలు చదవాల్సిందే! అని దేశంలోనే తొలి బాలికల పాఠశాలను ప్రారంభించాడు.

ఆనాటి సామాజిక ఆచారాల ప్రకారం జ్యోతిరావు ఫూలేకు 13వ ఏటనే పెళ్ళయింది. బాలికలకువిద్య అని బయల్దేరిన జ్యోతిబా తన భార్య సావిత్రిబాయిని చదివించాడు. పెళ్లికిముందు చదువుకోవడం కుదరని కాలంలో పెళ్ళయిన తన భార్యకు విద్యను అందించి ఎందరికో ఆదర్శంగా నిలిచాడు. భర్తకు తగ్గ భార్యగా ఆమె జ్యోతిరావు ఫూలే చెప్పిన విధంగా నడుచుకునే స్త్రీ కావడంతో, చదువులో చురుకుదనం ప్రదర్శించడంతో జ్యోతిరావు ఫూలే పని ఎంతో సులువయింది. తొలి విజయాన్ని తన ఇంట్లోనే సాధించాడు. బాలికలకోసం ప్రారంభించిన పాఠశాలలో భార్య సావిత్రిబాయి పాఠాలు చెప్పడం ప్రారంభించడంతో సభ్యసమాజం ముక్కుమీద వేలేసుకుంది. జ్యోతిబామాత్రం మీసం తిప్పాడు. అనేక కారణాలవల్ల ఆ పాఠశాల చాలాకాలం కొనసాగలేదు. వివిధ సామాజిక వర్గాలకు చెందిన పిల్లలు ఒకే బడికి రావడం, కులం గోడలను పక్కన పెట్టే ప్రయత్నం చేయడంతో క్రిస్టియన్, ముస్లిం మరికొంతమంది దృష్టిలో జ్యోతిరావు ఫూలే పడ్డాడు. కొంత ప్రాచుర్యం లభించింది. ఈ నైతిక బలాన్ని కూడదీసుకుని కొంతకాలానికి గతంలోకన్నా పెద్ద బాలికల పాఠశాలను ప్రారంభించాడు. ఎక్కువమంది ఆడపిల్లలు రాసాగారు. అది పెద్ద విప్లవాత్మక చర్య. ఆడపిల్లలు పాఠాలు సులభంగానే గ్రహించడంతో మరిన్ని పాఠశాలలు ప్రారంభించేందుకు ఫూలే పూనుకున్నాడు.

పిల్లల చదువు సరే, మరి పెద్దల మాటేమిటి?... పురుషుల, మహిళల పరిస్థితులేమీ ఆశాజనకంగా లేవు. అనేక అవమానాలు, అస్పృశ్యత, వివక్ష. వీటిని అంతమొందించడానికి, వారిని చైతన్య పరచడానికి 'సత్యశోధక సమాజం'ని స్థాపించాడు. నిజమైన తిమిరంతో సమరం అప్పుడు ప్రారంభమైంది. ఇది అంబేద్కర్ పుట్టడానికి రెండు దశాబ్దాల క్రితపునాటి మాట. సతారా ప్రాంతంలో సితారగా ఫూలే వెలుగొందాడు. జ్ఞాన తంత్రులను మీటుతూ తిరిగాడు. చదువువల్ల అవగాహన, అవగాహన కారణంగా ఆలోచన, ఆలోచనలవల్ల తృష్ణ, తృష్ణతో విషయాలు బోధపడటం, జ్ఞానం మెట్లు ఎక్కడం ఆయన కన్న కల. దాన్ని సాకారం చేసుకోవడానికి నిరంతరం శ్రమించాడు. కొన్ని సంవత్సరాల క్రితం హైదరాబాద్ రవీంద్రభారతిలో జ్యోతిరావుఫూలే జీవితంపై ఒక నాటకాన్ని ప్రదర్శించారు. ఆ నాటకంలో ఫూలే తండ్రి గోవిందరావు ఫూలే కొడుకు జ్ఞాన పతాకాన్ని మోస్తూ తిరుగుతుండడంతో కోపంతో 'నా కడుపున బ్రాహ్మణుడిగా పుట్టావు కదరా, మాలి వృత్తివాడికి మాలి ఆలోచనలు చేసేవాడు పుట్టాలిరా... లేకపోతే లోకం బతకనియ్యదురా...' అని విరుచుకుపడతాడు. ఈ మాటలు వాస్తవ జీవితంలో గోవిందరావు అన్నాడో లేదో గాని కొడుకు ప్రవర్తనను, ఆలోచనలను సరిగ్గా పట్టుకుని స్వల్ప మాటలతో అనల్ప అర్థం ధ్వనించేలా ఆ సంభాషణ కొనసాగింది. జ్ఞానం ఆ రోజుల్లో బ్రాహ్మణుల సొంతమన్న భావన ఉండేది. 130 సంవత్సరాల క్రితం భావదారిద్ర్యంగల ప్రాంతంలో పుట్టి పెరిగిన ఫూలే ఆలోచన దాన్ని పటాపంచలు చేసింది. స్థానిక స్కాటిష్ పాఠశాలలో హైస్కూలు విద్యను పూర్తిచేయడమంటే మాటలు కాదు. ఎలాంటి ప్రచార, ప్రసార మాధ్యమాలు లేని రోజుల్లో ఆయన యశస్సు మిగతా ప్రాంతాలకు పాకింది. ఆ సాహసానికి, సేవకు వ్యక్తిత్వానికి నీరాజనాలు పలుకుతూ 'మహాత్మా' అన్న బిరుదును 1888 సంవత్సరంలో ప్రముఖులు అందజేశారు. వీరిలో మధ్యప్రదేశ్‌కు చెందిన మహారాజా కూడా ఉన్నాడు. ప్రజల జ్ఞాన చక్షువులు విప్పారాలని రాజులు... మహారాజుల కాలంలోనే ఆయన విస్పష్టంగా చెప్పి వినుతికెక్కాడు.

ప్రస్తుతం ఫూలేను, అంబేద్కర్‌ను కుల సమీకరణలతోనే సరిపెట్టడం, రాజ్యాధికార మార్గంగా భావించడం ఏమాత్రం సమంజసం కాదు. వారు 'తమసోమా జ్యోతిర్గమయ' లాంటివారు.. జ్యోతుల్లాంటివారు. వారికి వందనం.

**రచయిత – శ్రీ పుప్పల నరసింహం సాహిత్య, రాజకీయ విమర్శకులు. ఫోను: 9985781799**

చదువవలసిన పుస్తకం

ఎం.వి.ఆర్. శాస్త్రి రచన

# "అసలు మహాత్ముడు"




సెప్టెంబరు 14 రాత్రి. నడిరేయి దాటినా నిద్రపట్టలేదు. రాత్రి ఒంటిగంట దాటిపోయింది. లేచి మళ్లీ నాగదిలో బల్లముందు కూర్చున్నాను. పక్కనే ఇటీవల (ఆగస్టు 4న) ఎం.వి.ఆర్. శాస్త్రిగారు నాకు ఇచ్చిన 'మన మహాత్ముడు' పుస్తకం కనిపించింది. చదవడం మొదలు పెట్టాను. నాలుగు గంటలపాటు ఒకే బిగువున చదివాను. ఎన్నో ఆలోచనలు సుడిగుండాలై మనసును అతలా కుతలం చేశాయి.

ఎవరు 'మహాత్ముడు'? ఎవరిని మహాత్ముడని పిలవాలి?! మనమంతా మహాత్ముడని కీర్తిస్తున్న 'మహాత్ముడు' గొప్ప రాజకీయవేత్త అనీ, తనదైనశైలిలో జనామోదాన్ని పొందిన అదృష్టవంతుడనీ ఎప్పుడో స్థిరపడిపోయిన అభిప్రాయం. ఆయనలో ఎన్ని గొప్పదనాలున్నా ఆయన్ను 'మహాత్ముడు' అనడం ఆ పదాన్ని సరిగా అర్థంచేసుకోకపోవడంతోపాటు, కొందరు మేధావులు, ఆయన అనుయాయులు చేసిన ప్రచారమే కారణమని నేను అనుకొంటున్నాను. ఆ బిరుదు బాగా స్థిరపడిపోయింది– 'మహాత్ముడు' అంటే ఎవరు అని అడిగితే 'గాంధీజీ' అని పిల్లలు కూడా చెప్పేంతగా! ఇప్పుడు 'ఎవరు మహాత్ముడు' అనే ప్రశ్న వేసి ఆ కాలంలోనే వున్న మరొక విశిష్టవ్యక్తి స్వామి శ్రద్ధానందను గాంధీగారితో పోలికపెట్టి మార్కులన్నీ స్వామి శ్రద్ధానందకే వేసిన రచయిత ధైర్యాన్ని, విశ్లేషణా ప్రతిభను ఆలోచనాపరులు అభినందిస్తారు.

గాంధీగారు తన జీవితంలో సత్యాన్వేషణకోసం చేశానన్న ప్రయోగాల కంటే – స్వామి శ్రద్ధానందకు తన జీవితంలో ఎదురైన అనుభవాల బలిమి పెద్దది. ఆ 'మహాత్ముడి'కీ ఈ 'అసలు మహాత్ముడి'కీ ఎదురైన మరణంలో పోలిక ఎంత ఉన్నా అది ఇరువురికీ చివరి అనుభవమే. తన ఊహలకూ వ్యూహాలకూ అడ్డువచ్చిన వ్యక్తుల్నీ సందర్భాల్నీ ఆ 'మహాత్ముడు' ఎన్నడూ క్షమించలేదు. ఈ 'అసలు మహాత్ముడి'కి ఎవరిమీదా ద్వేషం కాదుగదా, వ్యతిరేకత అయినా లేదు. తాను అన్వేషించి తెలుసుకొన్న సత్యమార్గంలో తన పనిని తాను చేసుకుపోయేవాడు. అందులో రాజకీయాలకు తావేలేదు. రాగద్వేషాలకు చోటే లేదు. ఆయన నిష్కామ కర్మయోగి, జ్ఞానయోగి.

గాంధీజీ తనను తాను హరిజనోద్ధారకుడుగా ప్రదర్శించుకొన్నా దళిత సమాజంలోని మేధావులుగాని, నేతలు గాని ఆయనకు ఆ 'మన్నన'ను ఇవ్వడానికి ఎన్నడూ ఇష్టపడలేదు. ఆయనను సవర్ణ హిందువుల పక్షపాతిగానే వారు భావించారు. 'అసలు మహాత్ముడి'కి అటువంటి అపకీర్తి ఎన్నడూ కలుగలేదు. ఆయనకెటువంటి కీర్తికండూతి, కపటం లేవు గనుక మొత్తం సమాజం ఆయనను సరిగానే అర్థం చేసుకొంది. చివరకు 'మహాత్ముడు' ఒక 'హిందువు' చేతిలో చనిపోగా, ఈ 'అసలు మహాత్ముడు' ఒక ముస్లిం మతోన్మాది చేతిలో చనిపోయాడు! దీన్నెలా అర్థం చేసుకోవాలి? ఈ పుస్తకాన్ని చదివిన తర్వాత మహాత్ముడుగా కీర్తిస్తున్న గాంధీజీకి ఆ మకుటం ఎందుకు వర్తించదో, శ్రద్ధానందనే అసలు మహాత్ముడని ఈ రచయిత ఎందుకన్నాడో చక్కగా అర్థమవుతుంది. దేశ ప్రయోజనాలను బలిపెట్టి, తన పేరు ప్రతిష్ఠలే గీటురాయిగా నిర్ణయాలు తీసుకొన్న వ్యక్తిని 'మహాత్ముడు' అని ఎలా గుర్తించగలం?! దేశంకంటే తానూ, తన ప్రయోజనాలూ ఎక్కువ అనుకొన్న రాజకీయ నాయకుల హిపోక్రసీని పట్టించుకోకపోతే జాతి ఏమవుతుంది?! ఎన్నివిధాల చూచినా స్వామి శ్రద్ధానంద 'అసలు మహాత్ముడు' అని మనం ఒప్పుకోక తప్పనంత చక్కగా విశ్లేషించారు రచయిత.

రచయిత ఎం.వి.ఆర్.శాస్త్రిని ఒక చింతనశీలిగా, పరిశోధకునిగా, దమ్మున్న రచయితగా ఈ పుస్తకం మరొకమెట్టు ఎక్కించింది. నేను ఇక్కడ పుస్తకంలోని అంశాలను ఒక్కొక్కటీ వివరించి సమీక్ష చేయడంలేదు. స్థూలంగా నా అభిప్రాయాన్ని చదువరులకు చెప్పాలనే ఈ నాలుగు మాటలు వ్రాస్తున్నాను. ఇప్పుడు దీన్ని చదవాలని మీలో ఎవరికైనా అన్పిస్తే వెంటనే కొని చదవండి.

మరొక్కమాట... ఈ పుస్తకాన్ని చదివిన తర్వాత – ఓపిక ఉంటే... కాదు... ఓపిక తెచ్చుకొని, ఈ రచయితే లోగడ రచించిన 'మనమహాత్ముడు' పుస్తకాన్ని కూడా చదివితే చాలు. గాంధీజీ గురించి నిజానిజాలు తెలుసుకోవడానికి, మరొక్కసారి తిరిగి మూల్యాంకనం చేసుకోవడానికి కావలసినంత సమాచారం, విశ్లేషణ మన ముందు పరచుకొంటుంది.

ఆలోచించడానికి భయపడని ప్రతి పౌరుడూ– అతడే వర్గానికి, రాజకీయ పంథాకు చెందినవాడయినా, దేనికీ చెందనివాడయినా – చదివి తీరవలసిన పుస్తకం 'అసలు మహాత్ముడు'.

---

పుస్తకం వెల: రు.150లు. కావలసినవారు: దుర్గా పబ్లికేషన్స్, జి-1, సాయికృష్ణా మాన్షన్, 1-1-230/9, వివేక్‌నగర్, చిక్కడపల్లి, హైదరాబాదు-500020. ఫోన్లు: 9441257961, 9441257962, 040-27632824.

**– సామల రమేష్‌బాబు**

పుస్తక సమీక్ష

## ప్రకృతి విలాపం




**దేశం** సాంకేతికంగా అభివృద్ధి చెందినా పర్యావరణాన్ని పరిరక్షించుకోవడంలో బాగా వెనుకబడి వుంది. ప్రకృతి మనకు సహాయ పడటానికే వుంది. ఇది మరచి వనరులను విచ్చలవిడిగా వాడి అనేక సమస్యలను కోరి తెచ్చుకొంటున్నాం. జల, వాయు, శబ్ద కాలుష్యాలు ప్రమాద స్థాయిని చేరుకున్నాయి. కొన్ని జంతువులు, పక్షులు, వృక్షాలు కనుమరుగవుతున్నాయి. పిచ్చుకలు కూడా కనుపించడంలేదు. అయినా, మనం ఏమీ జరగనట్లే ప్రవర్తిస్తున్నాం.

రచయిత వృత్తిరీత్యా మార్కాపురం కాలేజీలో జంతుశాస్త్ర ఉపన్యాసకులు. ఈయన కవిగా పర్యావరణంపై కవితలు వ్రాయడం హర్షించదగినది. రచయిత వాడుక భాషనే ఎక్కువగా వాడారు. పర్యావరణ పరిస్థితిని తెలుపుతూ మనం ఏం చేయాలో కూడా సూచించారు రచయిత.

పర్యావరణాన్ని పరిరక్షణ చేసుకునే శక్తి మనకందరకూ వుంది. ఉదాహరణకు బజారుకి వెళ్ళేటప్పుడు ఒక పలచని సంచిని తీసుకువెళ్తే సరిపోతుంది. అయినా మనం ప్లాస్టిక్ సంచులను వాడుతున్నాం. రోజులో పది నిముషాలు కూడా నడవడం లేదు! స్కూటర్ ఉండాల్సిందే.

విద్యుత్తు లేనిదే జీవితం లేదనుకునే వాళ్ళం. ఇప్పుడు సెల్ లేనిదే జీవితమే లేదు. కవి మాటల్లో... (పుట 24):

చేతుల్లో ఇమిడిపోయే / ఒక యంత్రం / నడుపుతోంది తంత్రం / ఏ చెవికీ విరామం లేదు / ఏ కర్ణభేరికీ భద్రతలేదు.

పర్యావరణాన్ని కాపాడుకుంటే అది మన ఆరోగ్యాన్ని కాపాడుతుంది. ఇది అందరికీ తెలిపేలా రచయిత 13 కవితలలో తన సందేశాన్ని తెలిపారు. ముఖ్యంగా చదవదగ్గ పుస్తకం.

**ఆకుపచ్చని శోకం,** (పర్యావరణ కవిత్వం) రచయిత: డేవిడ్ లివింగ్‌స్టోన్, పుటలు: 71, నవంబర్ 2014, వెల: రూ.50/-.
రచయిత, రాజగృహ, తార్లుపాడురోడ్, మార్కాపురం-523 316,
సెల్: 94402 11120.

## హైకూలకు జేజేలు!



**తె**లుగు సాహిత్యంలో ప్రస్తుతం హైకూల ప్రభావం బాగానే వుంది. రెండే రెండు పంక్తులలో జీవితం అంటే ఏమిటో చెప్పే శక్తి ఈ హైకూలకు చూపుతున్నారు. రచయిత బి.వి.వి. ప్రసాద్‌కు హైకూలపై మంచి పట్టు వుంది. ఉదాహరణకు (పుట 16):

చినుకు నగ్నంగా సిగ్గుపడి /విత్తనంలోంచి /పచ్చదనం కప్పుకొచ్చింది.

ఇంకొకటి (పుట 22):

వాన ముఖం కడిగాక / ఆకాశం / నేల అద్దాలలో చూసుకొంటోంది / కొన్ని హైకూలు ఆలోచింప జేస్తాయి.

ఉదాహరణకు (పుట 36): పాటబాగుంది / దూరంనుంచి వినపించడం ఇంకా బాగుంది.

మన పర్యావరణ పరిస్థితిపై ఒక హైకూ (పుట 45):

చెట్టు కూలింది / మోసుకు పోయారు / నీడ సైతం

రసాయన ఎరువులు ఎంత ప్రమాదమో చెప్పే ఒక హైకూ (పుట 46):

చిన్నప్పటి జామచెట్టు / పళ్ళు అందుతున్నాయి / అప్పటి రుచిలేవు.

జీవితంలో కొన్ని సంఘటనలు ఒక విధంగా నష్టాన్ని ఇంకో విధంగా లాభాన్ని కల్గిస్తాయి. అది ఎలాగంటే (పుట 82):

దొంగకి ధన్యవాదాలు
సామానుతో పాటు
నా భయాన్ని తీసుకుపోయాడు.

ఈ పుస్తకంలో హైకూలు గురించి వ్రాసిన వ్యాసాలు కూడా వున్నాయి. పాట బాగుంది. దూరంనుంచి వినిపించడం ఇంకా బాగుంది.

**హైకూలు**, రచయిత: బి.వి.వి. ప్రసాద్, పుటలు: 160 జూలై 2015, వెల: రూ.90/-. వాసిరెడ్డి పబ్లికేషన్స్, హైదరాబాద్-500 060.

## కవి హృదయం



**బి.వి.వి.** ప్రసాద్ 1989నుండి రచనలు చేస్తున్నారు. కవిత్వంపై పట్టు సంపాదించి హైకూలు, వచన కవిత్వంపై పుస్తకాలు తెచ్చారు. పురస్కారాలను అందుకున్నారు. ప్రస్తుత పుస్తకంలో 84 కవితలు వున్నాయి. అనేక అంశాలపై కవి స్పందించాడు.

ఒక మానవత్వంగల వ్యక్తి ఎలా వుంటాడో కవి విశ్లేషణ ఇలా వుంది (పుట 10).

గాయపడ్డ ప్రాణాలన్నింటినీ హత్తుకోవాలనిపిస్తుంది / లోకం చేసిన గాయాలన్నీ పోనిద్దూ అని మరచిపోవాలనిపిస్తుంది / ప్రపంచాన్ని పసిబిడ్డను చేసి ఎత్తుకోవాలనిపిస్తుంది / అప్పుడు నీకు జీవితమ్మీద జీవితమంత ప్రేమపుడుతుంది.

జీవితంలో ఒడిదుడుకులు తప్పవు. వీటిని ఎదుర్కోవడం తప్పనిసరి. కవి దీనిగురించి (పుట 43):

జీవితమంటే, ఇది ఒక దిగంబర దేవత / నిన్ను రమ్మనదు, పొమ్మనదు, ఇది కావాలనదు, వద్దనదు.

మతిలేని యాచకురాలి నవ్వులా నీ కలలన్నిటినీ కోసుకొంటూ తరలిపోతుంది.

నీ నమ్మకాలనీ, భయాలనీ, బంధాలనీ ఎటో విసిరేస్తుంది, మరలా ప్రోవుచేసి చూపిస్తుంది.

జీవితం గురించి వేరొక చోట కవి ఇలా అంటారు (పుట 61).

ప్రశ్న జీవం నింపుతుంది / ఆశ్చర్యం జీవింప చేస్తుంది / జవాబు మృత్యువవుతుంది.

అనేక విషయాలపైన కవి హృదయ స్పందన బాగుంది.

నువ్వు నిద్రపోదామనుకుంటే గోలచేసి లేపుతుంది. మేలుకొందామనుకొంటే, జోలపాడి తల నిమురుతుంది.

**నీలో కొన్నిసార్లు** (కవిత్వం), రచయిత: బి.వి.వి. ప్రసాద్, పుటలు:152, జూలై 2015, వెల: రూ.90/-. వాసిరెడ్డి పబ్లికేషన్స్, హైదరాబాద్-500 060.

**సమీక్షలు - డా॥ ఇమ్మానేని సత్యసుందరం,**
**మచిలీపట్నం, ఫోన్: 94400 40061**

శంకర భాష్యం

– రాణి శివశంకర శర్మ

# కవిత్వ ప్రేమికుడు పూజారి శర్మ

**పూ**జారులకి విశాల హృదయం లేదని, సంకుచిత మనస్కులని ఇంటర్నెట్‌లో మేధావులు తిట్టిపోస్తున్న సమయంలోనే నేను మిత్రుడు పూజారి శర్మని శబ్ద శ్రవణ యంత్రం ద్వారా కలవడం సంభవించింది. (ఇటీవల తెలంగాణాలో పూజారులు నమ్మె జరవడం వివాదాస్పదమయ్యింది).

ఫోనులో అతనితో నేను చాలాసేపే ముచ్చటించాను. అతనిని నేను మొదటిగా అడిగిన ప్రశ్న 'ఆధునిక కవిత్వం పట్ల నీ ఆసక్తికీ, నీ వృత్తికీ మధ్య అగాధంలేదా అని. 'ఔను వుంది' అన్నాడు. నేనే మరిచిపోయిన నా కవితా వాక్యాన్ని గుర్తుచేశాడు. చుండూరు దళితుల ఊచకోత కేసుని యిటీవలే హైకోర్టు కొట్టివేసిన సందర్భంలో అతడు గుర్తుచేసిన నా కవితా వాక్యాలకి చాలా ప్రాసంగికత వుంది.

నా భుజాలపై రెండు పుణ్యక్షేత్రాలు చుండూరూ, అయోధ్యా.

నాకు పూజారి శర్మని పరిచయం చేసింది అంబాజీపేటలోని ఎస్సీ కాలనీలో నివసించే కవి నామాడి శ్రీధర్.

ఈ పూజారి నాకు మంత్రాలు బదులు కవితావాక్యాల్నే లయబద్ధంగా వినిపించేవాడు. నామాడి శ్రీధర్ కవితల్ని కూడా ఆశువుగా చెప్పే కవితా స్వారస్యాన్ని వివరించేవాడు. నామాడి శ్రీధర్ వొక ద్రావిడ బ్రాహ్మణస్త్రీని ప్రేమించి కొన్ని కవితలు రాశాడని శర్మ చెప్పాడు. నిజమో కాదో తెలీదు కాని ఆ కవితలోని సౌందర్య రహస్యాల్ని శర్మ చెప్తుంటే ముగ్ధులమై వినాల్సిందే.

పూజారి శర్మ జీవితంలో ఎన్నో ఎదురుదెబ్బలు తిని ఒంటరిగా జీవిస్తున్నాడు. పెళ్ళి సంబంధం చూడమన్నాడు. పూజారుల్ని ఆధునిక బ్రాహ్మణ కన్యలు వరించడంలేదని అతడు వాపోయాడు. పూజారుల కష్టాలు పూజారులవి. మారిపోయిన కాలం తెచ్చిన కష్టాలు అవి.

ఇంతకీ ఈ ఒంటరి పూజారిని కవిత్వమే సజీవంగా నిలిపి వుంచిందా? త్రిపురనేని శ్రీనివాస్ కవిత్వ వాక్యాల దగ్గరినుండి అనేకమంది ఆధునికుల కవితా వాక్యాల్ని అతడు అలవోకగా చెప్పేవాడు. అందులో నాబోటి అప్రతిష్టుడి వాక్యాలుకూడా వుండడం నా అదృష్టం.

ఈ పూజారి నన్ను ఎందుకు యింతగా ఆకర్షిస్తున్నాడు. కాలం చెల్లిపోయే వాటి పట్ల నా సహజ ఆకర్షణ వల్లనా? చెలామణీలో వున్న ఆధునిక మనుషులలోని కృతకత్వం ఆ శిథిలాలయ పూజారివైపు నన్ను పరుగు తీయిస్తోందా?

పల్నాడులోని ఒక గ్రామంలోని పూజారి నైతిక కారణాలవల్ల తన వృత్తిని కోల్పోవడం నాకు తెలుసు. అతని భార్య ఒక చాకలివానితో సంబంధం పెట్టుకుంది. భార్యనే అదుపులో పెట్టుకోలేకపోయాడన్న నెపంతో అతన్ని పూజారి పదవినుంచి తొలగించారు.

అయోధ్య రామాలయ పూజారి లాల్‌దాస్ సమానత్వం, సౌభ్రాతృత్వాలకోసం పోరాడి ప్రాణాల్నే విడిచాడు. బాబ్రీమసీదుని కూల్చాలన్న హిందూవాదుల్నీ అద్వానీని కూడా అతడు వ్యతిరేకించాడు. అప్పటి అతిశూద్ర ముఖ్యమంత్రి కళ్యాణ్‌సింగ్ అతన్ని పూజారిగా తొలగించాడు. హిందూ టెర్రరిస్టులు చంపేశారు.

నిజానికి బ్రిటీష్‌వారే చాలా గుళ్ళలో శూద్రుల్ని తొలగించి బ్రాహ్మణుల్ని నియమించారు (హిందూ సామ్రాజ్యవాద చరిత్ర– స్వామి ధర్మతీర్థ) తిరుపతి దేవస్థానం వారు అన్ని కులాలవారికీ అర్చకత్వం నేర్పుతున్నారన్నాడు శర్మ. కాని 'సమాజం ఆమోదిస్తుందా అనేదే ప్రశ్న' అన్నాడు.

పల్నాడులోని శివాలయాల్లో బ్రాహ్మణేతర తొగట కులానికి చెందిన పూజారులు నాకు తెలుసు. ఏ విషయాన్నైనా అధ్యయనం చేసి మాట్లాడేవారు తగ్గిపోయారు. ఊరికే సెన్సేషనల్‌గా ఆవేశాన్ని వెళ్ళగక్కేవారే ఎక్కువ. పూజారుల సమస్య విషయంలోనూ అదే జరుగుతోంది.

ఇంతకీ పూజారులూ మనుషులే. అందుకే వాళ్ళలోనూ స్వార్థం వుంటుంది. ఆధునిక ప్రపంచంతో సంఘర్షణ వుంటుంది. పాపం వాళ్ళకి మీడియా అందుబాటులో వుండదు. జర్నలిస్టుల్లా ఆధునిక మేధావుల్లా మాటలు నేర్చినవాళ్ళుకాదు. మంత్రాలు మాత్రమే వారికి వచ్చు.

పూజారి శర్మకి కవిత్వం కూడా వచ్చు. అతడు స్వయంగా ఒక ఆధునిక కవిగా ఆవిర్భవించడానికి అతని జీవిత విధానం అవకాశం యివ్వలేదు.

నాకు పూజారులు అనగానే బ్రాహ్మణులకంటే బ్రాహ్మణేతరులే ఎక్కువగా గుర్తుకువస్తారు. ఆలయం అనేది నాలుగు వర్ణాలకి చెందినదని సంప్రదాయజ్ఞులు చెప్తారు. ఇవికాక అమ్మవారి గుడులు ప్రధానంగా శూద్ర అతిశూద్ర జాతులకి చెందినవి. నాకు తెలిసిన కొన్ని అగ్రహారాల్లోని అమ్మవారి గుళ్ళలో పూజారులు శూద్రులే. వారు పెద్దగా నియమాలని కూడా పాటించరు.

అమ్మవారి తీర్థాలకి గ్రామంలో చాలా ప్రాధాన్యం వుండేది. అత్తవారి ఇంటినుంచి ఆడపిల్లలు పుట్టింటికి వచ్చేది ప్రధానంగా అప్పుడే. పూజారులు అంటే శ్రమకి దూరంగా బతికేవాళ్ళు అనడం పూజారి అనే పదానికి గల విస్తృతార్థం తెలియక పోవడం వల్లనే. గ్రామాలకి దూరమై నగరాల్లో కూరుకుపోవడం వల్ల ఈ సంకుచిత దృక్పథం ఏర్పడింది. ఇటువంటి జర్నలిస్టుల్ని దేవుడే రక్షించాలి. వీళ్ళు మాలదాసరుల గురించి చరిత్రగానైనా చదువుకున్నారా?

పూజారి వ్యవస్థ పురోహిత వ్యవస్థ కాదు. రెండూ పూర్తిగా వేరు. పూజారి పూర్తిగా వైదికుడు కాదు. అందుకే పూజారి అనే పదానికి విస్తృతి ఎక్కువ. జన సామాన్యపు నమ్మకాల నుంచి పూజారి పుట్టాడు. పురోహితుడు జన సామాన్యాన్ని ప్రభావితం చేసే దృక్పథం కలవాడు. భక్తి ఉద్యమానికీ, గుడికీ, పూజారికీ, దేవుడికీ సంబంధం వుంది. పురోహితుడికి కర్మకాండ ముఖ్యం. దేవుడు కాదు.

భారతీయ గ్రామీణ వ్యవస్థలో దేవుడు అనేక రూపాలూ, అనేక జండర్లూ, అనేక కులాలుగా సాక్షాత్కరిస్తాడు. అందువల్లే పూజారులు కూడా బహుళంగా వుంటారు. ఆధునికత పూజారి వ్యవస్థలోని బహుళత్వాన్ని దెబ్బతీసింది.

ఇంతకీ దేవుణ్ణి మనమే సృష్టించుకొన్నాం. కనుక మనలోని గుణదోషాలు రెండూ దేవుడిలోనూ గుడిలోనూ ప్రతిబింబించాయి. మనలోని సంకుచితత్వమూ, విశాలత్వమూ కూడా ప్రతిధ్వనించాయి.

నేను అర్థవీడు అనే కుగ్రామంలోని మా పాఠశాల దగ్గరినుంచి, కంబం పట్నం వెళ్ళాల్సి వుంది. ఒక స్కూటర్ వాలాని లిఫ్టు అడిగాను. అతని జుట్టు చెదిరిపోయింది. బట్టలు మాసివున్నాయి. తాగి వున్నాడా అనే సందేహంతోనే బండి ఎక్కాను. స్కూటర్‌వాలా 'నీదేకులం' అని అడిగాడు. నేను బ్రాహ్మణ్ణి అని చెప్పాను. అతడికి అర్థంకాలేదు. మళ్ళీ అడిగాడు. మళ్ళీ అదే చెప్పాను. ఐనా అతనికి అర్థమైనట్లు లేదు. నీదేకులం అని అడిగాను. చెంచువాణ్ణి అని చెప్పాడు. ఒక చెంచువానికి బ్రాహ్మణుని ఉనికే తెలియకపోవచ్చు. తాను ప్రస్తుతం ఏసు ప్రభువుని నమ్ముకున్నానని, చర్చికి వెళ్తున్నానని చెప్పాడు. కాని తమ కుటుంబం చాలాకాలంగా కర్నూలుజిల్లాలో వున్న మంత్రాలమ్మ గుడిలో పూజారులు అని చెప్పాడు. బండికి అడ్డంగా వచ్చిన వినాయక విగ్రహంపైన భక్తులపైన ఆగ్రహం వ్యక్తం చేశాడు. వీళ్ళంతా పిచ్చోళ్ళు అన్నాడు. దేవుడి గురించి వాళ్ళకి తెలియదు అన్నాడు.

నీకు తెలుసా అని నేను అడిగాను. 'నాకు తెలుసు. నేనే దేవుణ్ణి. నాగుండె ఆగిపోతే ఈ ప్రపంచమే లేదు. ఇక్కడ నా గుండెలో దేవుడు ఉన్నాడు. అసలు నేనే దేవుణ్ణి' అన్నాడా చెంచు.

**రచయిత శ్రీ రాణి శివశంకర శర్మ ఉపాధ్యాయుడు,**
**రచయిత, విమర్శకులు, కంబం. ప్రకాశంజిల్లా.**
**ఫోను: 7396666942**

### మదరాసు తెలుగు అభ్యుదయ సమాజం ఆధ్వర్యంలో

# గురజాడ, జాషువా జయంతి



మదరాసు తెలుగు అభ్యుదయ సమాజం ఆధ్వర్యంలో సెప్టెంబరు 28న గుఱ్ఱం జాషువా మరియుగురజాడ అప్పారావుగార్ల జయంతిని చెన్నై పాతచాకలిపేటలో నిర్వహించారు. కార్యక్రమంలో రచయిత బొందల నాగేశ్వరరావు, తెలుగు భాషోద్యమ సమాఖ్య కార్యదర్శి బెల్లంకొండ నాగేశ్వరరావు, రచయిత కన్నారెడ్డి, పాల్గొన్నారు. వారు తమ ప్రసంగంలో, జాషువా-అప్పారావు తమ కవిత్వం ద్వారా సమాజంలో అనేక మార్పులు తేగలిగారనీ, అందువల్లనే నేటికీ వారి రచనలు మన మధ్య చిరస్థాయిగా ఉన్నాయని పేర్కొన్నారు. జాషువా సంతతికి చెందిన బొందల నాగేశ్వరరావును శాలువతో సత్కరించారు. కె. రాజగోపాలు, ప్రేమసాగర్, పార్థసారధి తదితరులు పాల్గొన్నారు.

● ప్రయివేటు యూనివర్శిటీల బిల్లును ఉపసంహరించుకోవాలి.
● పేదలకు విద్యను దూరం చేసే కొత్త విద్యావిధానం తప్పు
● విద్యారంగంపై సమగ్ర దృక్పథం ఉండాలి
● ప్రభుత్వం భాషావిధానం ప్రకటించాలి

# విద్యావికాస వేదిక పిలుపు

(ఫోటోలు : 3వ అట్టపై చూడండి)

విద్యా వికాస వేదిక ఆధ్వర్యంలో గుంటూరు జిల్లాపరిషత్ సమావేశ మందిరంలో 'అందరికీ విద్య–ఆంధ్రప్రదేశ్ అనుభవాలు' అంశంపై ఆదివారం విద్యావికాసవేదిక నిర్వహించిన సదస్సుకు మాజీ ఎమ్మెల్సీ కెఎస్ లక్ష్మణరావు అధ్యక్షత వహించారు. ప్రభుత్వ విద్య ద్వారానే అందరికీ విద్య అందుబాటులో ఉంటుందని, దానికోసం విశాల పౌర సమాజాన్ని ఏకం చేసి ప్రభుత్వాలను ప్రశ్నించేలా చైతన్యపరచాలని వక్తలు అభిప్రాయపడ్డారు. గతంకంటే రాష్ట్రంలో తమ పిల్లలను చదివించుకోవాలనే ఆకాంక్ష బాగా పెరిగిందని, అయితే అందుకనుగుణంగా ప్రభుత్వం విద్యా సౌకర్యాలను అందించడంలో నిర్లక్ష్యం వహిస్తోందని, విద్యపై సమగ్ర దృక్పథమే కొరవడిందని వారన్నారు.

విద్యా వికాస వేదిక రాష్ట్ర కన్వీనర్, ఎమ్మెల్సీ వి. బాలసుబ్రహ్మణ్యం 'రాష్ట్ర విద్యారంగం– ప్రస్తుత పరిణామాలు' అంశంపై మాట్లాడుతూ విద్యారంగంపై ప్రభుత్వాలకు, ఇతర సంస్థలకు నిర్దిష్టమైన దృక్పథం కొరవడిందని, ఈ వేదిక ఆ లోటును భర్తీ చేయాలని అన్నారు. దేశంలో ఎక్కడా లేనివిధంగా రాష్ట్రంలో పాఠశాల విద్య 42 శాతం ప్రయివేటు, కార్పొరేట్ల చేతుల్లోకి వెళ్లిపోయిందని తెలిపారు. భవిష్యత్తులో బడా పెట్టుబడిదారులూ ప్రవేశించబోతున్నారని చెప్పారు. హైస్కూళ్లలో ఆంగ్ల మాధ్యమం ప్రవేశపెట్టి విఫలమైన ప్రభుత్వం తిరిగి ప్రాథమిక విద్యలోనూ ప్రవేశపెట్టేందుకు సిద్ధమవటం ఆందోళనకరమన్నారు. 70శాతంగా ఉన్న తెలుగు మాధ్యమ విద్యార్థులకు ఇంగ్లీషు మీడియం పేరిట అన్యాయం చేయటం తగదని హెచ్చరించారు. 90 ఎస్‌సి హాస్టళ్లను మూసేశారని, రానున్న నాలుగేళ్లలో మొత్తం హాస్టళ్ల మూసివేతకు రంగం సిద్ధం చేశారని వివరించారు. ఆర్ఎంఎస్ఎ, ఎస్ఎస్ఎ ద్వారా కేంద్రం ఇప్పటివరకు ఇచ్చిన నిధుల్లో ఇప్పటి కేంద్ర ప్రభుత్వం కోతలు విధించిన ఫలితంగా ఆ ప్రభావం మౌలిక సదుపాయాల కల్పనపై పడుతుందని విశ్లేషించారు. రాష్ట్రంలో విద్య సామాజిక, రాజకీయ ఎజెండాగా మారాల్సిన అవసరం ఉందని, నాణ్యమైన విద్య కోరుకునే గొంతుకలన్నీ ఏకమవ్వాల్సిన తరుణమిదేనని ఉద్ఘాటించారు.

ప్రైవేటు యూనివర్శిటీల అంశంపై ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం మాజీ విసి వియన్నారావు మాట్లాడుతూ 1956 యుజిసి చట్టం ప్రకారం రాష్ట్ర ప్రభుత్వాలు ప్రైవేటు వర్శిటీల ఏర్పాటుకు అనుమతినిచ్చారని, దీన్ని ఆసరాగా చేసుకుని అనేక రాష్ట్రాల్లో బడ్డీకొట్లలాగా వర్శిటీలు వెలిశాయని చెప్పారు. చత్తీస్‌ఘడ్‌లో ఒక్క ఏడాదిలోనే 120 వర్శిటీలకు అక్కడి ప్రభుత్వం అనుమతులిచ్చిందన్నారు. ఫలితంగా నాణ్యతలేని, సౌకర్యాలు లేని వర్శిటీలు పుట్టగొడుగుల్లా వెలిశాయని చెప్పారు. ఒక్క ప్రైవేటు వర్శిటీలోనూ రీసెర్చ్ కోర్సులు లేవని, కేవలం డిగ్రీ, పిజి కోర్సులకే పరిమితమయ్యాయని వివరించారు. డబ్ల్యుటిఒలో గాట్స్ నిబంధనలకు తలొగ్గి సంతకాలు చేసిన ఫలితంగా విద్యా సంస్కరణలు వేగవంతమయ్యాయని, విద్యారంగ బాధ్యతల నుంచి ప్రభుత్వాలు వైదొలగుతున్నాయని చెప్పారు. రాష్ట్రంలోనూ ప్రయివేటు వర్శిటీలకు అనుమతులు ఇచ్చుకుంటూ పోతే, ప్రమాణాలతోపాటు సంప్రదాయ వర్శిటీలు దెబ్బతింటాయన్నారు. ప్రపంచంలోని వర్శిటీలు ఆయా దేశాల పరిస్థితులకు అనుగుణంగా ఉంటాయని, ఈ నేపథ్యంలో ప్రపంచంలోని అన్ని వర్శిటీలకు కలిపి ప్రకటించే ర్యాంకులు పరిగణనలోకి తీసుకోవటం సరికాదని అన్నారు.

నూతన విద్యా విధానంపై విద్యారంగ విశ్లేషకులు సిహెచ్ శ్రీహరి మాట్లాడుతూ కేంద్ర ప్రభుత్వం విద్యా విధానంలోమార్పులు తేనుందని, దీనికోసం వెబ్‌సైట్‌లో అభిప్రాయాల సేకరణకు మాధ్యమిక విద్యపై 13 ప్రశ్నలు, ఉన్నత విద్య గురించి 15 ప్రశ్నలతో కూడిన పత్రాలు ఉంచిందని సాధారణ పౌరులు సైతం వాటిని చదివి సమాధానాలు చెప్పాలన్నారు. ప్రశ్నల సరళిని పరిశీలిస్తే అందరికీ విద్యను అందించటానికి, ప్రస్తుతం ఉన్న సమస్యలను ఎక్కడా ప్రస్తావించలేదని, ప్రభుత్వ ప్రైవేటు భాగస్వామ్యంతో విద్య ఉండాలని, పేదవారికి విద్యను మరింత దూరం చేసేలా ప్రశ్నలున్నాయని తెలిపారు. డాక్టర్ వి. అంజిరెడ్డి విద్య–కార్పొరేటీకరణపై మాట్లాడుతూ ఐఎంఎఫ్ నుంచి అప్పులు తీసుకున్నందున వారు విధించిన షరతుల అమల్లో భాగంగా 1990 నుంచి ప్రభుత్వాలు విద్యారంగ బాధ్యతనుంచి విరమించుకుంటున్నాయన్నారు. విద్య బాధ్యతను వ్యాపార సంస్థలకు అప్పగిస్తే వారు లాభాల కోసమే విద్యనందిస్తారు మినహా సమాజ శ్రేయస్సు వారి దృష్టిలో ఉండబోదన్నారు.

సభాధ్యక్షులు కెఎస్ లక్ష్మణరావు మాట్లాడుతూ ప్రైవేటు వర్శిటీల బిల్లును ఉపసంహరించుకోవాలని, సంప్రదాయ వర్శిటీలను బలోపేతం చేయాలని, రాష్ట్రంలో ఏర్పాటు చేయబోయే కేంద్ర విద్యాసంస్థలకు స్థలాన్ని సేకరించాలని డిమాండ్ చేశారు. సదస్సులో ఎమ్మెల్సీ బొడ్డు నాగేశ్వరరావు, ప్రొఫెసర్ పరిమి, కన్నా మాస్టారు, విద్యా వికాస వేదిక జిల్లా కన్వీనర్ ప్రభుదాసు, షిప్ సంస్థ నుండి రమాదేవి, బాలల అక్టా నాయకులు కైలాస్‌నాథ్, నరేంద్ర, తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షుడు డా॥ సామల రమేష్‌బాబు పాల్గొన్నారు.

## ప్రభుత్వం భాషావిధానం ప్రకటించాలి:



డా॥ సామల రమేష్‌బాబు ప్రసంగిస్తూ– "భాషావిధానం స్పష్టంగా లేకపోతే సరైన విద్యావిధానం ఎలా రూపొందుతుందని ప్రశ్నించారు. తెలుగు రాష్ట్రాలయి వుండీ విద్యారంగంలో తెలుగు వినియోగం గురించి, ఆధునిక అవసరాలకు తగ్గస్థాయికి తెలుగుభాషను పెంపొందించుకోవడం గురించి ప్రభుత్వాలు శ్రద్ధ వహించడంలేదని, భాషోద్యమకారులు పోరాడి సాధించుకొన్న తెలుగు భాషా మంత్రిత్వశాఖ పనిచేయటంకోసం ప్రభుత్వం వెంటనే భాషావిధానంపై ప్రకటన చేయాలన్నారు. 2003లో వచ్చిన జి.ఒ.నెం.86 ప్రకారం తెలుగు మాధ్యమం కాకుండా ఇతర మాధ్యమాలలో నడిచే పాఠశాలల్లో తెలుగును తప్పనిసరిగా శ్రద్ధగా బోధించాల్సి వుండగా అన్ని ప్రభుత్వాలూ దాన్ని నిర్లక్ష్యం చేశాయని, కార్పొరేట్ శక్తులకు దాసోహమైనాయని అన్నారు. విద్యావికాస వేదిక ఆశయలక్ష్యాలతో తెలుగు భాషోద్యమ సమాఖ్యకు పూర్తిగా ఏకీభావం వున్నదని చెప్పి, వేదిక కార్యక్రమాలకు పూర్తి సమర్థనను తెలియజేశారు.



## సంస్కృతి పథంలో సంజీవదేవ్

(సంజీవదేవ్ జీవితంపై యథేచ్ఛా చింతన)

రచయిత: **టి. రవిచంద్**

పుటలు : *38* వెల: *25/-*

ప్రతులకు : హెచ్.నెం.11-5-4, నాళంవారి వీధి, బాపట్ల - 522 101, గుంటూరు జిల్లా.

ఫోన్: 9966134406



## తెలుగు వెలుగులు (గీతికలు)

రచయిత: **డా. తిరుమల శ్రీనివాసాచార్య**

పుటలు : *54* వెల: *80/-*

ప్రతులకు : తిరుమల శ్రీనివాసాచార్య, ఎ 40, 201, సింగపూర్ క్లాస్ (సంస్కృతి) టౌన్‌షిప్, హైదరాబాద్-500 088. ఫోన్: 99493 65903.



## తెలుగు సాహిత్యంలో స్త్రీ పాత్రల పరిణామం

(వ్యాస సంకలనం)

ప్రచురణ: **20వ తానా మహాసభల లిటరరీ కమిటీ**

ప్రతులకు : కథాసాహితి, 164, రవికాలనీ, తిరుమలగిరి, సికింద్రాబాద్ - 500 015. ఫోన్:



## కలంలో కలకలం (రుబాయీల సంపుటి)

రచయిత: **డా॥ తిరుమల శ్రీనివాసాచార్య**

పుటలు : *90* వెల: *80/-*

ప్రతులకు : తిరుమల శ్రీనివాసాచార్య, ఎ 40, 201, సింగపూర్ క్లాస్ (సంస్కృతి) టౌన్‌షిప్, హైదరాబాద్-500 088. ఫోన్: 040-2719 6507



## ఇండియాలో సామాజిక పరిణామం

రచయిత: **కె.ఎస్.చలం**

పుటలు : *140* వెల: 100/-

ప్రతులకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ఫ్లాట్ నెం.85, బాలాజీనగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్ - 500 006. ఫోను : 040-23521849



## వేకువ పిట్ట (కవిత్వం)

రచయిత: **ఎస్. ఆర్. భల్లం**

పుటలు : *84* వెల: *100/-*

ప్రతులకు : భల్లం సామ్రాజ్యలక్ష్మి, 4-87-12, ఇందిరానగర్, గాంధీబొమ్మ సెంటర్, తాడేపల్లిగూడెం - 534 101. ఫోన్: 98854 42642




Owned, printed & published by Samala Lakshmana Babu (9440448244) and printed at Sri Mahalakshmi Offset Printers, 16-7-20, Veera Raghavulu Street, Sharabu Bazaar, Tenali, Guntur Dist. and published from 8-386, Jivaka Bhawan, Angalakuduru Post, Tenali Mandal, Guntur Dist. - 522211. Editor: Dr. SAMALA RAMESH BABU (9848016136)

RNI-APTEL/2015/62362

## ప్రభుత్వం తమ భాషా, విద్యా విధానాలను ప్రకటించాలి : విద్యావికాస వేదిక డిమాండ్


ప్రసంగిస్తున్న ఎంఎల్‌సీ శ్రీ విఠపు బాలసుబ్రహ్మణ్యం


ప్రసంగిస్తున్న సభాధ్యక్షుడు పూర్వ ఎంఎల్‌సీ లక్ష్మణరావు

సభ వివరాలు 49వ పేజీలో...

## భాషను బ్రతికించుకుంటేనే సాహిత్యానికి మనుగడ :
## అఖిల భారతీయ సాహిత్య పరిషత్ ఉత్తరాంధ్ర సాహితీ సదస్సులో డా॥ సామల రమేష్‌బాబు





ఎడమనుండి కుడికి :
డా॥ విజయసారథి, డా॥ ఎస్. విజయకుమార్, డా॥ డి.వి. సూర్యారావు, డా.ఎం. విజయగోపాల్, డా॥ ఎస్. రమేష్‌బాబు, డా॥ కె. హరిబాబు, ఎం.పి.

---

తెలుగు భాషను రక్షించుకోవడం, పెంపొందించుకోవడం మనకు జన్మతోనే వచ్చిన హక్కు అనీ, దాన్ని కాపాడుకోవలసిన బాధ్యత కూడా మనదేనని తెలుగు బాషోద్యమ సమాఖ్య అధ్యక్షుడు, 'అమ్మనుడి' పత్రిక సంపాదకుడు డా॥ సామల రమేష్‌బాబు ఈ నెల 27న విశాఖపట్నంలో జరిగిన సాహిత్య సదస్సులో అన్నారు. అఖిల భారతీయ సాహిత్య పరిషత్తు ఆధ్వర్యంలో 'నేటి సాహిత్యంలో మానవ సంబంధాలు' అనే అంశంపై ఒకరోజు సదస్సు జరిగింది. విశాఖ పౌర గ్రంథాలయంలో అ.భా.సా. పరిషత్తు నగర అధ్యక్షులు డా॥ డి.వి. సూర్యారావు అధ్యక్షతన జరిగిన ఈ సదస్సులో ముఖ్య అతిథిగా పార్లమెంటు సభ్యులు డా॥ కె. హరిబాబు, గౌరవ అతిథులుగా డా॥ సామల రమేష్‌బాబు, జాగృతి పూర్వ సంపాదకులు డా॥ వడ్డి విజయసారథి, విజయ నిర్మాణ్ అధినేత డా॥ ఎస్. విజయకుమార్ పాల్గొన్నారు. ప్రారంభ సభ తర్వాత సాహితీ సదస్సులో ఉత్తరాంధ్ర జిల్లాల నుండి వచ్చిన కవులు సుమారు 40 పత్రాలను సమర్పించి ప్రసంగించారు. నన్నయ విశ్వవిద్యాలయం ఆచార్యులు డా॥ తలారి వాసు, తెలంగాణ కార్యదర్శి మావుదూరి సూర్యనారాయణ, భారతీయ శిక్షణ మండల్ పూర్వ జాతీయ కార్యదర్శి డా॥ దుగ్గిరాల విశ్వేశ్వరం, పరిషత్తు ప్రాంత సంచాలకులు డా॥ మోపిదేవి విజయగోపాల్ ప్రధాన ప్రసంగాలు చేశారు.

"తెలుగు రాష్ట్రాల ప్రభుత్వాలు తెలుగులోనే పూర్తిగా పరిపాలించాలని, తెలుగు ద్వారానే సర్వవిజ్ఞానం ప్రజలకు అందేలా చెయ్యాలని, అందువల్ల తెలుగుకు విద్యారంగంలో కూడా సాధికారిత (ఎంపవర్‌మెంట్) కల్పించాలని, డా॥రమేష్‌బాబు డిమాండ్ చేశారు. ఈ లక్ష్యాల సాధనకు తెలుగు రచయితలు, కవులు ఉద్యమంలోకి రావాలని ఆయన కోరారు. భాష ప్రాణం వంటిదని, భాష అనే ఊపిరి లేనపుడు సాహితీ సంస్కృతుల వంటి భౌతిక, నైతిక శక్తులు నశించిపోతాయని అంటూ ఈ శాస్త్రీయకోణం నుంచి మనం ఆలోచించాలని సభికులకు విన్నవించారు.

AMMANUDI (Telugu Monthly)
October 2015, Vol.1, Issue 8.

RNI-APTEL/2015/62362
Postal Reg. No.TEN/12/2015-17